# చతుర

డిసెంబరు 1985
రెండు రూపాయలు





యక్షిణి:
మహాబలిపురం
ఫోటో: శ్రీనగేష్

# చతుర

సంపుటి : 8   డిసెంబర్ 1985   సంచిక : 11

## ఈ నెల సమగ్ర నవల

ఆమె అందమైనది. మంచిమనసు కలది. విద్యావంతురాలు. అన్నింటినీ మించి, తనను వలచివచ్చింది! కాని...

... మనసులో ఏవో అస్పష్టమైన అనుమానాలు. ...రు ఏకమైతే ఏవో విపరీత పరిస్థితులను ఎదుర్కోవా... భయం...ఏదో జరగరానిది జరుగుతుందనే ...ళన...అతడి ముఖంలో మారిన భావాలను ...చి రెట్టించిందామె.

...ండి...నన్ను పెళ్లి చేసుకోగలరా?"

... అతడి సమాధానం?

...న యువతిని స్వీకరించేందుకు వెనుకంజవేసి...

# ...రికివాడు



...చుకునే పరిస్థితి ఎందుకు తెచ్చుకున్నాడు? ...ంతో అతను పొందిందేమిటి? పోగొట్టుకున్న

## ...బాబు

...వెలువడిన మానసిక విశ్లేషణాత్మక రచన ...ఈ నెల చతుర సమగ్ర నవల!

ముఖచిత్రం : జగ్ మోహన్

కవర్ డిజైన్ : ఆనంద్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# తాజాదనం రోజంతా నిలిచేలా ఉంచండి.

కొత్తది







అసలైన తాజాదనం! అదే రోజంతా నిలిచి వుండే తాజాదనం! మీకు సాధారణ సబ్బులు ఇచ్చేలాంటి కొద్ది సేపట్లో మాయమైపోయే తాజాదనం కాదు. శరీర దుర్గంధం పోగొట్టి మిమ్మల్ని రోజంతా హాయిగా వుంచగల తాజాదనం—అదే కొత్త సింథాల్ మాత్రమే ఇవ్వగల వాగ్దానం.

సింథాల్‌లో ఇప్పుడు మనమోహక కొత్త పరిమళం కలదు. దుర్గంధాన్ని పోగొట్టడానికి సింథాల్‌లో గల ప్రభావవంతమైన శక్తి చర్మ క్రిములను నాశనం చేసి, మిమ్ములను రోజంతా తాజాగా దుర్గంధ రహితంగా వుంచుతుంది.

CHAITRA-B-G-330 TEL

కేవలం **సింథాల్**
మాత్రమే మిమ్మల్ని దినమంతా తాజాగా దుర్గంధరహితంగా ఉంచగలదు.

Godrej ఉత్పాదన

# వనిత

## వ్యంగ్య చిత్రకారిణి

ప్రపంచం మొత్తంలో ఆడ కార్టూనిస్టుల్లో ప్రఖ్యాతి చెందినవారు నలుగురే వున్నారు. వారిలో ఇద్దరు ఇంగ్లండుకి, ఒకరు ఫ్రాన్సుకి చెందినవారు కాగా నాలుగవ కార్టూనిస్టు భారతీయురాలైన మంజులా పద్మనాభన్! ఆమె జర్నలిస్టు, ఫొటోగ్రాఫర్, డిజైనర్, ఆర్ట్ క్రిటిక్ కూడా!

మంజుల తండ్రి పద్మనాభన్ భారత ప్రభుత్వ విదేశీ సంబంధశాఖలో ఉన్నతాధికారిగా పనిచేసి రిటైరయ్యాడు. ఆమె కొడై కెనాల్‌లోని ప్రెజెంటేషన్ కాన్వెంట్‌లో స్కూలు విద్య ముగించి, బొంబాయిలోని ఎలిఫిస్టోన్ కాలేజీలో చరిత్రలో ఎం.ఎ. చేసింది.

బొంబాయినుంచి వెలువడే 'సండే అబ్జర్వర్' పత్రికలో ఆగస్టు '82 నుంచి మంజుల 'డబుల్‌టాక్' అనే పేరిట వరుసగా కార్టూన్లు గీయనారంభించింది. ఎంతోమంది ఆ కార్టూన్లను మెచ్చుకుంటూ లేఖలు రాస్తున్నా, తన కార్టూన్లను విమర్శిస్తూ వచ్చిన లేఖలపై ఆమె మక్కువ చూపిస్తుంది. ఒకరు ఆమెను ఆక్షేపిస్తూ,



# ప్రపంచం

"ఓ మంచి ఆస్పత్రిలో మంజుల మెదడులో లోపమేమిటో పరీక్ష చేయించాలి. అందుకయ్యే ఖర్చంతా నేను భరిస్తాను" అని రాశారు.

మంజుల కార్టూన్లు, గల్పికలు ప్రముఖ ఆంగ్ల పత్రికలలో ప్రచురితమయ్యాయి. ఇటీవల ప్రారంభమైన మహిళా పత్రిక 'వుమన్ టుడే'లో ఆమె హాస్యంతో కూడిన గల్పికలు ధారావాహికంగా రాస్తోంది.

మంజుల 'అర్ధసత్య' సినిమాకి పోస్టర్ డిజైనింగ్ చేసింది. "నాకు వివాహ వ్యవస్థ పట్ల నమ్మకంలేదు. మరొకరితో జీవితం పంచుకోవడం అవసరమని నేను భావించడంలేదు. ఈ దేశంలో భార్యల్ని వంటింటికీ, పిల్లల పెంపకానికీ పరిమితం చేసే పెళ్ళి నా దృష్టిలో గుదిబండ లాంటిదే" అంటుంది మంజుల.

## సర్ప ప్రియత్వం

తమిళనాడులోని గేంగి గ్రామానికి చెందిన 25 ఏళ్ళ శివకుమార్‌కి పాములంటే ఎనలేని ఆసక్తి, మక్కువ. అతను ఇప్పటి వరకూ 3వేల పైనే పాముల్ని పట్టుకున్నాడు. పాములేగాదు, ఇతర ప్రాణులన్నా అతనికిష్టమే!

"చిన్నప్పటినుంచీ నాకు పక్షులన్నా,



అడవి జంతువులన్నా ఇష్టంగా వుండేది. బడిలో చదువుకునే వయసులో పక్షుల కూతలు వింటూ, 'అవి అలా కూసేది సంతోషంతోనా, బాధతోనా, కోపం తోనా?' అని నాలో నేను ప్రశ్నించుకునే వాడిని. ఆవిధంగా వాటి కూతలు వింటూ, తర్కించుకుంటూ నేను పక్షుల భాషను అర్థంచేసుకోసాగాను. ఇప్పుడు నేను పక్షుల, జంతువుల అరుపుల్ని బట్టి వాటి భావాలేమిటో చెప్పగలను."

"తర్వాత నేను తొండలపై ఆసక్తి పెంచుకున్నాను. నా స్నేహితులు అవి ఎక్కడైనా కనబడితే చావ మోదుతూ ఆనందించేవారు. కాని, నేను ఒక తొండను పట్టుకుని ఇంట్లో పెంచాను. ఒక పట్టాన దొరకని తొండను పట్టుకోగలిగినందుకు నన్ను స్నేహితులందరూ పొగిడారు. అప్పుడే నాకు 'తొండను పట్టుకుంటేనే ఇంతగా మెచ్చుకుంటున్నారే, ఇక పాముల్ని పట్టుకుంటేనో...!' అన్న ఆలోచన వచ్చింది.

"అంతే! నేను దగ్గిరలోని ఓ చెరువు వద్దకెళ్ళి ఒక నీటిపామును పట్టి సీసాలో పెట్టుకున్నాను.ఆ సీసాతో జనసమ్మర్దంగా వున్న వీధిలో నడుస్తుంటే ఓ పెద్దమనిషి నా భుజంపై తట్టి, 'దీంట్లో గొప్ప ఏముంది? పామును సీసాలో పెట్టుకుని ఎవరైనా తిరగగలరు' అని నన్ను హేళన చేశాడు. దానికి నాకు పౌరుషం వచ్చి, మరో పెద్ద నీటిపామును పట్టుకుని చేతికి చుట్టుకుని వీధులన్నీ తిరుగుతుంటే, అందరూ నా ధైర్యానికి ఆశ్చర్యపోయారు. అలా అందరి దృష్టినీ నావైపు తిప్పు కున్నందుకు ఎంతో సంతోషం కలిగింది. ఆ విధంగా నాకు పాముల్ని పట్టుకునే పిచ్చి మొదలైంది" అంటూ తన గురించి వివరించాడు శివకుమార్.

శివకుమార్‌కి మొదట్లో పాముల్ని ఎక్కడ వుంచడమనేదిసమస్యగా వుండేది. అతని మిత్రుడైన ఓ వ్యాపారికి కూడా పాములపై ఆసక్తి వుండటంతో వాటిని తన దుకాణంలో పెట్టుకోనిచ్చేవాడు.

ఇప్పుడు శివకుమార్ తన ఇంటి పెరట్లోనే సిమెంటు రేకుల పై కప్పుతో ఓ గూడు నిర్మించాడు. అతని దగ్గిర 2 నాగుపాములతో కలుపుకుని మొత్తం 6 పాములు, 2 పూసరవెల్లులు, మరెన్నో తేళ్లు వున్నాయి.

శివకుమార్‌కి ఏడుగురుఅన్నదమ్ములు, ఇద్దరు అక్కచెల్లెళ్ళు వున్నారు. ఇప్పుడా కుటుంబంలోని వారందరికి పాములంటే ఆసక్తి పెరిగింది. ఇరుగు పొరుగు వాళ్లు వారిని 'పాముల కుటుంబం' అంటారు.

జేబురుమాల్లా ఎప్పుడూ ఓ చిన్న పసిరిక పాముని జేబులో పెట్టుకొని తిరగడం శివకుమార్‌కివున్న ఓ వింత అలవాటు. దానివెనుక ఓ కారణమున్నట్టు చెబుతాడతను. దక్షిణ భారతీయులకి పాము తోకను పట్టుకున్న యువతి బాగా వంట చేయగలదనే నమ్మకముంది. శివకుమార్ ఆ నమ్మకంగల యువతుల్ని కలుసుకుని పాము తోకను తాకే అవకాశం కల్పిస్తాడు. అది జరిగిన 2,3 రోజులకి తాము వంట రుచిగా చేయగలుగుతున్నట్టు ఆ యువతులు శివకుమార్‌తో చెబు తుంటారు.

శివకుమార్‌కి పాముల్ని పెంచడంలో ఎలాంటి వ్యాపార వుద్దేశమూలేదు. పాములకోసం ఓ పెద్ద ఫారాన్ని కట్టించ డంతోపాటు, ఇప్పుడు ఎవరూ పట్టించుకోని కొన్నిరకాల జంతువులకి శిక్షణ ఇచ్చి,




## నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్ళు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అంటే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క
నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండెలాగో.



మీ పళ్ళలో యిరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్ని, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్ని తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటె దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




B84.55 Tel

## *దీని తాజా పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

వాటిని పెంపుడు జంతువులుగా మార్చాలనే అభిలాష వుంది.

## వింత అలవాటు

చిత్రకళలో ఏమాత్రం ఆసక్తిగలవారైనా, అంతర్జాతీయంగా ప్రఖ్యాతి పొందిన యమ్.ఎఫ్. హుస్సేన్ గురించి వినే వుంటారు. తన ఆధునిక చిత్రకళ ద్వారా లక్షలకొద్దీ డబ్బు సంపాదించినా హుస్సేన్ కాళ్ళకు చెప్పులు లేకుండానే తిరుగుతాడు.

అతనికి ముక్తిబోధ్ అనే హిందీ కవి సన్నిహిత మిత్రుడు. చాలాకాలం జబ్బుతో బాధపడి, చివరికి మరణించిన ముక్తిబోధ్ శవయాత్రలో హుస్సేన్ పాల్గొన్నాడు. అప్పుడు మిత్రుడిపైగల ప్రేమతో వేసవి ఎండను కూడా లెక్క చేయకుండా చెప్పులు లేకుండా నడిచాడు. అతనికారోజు చెప్పులు లేకపోవటం ఎంతో తేలికగా అనిపించింది. అప్పట్నుంచీ చెప్పులు వేసుకోకుండా తిరగ సాగాడు.



హుస్సేన్ చిన్న పిల్లవాడిగా వున్నప్పుడు అతనూ, అతని తల్లీ చాలా బలహీనంగా వుండేవారు. హుస్సేన్ ఎపుడూమరణానికి సమీపంగా వెళ్ళి తిరిగి బతుకుతుండేవాడు. తల్లిఅతన్ని తండ్రివాడే బూట్లలో నిలబెట్టి, కొడుకు కూడా తండ్రి వయసువచ్చేంతవరకూ ఎదగాలని భగవంతుడిని ప్రార్థిస్తుండేది. ఒకసారి హుస్సేన్‌కి బాగా జబ్బు చేసింది. తల్లి అతని మంచం చుట్టూ ఏడుసార్లు తిరిగి తనను తీసుకుపోయి అయినా కొడుకుని బతికించమని దేవుడిని వేడుకుంది. మరుసటిరోజు వుదయం ఆమె మరణించింది. హుస్సేన్ జబ్బునుంచి కోలుకున్నాడు.

హుస్సేన్ విదేశాలకు వెళ్ళినపుడు మాత్రమే అక్కడి తీవ్రమైన చలినుంచి తట్టుకునేందుకు బూట్లు వేసుకుంటాడు. మనదేశంలో వున్నప్పుడు పాదరక్షలు లేకుండానే తిరుగుతాడు.

## పులి వేట

సుందర్‌బాన్స్ అరణ్యాల్లోని పులులు నిర్ణీతవేళల్లోనే మనుషుల్ని వేటాడతాయి. ఉదయం 6 నుంచి 8 గంటలమధ్య,

మధ్యాహ్నం 3 నుంచి 5 గంటలమధ్య, రాత్రి 11గంటల సమయంలోనూ వాటికి మనుషుల్ని చంపి తినడం అలవాటు. పగటివేళ ఈ నాలుగు గంటలలోనూ అరణ్యంలో జనసంచారం ఎక్కువగా వుండటమే పులులు ఆ సమయాన్ని మనిషి వేటకు ఎంచుకోవడానికి కారణం. రాత్రి 11 గంటలకి మనుషులు గాఢ నిద్రలో వుంటారుగనక, అప్పుడు పులికి వేటాడటం సులభతరమవుతుంది. పశ్చిమ

ఇది సుందర వనారణ్యాల్లోని పులులకు వర్తించదు. అటవీశాఖవారి సర్వే ప్రకారం సుందరవనాల్లోని పులులలో నాలుగో వంతు వరకూ పుట్టుకతోనే నరమాంస భక్షణ చేసేవిగా వుంటాయని తేలింది. సుందరవనాల్లోని పులులు ప్రపంచంలోని పులులన్నింటికంటే భిన్నమైనవి. ఆ 25 శాతం నరమాంసభక్షణచేసే పులుల్ని మినహాయిస్తే, మిగిలినవాటిలో కొన్ని అరణ్యాల్లో ఆహారం లభించనప్పుడు



బెంగాల్‌కి చెందిన అటవీశాఖ నిర్వహించిన ఒక సర్వేలో ఈ వాస్తవాలు బయటపడ్డాయి.

పశ్చిమబెంగాల్‌లోని సుందర్‌బాన్స్‌లో గత అయిదేళ్లలో పులుల సంఖ్య పెరగడంతోపాటే వాటి వాతబడి మరణించిన వారి సంఖ్యకూడా పెరిగింది. ఏడాదికి సగటున 50 మందిపైనే పులులకి ఎరలై మరణానికి గురవుతున్నారు. తేనె సేకరించేవాళ్లు, కట్టెలు కొట్టేవాళ్లు, మూలికలు సేకరించేవాళ్లు ఆ విధంగా పులులవల్ల మరణిస్తున్నారు.

పరిస్థితుల ప్రభావంవల్ల తప్ప పులి సామాన్యంగా నరమాంస భక్షకిగా మారదని 'జిమ్ కార్బెట్' రాశాడు. కాని,

దగ్గరలోని గ్రామాలకు వెళ్ళి మనుషుల్ని తింటాయి.

పులుల వాతబడ్డ మనుషులలో 80 శాతం మంది పైన చెప్పిన 5 గంటల్లోనే ఆవిధంగా చనిపోయినట్టు కనుగొన్నారు. అందుచేత ఆ వేళల్లో ప్రజలు అరణ్యంలోకి వెళ్లగూడదని అటవీశాఖవారు సలహా ఇచ్చారు. దాన్ని పాటించడంతో గత ఏడాది మరణాలు 20 శాతానికి తగ్గాయి. ఇప్పుడు బేటరీతో నడపబడే మరమనుషుల్లాంటి కృత్రిమ మానవుల్ని నరమాంస భక్షణచేసే పులుల అలవాట్లను గమనించేందుకు ఉపయోగిస్తున్నారు.

# పాడే గ్రీటింగ్స్

వివాహ, జన్మదిన, నూతన సంవత్సర పండుగల సందర్భాలకి స్నేహితులు, ఆత్మీయులకి గ్రీటింగ్స్ ద్వారా శుభాకాంక్షలు తెలిపే అలవాటు చాలామందికి వుంటుంది. ఇప్పటివరకూ ఎన్నో రంగు రంగుల బొమ్మల గ్రీటింగ్స్ వాడుకలో వున్నాయి.

అయితే ఇపుడు అమెరికాలోని గ్రీటింగ్స్ కార్డుల పరిశ్రమ ఎలక్ట్రానిక్స్ తోడ్పాటుతో మాట్లాడే, పాడే గ్రీటింగ్స్ తయారుచేస్తోంది. పుట్టినరోజునాడు గ్రీటింగ్స్ అందుకున్నవారికి, కవరు



విప్పగానే ఓ శ్రావ్యమైన కంఠం 'హేపీ బర్త్‌డే టూ యూ' అని వినిపిస్తుంది. దాంతో గ్రీటింగ్స్ అందుకున్నవారికి, దాన్ని పంపినవారే తమ ఎదుట నిలబడి శుభాకాంక్షలు చెబుతున్న అనుభూతి కలుగుతుంది. అమెరికన్ గ్రీటింగ్స్ కార్పొరేషన్ ఆ విధమైన 12 రకాల ఎలక్ట్రానిక్ గ్రీటింగ్స్ కార్డులను తయారు చేస్తోంది. మాట్లాడే, పాడే గ్రీటింగ్స్ చూడ్డానికి మామూలు గ్రీటింగ్స్‌లానే వుంటాయి.

ఎలక్ట్రానిక్ గ్రీటింగ్స్ కార్డుల్లో పాడేవేగాక; కొన్ని నీతి వాక్యాలనుకూడా చెబుతాయి. వాటిని ఎక్కువగా 'వలెంటైన్ డే'నాడు పంపుకుంటూరు. ప్రపంచవ్యాప్తంగా వున్న క్రైస్తవులందరికీ 'వలెంటైన్ డే'ని ఘనంగా జరుపుకోవడం అలవాటు!

ఎలక్ట్రానిక్ గ్రీటింగ్స్ కార్డు ఖరీదు దాదాపు 57 రూపాయలైనా, దాన్ని అందుకున్నవారికి కలిగే సంతోషంతో పోలిస్తే పంపేవారికి ఆ మొత్తం ఎక్కువ కాబోదు. ఇంతకుముందు అమెరికన్లకి గ్రీటింగ్స్‌తోపాటు, ఏదో ఒక బహుమతిని కూడా పంపే అలవాటుండేది. ఇపుడు కార్డూ, బహుమతీ రెండింటికీ బదులుగా పాడే గ్రీటింగ్స్ మటుకే పంపితే సరిపోతోంది.

పాడే గ్రీటింగ్స్ కార్డులో 0.08 సెంటీమీటర్ల మందంతో, 2.5 సెంటీమీటర్ల చతుర స్రాకారపు చిన్న సర్క్యూట్ బోర్డు వుంటుంది. దానికి చేతి గడియారాల్లో వుపయోగించే 0.08 సెంటీమీటర్ల మందపు చిన్న బేటరీతో శక్తి సమకూర్చబడుతుంది. ఆ బేటరీ 6 నుంచి 8 గంటలవరకూ పనిచేస్తుంది కాబట్టి గ్రీటింగ్స్ అందుకున్నవారు శుభాకాంక్ష సందేశాన్ని మళ్ళీ మళ్ళీ విని ఆనందించవచ్చు!







# గెలుపొందే పిల్లల తల్లులు మాల్టోవా తల్లులు!



తెలివైన తల్లులు మాల్టోవా తల్లులు. ఒక్కొక్క చెంచా మాల్టోవాలోనూ బంగారమంటి గోధుమలు. ముత్యాలవంటి బార్లీ,
శుద్ధమైన పాలు,
కమ్మని కోకో,
శక్తినిచ్చే
చక్కెరల మంచితనం నిండుగా ఉన్నదని తెలిసిన తల్లులు. ఒక కప్పు పాలల్లో కలిపితే సరి, మనసులు గెలిచే గొప్ప పానీయమై పోతుంది మాల్టోవా. ఏ మాల్టోవా తల్లినైనా అడగండి చెబుతుంది.




కొత్త

## మాల్టోవా®

"ఆరోగ్యం, బలం మరియు శక్తి యొక్క విజయప్రద సంగమం"

FSA/JIL/3/85 TEL

ఆఫీసులో చాలా సందడిగా ఉంది.

ఉద్యోగులందరూ ఒకే విషయం గురించి చర్చించుకుంటున్నారు. ఆ విషయం 'వెళ్ళిపోయిన ఆఫీసర్ స్థానంలో మరో ఆఫీసర్ రాబోతోందని'.

అప్పుడే ఆ ఆఫీసులోకి అడుగు పెట్టాడు ఓ యువకుడు.

సన్నగా ఉన్నాడు అతడు. ముక్కు మీద కళ్ళద్దాలు, చేతిలో పుస్తకం. తన సీట్లోకి వెళ్ళి కూర్చున్నాడు అతడు.

అతడిని చూసి అతడి సీటు దగ్గరకు వచ్చాడు శంకరం.

"వాసూ... ఈ వార్త విన్నావా!" అతడి పక్కనే కుర్చీ లాక్కుని కూర్చుంటూ అన్నాడు శంకరం.

"ఏ వార్త?" అడిగాడు వాసు.

"మన ఆఫీసరు వెళ్ళిపోయాడుగా! ఇప్పుడు మనకో కొత్త ఆఫీసరమ్మ రాబోతోందట. రెండు మూడు రోజులలో చార్జి తీసుకుంటుందట"

"అలాగా" నిరాసక్తిగా అన్నాడు వాసు.

"అసలు వార్త అదికాదు. ఆమె అన్‌మేరీడ్ అట. అదీ సంగతి" నవ్వుతూ అన్నాడు శంకరం.

ఆ మాట వినీవిననట్టు ఉన్నాడు వాసు.

"ఆమె పేరు కూడా ఏదో అన్నారు. ఆ...ఏదో సినిమా పేరు...ఆ...ఆ జ్యోతి"

టేబిల్‌మీది చేతులు జారి ముందుకు పడబోయి నిలదొక్కుకున్నాడు వాసు.

'జ్యోతి! వాటే స్వీట్ నేమ్. కొద్ది సంవత్సరాల క్రితం తన గుండెల్లో అలజడి రేపిన పేరు. అప్పటినుండి ఇప్పటివరకూ తను ప్రతిరోజూ తలచుకునే పేరు. ఓ స్త్రీమూర్తి పేరు. ఓ అందాల బొమ్మ పేరు...జ్యోతి'

"ఏయ్ వాసూ! ఏమిటి పగటికలలు కంటున్నట్లున్నావు అప్పుడే" భుజంమీద చేయివేసి కుదుపుతూ అన్నాడు శంకరం.

"ఏమీలేదు" తల అడ్డంగా ఊపుతూ అన్నాడు వాసు.

"అది సరే! నాకో చిన్న అనుమానం ఉంది గురూ... తీరుస్తావా?" మెల్లగా అడిగాడు శంకరం.

"ఏమిటో చెప్పు" అన్నాడు వాసు.

శంకరం కుర్చీ మరికాస్త ముందుకు జరుపుకుని కూర్చుని అన్నాడు.

"గురూ! ఆడాళ్ళని ఆకర్షించే మందేమయినా నీ దగ్గర ఉందా? నాకేమో నీ దగ్గర అలాంటి మందేదో ఉన్నట్టని పిస్తోంది"

"అలాంటి అనుమానం నీకు ఎందుకు వచ్చింది" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"ఎందుకురాదు గురూ! ఈ ఆఫీసులో ఇరవై మంది మగాళ్ళం ఉన్నాము. అందులో ఫిఫ్టీ పర్సెంట్ బ్రహ్మచారులం కదా! ఈ ఆఫీసులో ఉండే రాంబాయమ్మ, రమణమ్మలాంటి పెద్దవాళ్ళను తీసేస్తే, ఉండే ఒకే ఒక 'కుమారి' మన టైపిస్టు శైలజ. ఆ శైలజ మా పందొమ్మిది మందిలో ఎవరితోనూ పలకదు. పెళ్లయిన వాళ్ళను పలకరించకపోతే పోయింది, కనీసం బ్రహ్మచారులమయిన మాతో కూడా పలకదు. కానీ నీ ఒక్కడితోనే పలుకుతుంది. నువ్వు పలకకున్నా నిన్నే పలకరిస్తుంది. సినిమాలకు, షికార్లకు నిన్నే ఆహ్వానిస్తుంది. మమ్మల్ని అందర్నీ కాదని ఓ 'విడోవర్' అయిన నీతోనే మాట్లాడేందుకు కారణం ఏమిటి? ఇందుకు నిజమైన కారణం ఏమిటో నువ్వు చెప్పాల్సిందే" బల్లగుద్ది అన్నాడు

శంకరం.

వాసు, శంకరం వైపు చూస్తూ అన్నాడు.

"ఆమె నాతోనే ఎందుకు మాట్లాడుతుందో నాకేం తెలుస్తుంది?"

"నీకు తెలియదంటే నేను నమ్మను గురూ! ఏ ప్రయత్నం లేకుండానే నువ్వు ఆమెను ఆకర్షిందావా? మాయమాటలు చెప్పకుండానే ఆమెను నీ వైపు తిప్పుకున్నావా?"

"నిజంగా నాకేం తెలియదు శంకరం. ఆమెకు నేను ఏ మాయమాటలూ చెప్పలేదు... నన్ను నమ్ము"

"నువ్వు ఎన్నయినా చెప్పు. ఏ ప్రయత్నం లేకుండా ఆమెను నీ వైపు తిప్పుకున్నావంటే నాకు నమ్మకం కలగడంలేదు"

"నమ్మినా నమ్మకపోయినా ఇక నీ ఇష్టం" అన్నాడు వాసు.

"పోనీ ఒకటి చెప్పు. నువ్వు నాకన్నా అందగాడివా!"

"ఏమో! నా అందం గురించి నాకెలా తెలుస్తుంది. నువ్వుమాత్రం ఖచ్చితంగా అందగాడివే... ఒప్పుకుంటాను"

"మరి ఇంత అందగాడిని నన్ను ఒక్కసారి కూడా చూడదే ఆ శైలజ" బాధపడిపోతూ అన్నాడు శంకరం.

"అందుకు నన్నేం చెయ్యమంటావు" మామూలుగా అడిగేడు వాసు.

"ఆ శైలజకు నువ్వయినా చెప్పు గురూ"

"ఏమని చెప్పేది" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"'శైలజా! నా దగ్గర ఏముందని నా వెంటపడతావు. పెద్ద అందగాడిని కాను, పెద్ద తెలివయినవాడినీ కాను. నన్ను వదిలి పెట్టు. అదుగో ఆశంకరం చూడు... పెద్ద మేధావి, మంచి అందగాడు. అందులోనూ పెళ్ళి కావలసినవాడు. అతడిని ప్రేమించు, పెళ్లాడు' అని చెప్పు. అంతేచాలుగురూ. ఆ మాట నువ్వు చెప్పావంటే చచ్చి నీ కడుపున పుడతా గురూ"

"చూడు శంకరం! ప్రేమించు అంటే ఏ ఆడదీ ప్రేమించదు. ఆమె మనల్ని ప్రేమించేట్టు చేసుకోవాలి. లేదా ఆమే తనంత తానుగా మనల్ని ప్రేమించాలి" హితబోధ చేశాడు వాసు.

"ఆ రెండూ నాకీ జన్మలో కుదరవు గురూ! ఆమె నన్ను ప్రేమించేటట్టు చేసుకోవడం నా వల్లకాదు. నీకెలాగూ ఆమెమీద ఇంట్రెస్ట్ లేదుకదా! అందుకే నువ్వు రెకమండ్‌చేస్తే కనీసం నీ మీద అభిమానంతోనైనా నన్ను ప్రేమిస్తుందేమోనని నా ఆశ!"

అతడివైపు వింతగా చూసి అన్నాడు వాసు "అయినా రెకమండేషన్ చేయించుకుని ఆమెచేత ప్రేమించబడాలనుకోవడం ఎందుకు బ్రదర్! మరెవరినైనా ప్రేమ చేసుకోకూడదా!"

"మరెవరినో ఎలా ప్రేమించను గురూ! శైలజ అంటే నాకు రోజు రోజుకూ పర్వతంలా పెరిగిపోతోంది ప్రేమ. అందుకు మరో కారణంకూడా ఉందిలే గురూ!"

"ఏమిటి?" అడిగాడు వాసు.

"శైలజ ఫాదర్ ఇన్‌కంటాక్స్ ఆఫీసరు గురూ! గాంధీనగర్‌లో రెండేసి లక్షలు పెట్టి రెండు ఇళ్లు కొన్నాడు! మరెంతో డబ్బుమూలుగుతోందని వినికిడి. ఆయనకు ఇద్దరే కూతుళ్లు. ఒకామెకు పెళ్ళయి, భర్తతో ఢిల్లీలో ఉంటోంది. రెండవది శైలజ. ఆమెను పెళ్ళిచేసుకుంటే

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం !



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!



**మార్గదర్శి**

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిద్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం

FON/MCF/81/1

ఆ ఆస్తిలో సగం వస్తుంది గురూ!" ముఖం బాధగాపెట్టి అన్నాడు శంకరం.

'ఓరి దౌర్భాగ్యుడా! ప్రేమించడం కూడా స్వార్థం కోసమేనా?' ఆశ్చర్యంగా మనసులోనే అనుకున్నాడు వాసు.

"చెప్పు గురూ! నాకు సహాయం చేస్తావా?" అడిగాడు శంకరం.

ఏమీ చెప్పలేక మౌనంగా వున్నాడు వాసు.

"అది సరే... అంత ఆస్తి వుండి ఆమె ఈ ఉద్యోగం ఎందుకు చేస్తోంది?" అడిగాడు వాసు.

"కాలక్షేపం కోసం గురూ! బతికేందుకు ఉద్యోగాలులేక లక్షలాది నిరుద్యోగులు రోడ్ల మీదవుంటే, టైమ్‌పాస్ చేసేందుకు ఇలాంటివాళ్లు ఉద్యోగాలు చేస్తుంటారు" చెప్పాడు శంకరం.

వాసు ఏదో అడగబోతుండగా, అప్పుడే లోనికి అడుగు పెట్టింది శైలజ.

తెల్లగా వుందామె. షోకేస్‌లో బొమ్మలా షోగ్గా అలంకరించుకుని, ఏదో కాలక్షేపం కోసం ఆఫీసుకు వచ్చినట్టు వుంది. ఆమె నేరుగా వాసు కుర్చీ దగ్గరకు వచ్చింది.

ఆమె రావడం చూసి తన కుర్చీలోకి వెళ్ళాడు శంకరం.

"మీరింత మోసగాళ్ళనుకోలేదు" దగ్గరకు రాగానే అందామె.

"నేనా...నేనేం చేశాను?" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"నిన్న ఫస్ట్‌షో సినిమాకి వస్తానని, థియేటరు దగ్గర వెయిట్ చెయ్యమని చెప్పి మీరు రాకుండా మానేశారు. టిక్కెట్స్ తీసుకుని ఏడు గంటల వరకూ ఎదురుచూసి, విసుగేసి నేనొక్కదాన్నే వెళ్ళాను"

"సారీ! నిన్న ఆఫీసు నుండి వెళ్ళేప్పుడు ఓ మిత్రుడు కనిపించాడు. వాడు పట్టుకుని వదలలేదు" అబద్ధ మాడేశాడు వాసు.

"అంతేలేండి! ఆడది తనకై తాను ఆహ్వానిస్తే మీ మగవాళ్లు బెట్టు చేస్తారు. నాకు మంచి పాఠం చెప్పారు"

"అయామ్ సారీ శైలజగారూ! మిమ్మల్ని డిసప్పాయింట్ చేశాను"

"నా జీవితంలో నేనింతవరకూ ఇంతలా ఎప్పుడూ నిరాశపడలేదు" చెప్పిందామె. మౌనంగా వుండిపోయాడు వాసు.

ఆమె కొద్దిసేపు అక్కడే నిలబడి తర్వాత టాయిలెట్ వైపు నడిచింది. ఆమె అటు కదలగానే సుడిగాలిలా దూసుకు వచ్చాడు శంకరం.

"గురూ! నీలాంటి అమాయకుడిని ఈ లోకంలో చూడలేదు"

"ఏం"

"అందమైన ఆడది సినిమాకి ఆహ్వానిస్తే, తప్పించుకుపారిపోయిన మగాణ్ని నిన్ను ఒక్కడినే చూశాను. నువ్వు అమాయకుడివో, పిరికివాడివో నాకు అర్థంకావడం లేదు. అదే నేనైతేనా! సప్తసముద్రాలూ, పర్వతాలూ, అడవులూ అన్నీ దాటి చెప్పిన టైముకన్నా గంట ముందుగా ఆమె కోసం, అందమైన ఆమె మోము కోసం, ఆమె పక్కన కూర్చునే అదృష్టం కోసం ఆ థియేటరు ముందే కూర్చుని తపస్సు చేసి వుండేవాడిని"

మౌనంగా వున్నాడు వాసు.

"నువ్వు వెళ్ళలేకపోతే కనీసం నాకయినా చెప్పి వుండాల్సిందిగా! నువ్వే చెప్పివుంటే ఆమె వెళ్ళే సినిమా థియేటరులోకి ఆమెకన్నా నేనే ముందు

వెళ్ళి వుండేవాడిని.ఆమెను చూసి 'హలో.. మీరూ ఇప్పుడే వచ్చారా?'అని పలకరించి వుండేవాడిని. రెండు టిక్కెట్లు తీసుకున్నాను. నా ఫ్రెండ్‌వస్తానని చెప్పిరాలేదు. ఇదిగో..టిక్కెట్టుతీసుకోండి అనినా పక్క నంబరు సీట్ టిక్కెట్టు ఇచ్చివుండేవాడిని అంత అదృష్టాన్ని నువ్వూ అనుభవించ లేదు. నన్నూ అనుభవించనివ్వలేదు"

కోటి రూపాయలు లాటరీలో ఒక్క నంబరుతో తప్పిపోయినట్టుగా బాధపడుతున్నాడు శంకరం.

టాయిలెట్ నుండి ఇవతలకు వచ్చింది శైలజ.

శంకరం తన సీట్లోకి వెళ్ళాడు.

ఆ రోజు లంచ్‌టైమ్‌లో వాసు అడిగాడు.

"మనకు రాబోయే ఆఫీసర్ పేరేమిటన్నావ్?"

"జ్యోతి" చెప్పాడు శంకరం.

ఫైల్స్ ముందేసుకుని కూర్చున్నాడు వాసు. కానీ అతడి ఆలోచనలు ఫైల్స్ మీద నిలువలేదు. విద్యార్థి జీవితంలో తన జీవనవీణపై ప్రేమరాగం పలికించిన జ్యోతిపైకి ఆలోచనలు మళ్ళాయి.

ఎక్కడుంది జ్యోతి? ఏం చేస్తోందో జ్యోతి? ఈసరికి ఇద్దరి బిడ్డల తల్లి అయి వుంటుందేమో! ఇప్పుడు తనకు హఠాత్తుగా కనిపిస్తే ఒకనాటి తన పిరికితనానికి ఈనాడు కూడాఅసహ్యించుకుంటుందేమో! పిరికివాడని హేళన చేస్తుందేమో!

ఇంతకీ ఎక్కడుందో తన జ్యోతి!

ఏమిటి ఈరోజు తన ఆలోచనలన్నీ జ్యోతి మీదికి మళ్ళుతున్నాయి? ఎందుకు జరుగుతోంది ఇలా??

అవును... ఏదో జరుగబోతోంది!





ఏమిటది?

ఏమో అర్థంకావడంలేదు.సాయంత్రం వరకూ ఆఫీసులో అనీజీగా గడిపాడు అతడు.

ఆఫీసు వదిలిన తర్వాత ఇంటికెళ్ళ బుద్ధి కాలేదు. పార్కు వైపు కదిలాడు.

పార్కు సందడిగా ఉంది. ఆనందమే జీవితంగా బతికే వ్యక్తులతో కళకళ లాడుతూ ఉంది.

ఎన్నో జంటలు.ఆనందం అనుభవించే దానికే పుట్టామన్నట్టున్న జంటలు.

మరి తను? తనకు ఏ తోడూ లేదు.

ఎలా ఉంటుంది మరి! ప్రేమించిన ప్రియురాలిని పిరికిగా దూరం చేసుకున్నాడు. పెళ్ళాడిన ఇల్లాలినీ ఆ పిరికితనంతోనే సుఖపెట్టలేకపోయాడు. విధివశాత్తు ఆమె ఆ బాధలనుండి తప్పించుకుని మరో లోకానికి ప్రయాణమై వెళ్ళిపోయింది.

తల విదిలించాడు వాసు. మనశ్శాంతి కోసం ఇక్కడికి వస్తే ఇక్కడ కూడా అవే ఆలోచనలా? మనసులో లేని శాంతి ఎక్కడో దొరుకుతుందనుకోవడం తెలివితక్కువ తనమేమో!

వాసు లేచాడు. కాళ్ళు ఇంటిదారి పట్టాయి.

తలుపుతీసి వాలుకుర్చీలో వాలాడు. అలసిపోయి ఇంటికివస్తే, కనీసం కాఫీ ఇచ్చే దిక్కుకూడా లేదు.

అతడి చూపులు ఎదురుగా గోడకు తగిలించి ఉన్న ఫొటోమీద పడ్డాయి.

ఫొటోలో తనవైపే చూస్తూ నవ్వుతున్నట్లుంది 'వందన'. తన జీవితాన్ని కొద్దికాలం నందనవనంచేసి, అందని తీరాలకు వెళ్ళిపోయిన వందన! తన సంసార జీవితంలో సరిగమలు పలికించి రెండేళ్ళలోనే జీవితం మొత్తానికి సరిపడే ఆనందాన్ని అందించిన వందన!

ఎక్కడికో సుదూరతీరాలకు వెళ్ళిపోయిన వందన!

ఆమె చనిపోయిందీ అంటే ఆమె విముక్తురాలయినట్టే. లేకుంటే రోజూ తన తల్లి దెబ్బలకు, ఆడపడుచుల అరడులకు ఆమె ఆత్మహత్య చేసుకుని ఉండేదేమో!

తననే దైవంగా పూజించిన ఇల్లాలిని, తల్లికి భయపడి ఆమె పెట్టే ఆరడులు గమనిస్తూ కూడా నోరు మెదపలేక పోయాడు. ఆమెను మందలించలేని పిరికి తనంతో ఉండేవాడు. భార్యచనిపోయిందీ అంటే ఆమె బాధల నుండి విముక్తురాలయి నట్టేనేమోననిసరిపెట్టుకుంటున్నాడిప్పుడు. స్నేహితుడు ఆనంద్ అన్నట్టు తను నిజంగా పిరికివాడు.

తన పిరికితనమే తన జీవితంలో నుండి ఓ మంచి ప్రియురాలిని దూరం చేసింది. తన పిరికితనమే తన ఇల్లాలిని బాధలపాలు చేసింది. కేవలం పిరికితనం, పరిస్థితుల్ని ఎదిరించలేని పిరికితనంతోనే, తను ఇద్దరు స్త్రీలను బాధలకుగురిచేశాడు.

ఆ పిరికితనాన్ని తను అసహ్యించు కుంటున్నాడు. కానీ ఆ పిరికితనాన్ని పారదోలలేకున్నాడు. కారణం-పిరికితనం ఓ వ్యసనం. అది అంత తేలిగ్గా... కాదు అసలు మనిషిని వీడిపోదు.

ఆలోచనల నుండి తేరుకుని పైకి లేచాడు వాసు. బీరువా తెరచి ఎక్కడో అడుగున దాచి వుంచిన ఓ ఫొటో తీశాడు. చాలాకాలం నుండి ఎంతో భద్రంగా దాచి వుంచాడు ఆ ఫొటోని.

అది జ్యోతి ఫొటో.

ఆ ఫొటోవంక తదేకంగా చూశాడు వాసు. చిరునవ్వు నవ్వుతోంది జ్యోతి అందులోంచి.

'ఎక్కడున్నావు జ్యోతీ? ఏంచేస్తున్నావు జ్యోతీ? 'వాసూ... ఐలవ్‌యూ! నన్ను పెళ్ళిచేసుకో' అని బతిమిలాడావు. కానీ మన కులాలువేరని నిన్నుకాదన్నాను ఆరోజు. నా జీవితం నుండి మౌనంగా నిష్క్రమించావు నువ్వు. నిన్ను బాధ పెట్టాను! అలా బాధపెట్టినందుకు తగిన విధంగా అనుభవిస్తున్నాను. నీ ప్రేమను తిరస్కరించినందుకు నన్ను క్షమించు జ్యోతీ! ఏనాడైనా నిన్ను నేను కలిస్తే నన్ను కోపగించుకోవుగా! నన్ను అసహ్యించుకోవుగా! నా పిరికితనాన్ని ఏదరించుకోవుగా!' మనసులోనే అనుకు న్నాడు వాసు.

జ్యోతి ఫొటోని భద్రంగా బీరువాలో ఉంచాడు. కింద అరలో నుండి ఓ ఇన్‌లాండ్ కవరు తీశాడు.

స్వప్నను త్వరగా తీసుకురమ్మనీ, ఇక్కడే టౌన్‌లో బడిలో చేర్పించాలను కుంటున్నాననీ తన అక్కకు లెటర్ రాసి టేబిల్‌మీద పెట్టాడు.

వందన చనిపోయిన తర్వాత తన కూతురు స్వప్నను తన అక్కగారింట్లో ఉంచాడు వాసు.

తర్వాత మంచం మీద వాలాడు అలసటగా! భోజనం చేయాలనిపించలేదు.

ఎందుకో తెలియదు కానీ అతడి మనసు ఉదయం నుండి జ్యోతిని గురించే ఆలోచిస్తూ ఉంది. ఏదో...ఏదో జరగ బోతోందని ఊహామాత్రంగా అతడి మనసుకి తడుతోంది.

అయినా ఈ పిరికివాడి జీవితంలో ఇంకేం మలుపులు ఉంటాయి.

విరక్తిగా నవ్వుకున్నాడు వాసు.

* * *

ఆఫీసు ముందు టాక్సీ ఆగింది.

ఉద్యోగులందరూ తమ సీట్లలోనే కూర్చుని కిటికీగుండా కారులో నుండి దిగే స్త్రీని చూసేందుకు ఆసక్తిగా తలలు పైకెత్తారు.

అనాలోచితంగానే వాసు కూడా తల పైకెత్తి కారువైపు చూశాడు.

కారులోనుండి దిగింది ఓ స్త్రీమూర్తి. హెడ్ గుమస్తా నవ్వుతూ నమస్కరించాడు.

ఆమె కూడా నవ్వుతూ రెండుచేతులు జోడించింది తల పైకెత్తి.

అంతే! కాళ్ళకింద భూమి కిందికి పోయి, తన కుర్చీతోసహా తనను అగాథంలోకి లాగినట్టు ఫీలయ్యాడు వాసు. ఓ సుడిగాలి రివ్వున వచ్చి తనను ఉక్కిరిబిక్కిరి చేసినట్లు ఫీలయ్యాడు అతడు.

"జ్యోతి" అతడి పెదవులు అస్పష్టంగా గొణిగాయి.

ఓ ఏటవాలు సూర్యకిరణం ఆమె ముఖంపై పడి పరావర్తనం చెందుతూ ఉంది. ఓ పిల్లగాలి ఆమె ముంగురులతో ఆటలాడుతూ ఉంది. హుందాగా గంభీరంగా నిలబడి ఉందామె.

ఆ క్షణం వాసుకి ఓ పక్క ఆనందం, మరోపక్క భయం కలిగాయి. ఏనాడో విడిపోయిన ప్రియురాలిని చూసినందుకు ఆనందం, ఆమె ద్వారా ఎలాంటి అవమానం ఎదుర్కోవలసి వస్తుందోననే భయం అతడిని చుట్టుముట్టాయి.

ఆమె లోనికినడిచింది.

స్టాఫ్ అంతా గౌరవ సూచకంగా నిలబడ్డారు. ఆమె అక్కడ ఓ నిముషం నిలబడింది. అందరివైపు చూసింది. చివరిగా అతడివైపు చూసింది.





అక్కడ నిలబడివున్న వ్యక్తి వాసు.

ఆమె నమ్మలేనట్లు చూసింది. కళ్లు చికిలించి మరీ చూసింది. కళ్ళద్దాలు తీసి తీక్షణంగా చూసింది.

అప్పటివరకు నవ్వుతున్న ఆమె ముఖం సీరియస్‌గా మారింది. మరుక్షణం తనను తాను అదుపులో పెట్టుకుని మామూలు స్థితికి వెంటనే వచ్చేసింది.

హెడ్ గుమస్తా, ప్యూన్ వెంటరాగా సపరివారంగా వెళ్ళే యువరాణిలా ఠీవిగా ముందుకు కదిలి వెళ్ళిపోయిందామె.

నిస్సహాయంగా కుర్చీలో కూలబడ్డాడు వాసు.

జ్యోతి...ఆ జ్యోతి...తన జ్యోతి ఆఫీసరయిందా?

సముద్రం మధ్యలో వుండగా తుఫాను రాబోతుందని తెలిసిన జాలరిలా భయపడ్డాడు వాసు. తుఫానులా తన మీద విరుచుకపడబోతోందా జ్యోతి!

ఆమె ఇప్పుడు తనకన్నా గొప్ప స్థితిలో మాత్రమేకాదు, తన నెత్తినే ఉంది. ఒక విధంగా తన పరిస్థితిని మార్చివేయగల స్థితి ఆమెది.

ఒకనాడు తనను తిరస్కరించానన్న భావం ఆమెలో తప్పక ఉంటుంది. అవును... ఏ స్త్రీ అయినా తన ప్రేమను ఎలా మరచిపోగలుగుతుంది? ఆ కోపం ఆమెలో ఉంటే ఇప్పుడు తన మీద ప్రతీకారం తీర్చుకునేందుకు ఎంతో అవకాశం ఉంది.

ఆఫీసర్ జ్యోతి, ఇప్పుడు ఈ క్లర్క్ మీద ప్రతీకారం తీర్చుకోబోతోందా? ఇక అడుగడుగునా తనకు అవమానాలేనా?

మైగాడ్! ఏదో జరగబోతోందని తను అనుకుంటూ ఉన్నాడు. అంటే ఈ పరిస్థితి గురించి ముందే మనసులోకి ఆ భావం ప్రవేశించిందా? అది తెలిసే తన

మనసు భయపడిందా?

ఇప్పటినుండే తను ఎలాంటి విపరీత పరిస్థితులు ఎదుర్కోవాలో? ఆలోచనలో ఉండగానే శంకరం అక్కడికి వచ్చాడు.

"గురూ! మన ఆఫీసర్‌ని చూశావా?"

"చూడకుండా ఎలా ఉండగలను? లోపలికి వచ్చినప్పుడు చూశాను"

"ఆఫీసర్ అంటే ఏదో పొట్టిగా, నల్లగా, ఎత్తు పళ్ళు, సొట్టబుగ్గలు-వికృతంగా ఊహించుకున్నాను గురూ! కానీ ఇంత అందంగా ఉంటుందని అనుకోలేదు. ఆహా...ఏమి ఆ అందం. తెల్లని చంద్రబింబంలాంటి ముఖం. సారీ! చంద్రబింబం అంటే అక్కడ ఉండేది రాళ్లూ రప్పలేకదూ! ఆహా...ఆ వర్ణన బాగాలేదు. ముద్దమందారంలాంటి ఆమోము,కాలనాగులాంటి పొడవైన జడ, సన్నని శంఖులాంటి మెడ, ఎత్తయిన శిఖరాలలాంటి వక్షోజాలు, గోదావరిపాయలాంటి సన్నని నడుము వంపు, విశాలమైన ఎడారిలాంటి ఉదరభాగం,ఒయాసిస్సులా ఆనాభి.ఆహా.. ఎంత సుందరరూపం!ఆహా..ఆ అందాన్ని దక్కించుకున్నవాడు నిజంగా అదృష్టవంతుడు. ఆ అందాన్ని అనుభవించలేని వాడు నికృష్టుడు"

కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు వాసు.

"గురూ...ఇక ఆ శైలజను వదిలేస్తున్నా! ఆమెకు ఎంత ఆస్తి అయినా ఉండొచ్చు. కానీ ఆమెకు ఈ సౌందర్యం ఏది? ఆమెను పెళ్ళిచేసుకుంటే లక్షలు రావచ్చు. కానీ ఈ సౌందర్యరాశి పక్క ఒక్క క్షణం నిలబడ్డా చాలు-జన్మ ధన్యం అవుతుంది. అందుకే శైలజ ఆస్తిని త్యాగం చేసేస్తున్నాను. ఇక నుండి మన ఆఫీసరు జ్యోతిని ప్రేమిస్తున్నాను"

అక్కడ ఎవరూ లేకుంటే వాడి గొంతు నులిమి చంపాలన్నంత కోపం వచ్చింది వాసుకి. 'ఒరే దుష్టుడా...ఆ జ్యోతి ఒకప్పటి నా ప్రేయసిరా!ఇప్పటికీ నా మనసులో ఉండే దేవతరా!' అని చెప్పాలనిపించింది. కానీ ఏమీ అనలేక పళ్ళు బిగపట్టుకున్నాడు వాసు.

"అందుకే గురూ ... ఈ క్షణమే శైలజను నా మనసునుండి తొలగించి, ఆ స్థానంలో జ్యోతిని ప్రతిష్ఠించుకుంటున్నాను అందుకే ఈరోజు నుండి కాదు...ఈ క్షణం నుండే నేను జ్యోతిని ప్రేమిస్తున్నాను. అందుకు నీ పూర్తి సహకారం కావాలి గురూ"

'ఓరి నికృష్టుడా! స్వార్థం కోసమే ప్రేమించి క్షణం కొకసారి ప్రేమను మార్చే నీకు నా సహకారం కావాలా?' మనసులోనే కసిగా పళ్లు కొరుక్కున్నాడు వాసు. కానీ అతడిని ఏమీ అనే ధైర్యం లేదు. అందుకే మౌనంగా వున్నాడు వాసు.

"అది సరే గురూ! మన ఆఫీసర్,నో.. ఇంకా నా లవర్‌ని ఆఫీసర్ అనడం బాగా లేదు. అదే...నా జ్యోతి ఇంకా ఎందుకు పెళ్లి చేసుకోలేదు.?"

పళ్లు నూరాడు వాసు. 'నీ జ్యోతా?' మనసులోనే కసిగా అనుకున్నాడు.

"బహుశా ఈ మజ్నూ కోసమే ఆ లైలా వేచి ఉన్నట్టుంది" తనకుతనే సమాధానం చెప్పుకుని వెళ్లాడు శంకరం.

అతడు వెళ్లినా అతడు అడిగిన ప్రశ్న మనసులోనే నిలిచింది. "అవును... జ్యోతి ఎందుకు పెళ్ళి చేసుకోలేదు? తన ప్రేమను మరచిపోలేకపోయిందా?"

సమాధానం దొరకలేదు అతడికి. అలాగే ఆలోచిస్తూ ఉండిపోయాడు వాసు.




# పొదుపు చేస్తే మీకే అద్భుతదీపమూ అక్కర్లేదు!



మీ సమస్యలన్నింటిని క్షణంలో తీర్చేందుకు ఎంచక్కా ఓ అద్భుతదీపం ఉంటే బావుంటుందని అనుకొంటున్నారు కదూ !! మరి మీకో సలహా !!

ఎంచక్కా జాతీయ పొదుపు సంస్థలో పొదుపు చేయండి ! ఇక మీకే అద్భుత దీపమూ అవసరం లేదు.
మీరే వడ్డీ భూతాన్ని వేడుకోనక్కరలేదు.

**మీరు తలుచుకోగానే అనేక పథకాలతో మీ ముందుంటాం !! ఇక మీదే ఆలస్యం !!**

వివరాలకు: .
మీకు దగ్గరలో ఉన్న పోస్టాఫీస్, జిల్లా కలెక్టర్ కార్యాలయంలో స్పెషల్ తహసిల్దార్, జిల్లా సేవింగ్స్ అధికారి, భారత ప్రభుత్వం, డిప్యూటి డైరెక్టర్, స్మాల్ సేవింగ్స్ .






NSO/AMCO/13/85

కమిషనర్,
స్మాల్ సేవింగ్స్, ఆంధ్రప్రదేశ్,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029



**మీ భద్రత మా బాధ్యత**

ఆఫీసునుండి తిరిగి వచ్చాక ఇంట్లో కుర్చీలో కూర్చుని ఆలోచిస్తోంది జ్యోతి.

అనుకోకుండా ఈరోజు వాసు కనిపించాడు. వాసుని చూడగానే నిజంగా తనకు ఆనందం వేసింది. కానీ ఆ వెంటనే భయం! వాసు తమ కాలేజీ ప్రేమను ఈ స్టాఫ్‌కందరికీ చెప్పి చులకన చేస్తాడేమో తనను!

తమ పాతగాథనుచెబితే తప్పెవరిదైనా తనమీద చులకన భావం కలుగుతుంది స్టాఫ్‌కు!

వాసు అలా చెబుతాడా? ఏమో... ఈ మగాళ్ళను నమ్మేదెలా? నిజంగా ఏమీ లేకున్నా కూడా తమ వెనుక పదిమంది ఆడాళ్ళు వెంటపడుతున్నారని చెప్పుకుంటూ అహాన్ని తృప్తిపరచుకునే మగధీరులు వీరు. అలా చెప్పుకోవడంలో తమ గొప్పతనాన్ని చాటుకోవాలనే ఉద్దేశం మాత్రమే కనిపిస్తుంది. ఇహ కొంచెం నిజంవుంటే మరి చెప్పేదేముంది. మసిపూసి మారేడుకాయ చెయ్యగల సమర్థులు.

మరి ఆఫీసులో తన పరువుపోకుండా ఉండాలంటే ఏంచెయ్యాలి-ఆలోచించింది జ్యోతి.

అందుకు ఒకటే దారి. వాసుని బాగా భయపెట్టాలి. తనంటేనే భయం పట్టుకునేట్టు చెయ్యాలి. అంతేకాదు ఒకప్పుడు తన ప్రేమను కాదని తనను ఎంతగా బాధపెట్టాడో, అంతగా తనూ అతనిని బాధపెట్టాలి.

మనసులోనే నిశ్చయించుకుంది జ్యోతి.

నిజమే! మెత్తగావుంటే మొత్తబుద్ధవుతుందట.



కాఫీ తీసుకుని వచ్చింది సరస్వతమ్మ. ఎదురుగా కుర్చీలో కూర్చుంది. ఆమె ఏదో అడగాలని కూర్చుందని అర్థం అయింది కాఫీ తాగుతున్న జ్యోతికి.

"ఏమిటమ్మా! ఏదో చెప్పాలని అనుకుంటున్నట్టున్నావు" అంది జ్యోతి కాఫీ తాగి.

"ఇంకేముందే నేను నీకు చెప్పే విషయం. నా గుండెలమీది బరువు ఎప్పుడు తీరుస్తావా అని ఆలోచిస్తున్నాను. నీకు పాతికేళ్ళు వచ్చాయి. మంచి స్థితిలో ఉన్నావు. ఇకనయినా పెళ్ళిచేసుకోవే"

"అలాగేలేమ్మా! పెళ్ళిచేసుకుంటాలే. కొద్దికాలం ఆగు"

"నువ్వు ఎప్పుడూ ఇలాగే అంటావు. మళ్ళీ నేను హెచ్చరించేంతవరకూ నాకీ విషయమే గుర్తుకురాదు. నువ్వు ఇప్పుడు ఊ అను రేపీపాటికి మంచి అబ్బాయిని, నీ స్థితికి సరిపడేవాడిని చూసిపెడ్తాను"

"కొద్దికాలం ఆగమ్మా! ఆ తర్వాత నువ్వు చెప్పినట్టే చేసుకుంటాగా"

"నువ్వు ఎప్పుడూ ఇంతే" కోపంగా అని లోపలికి వెళ్ళింది సరస్వతమ్మ.

జ్యోతి మళ్ళీ ఆలోచనలోపడింది.

తను పెళ్ళంటే ఎందుకింత విముఖురాలయిపోయింది. నిజంగా తను ఇంకా వాసుని మరచిపోలేదు. ఆ కారణమే తనకు పెళ్ళంటే విరక్తి కలిగేటట్టు చేస్తోంది. తొలివలపు అంత గాఢమయినది కాబోలు.

కానీ ఆ మగాడు ఆ ప్రేమను ఇంకా గుర్తుపెట్టుకుని ఉంటాడా? లేదు. ఆ ప్రేమనూ, తననూ ఏనాడో మరచిపోయి ఉంటాడు. హాయిగా పెళ్ళిచేసుకుని పెళ్లాం బిడ్డలతో కాపురం చేసుకుంటూ వుంటాడు. ఈ మగాళ్ళంతా ఇంతే. ఏదయినా క్షణంలో మరచిపోగలరు.

అందుకే తనను ఇలా బాధలపాలు చేసినందుకు వాసుకు తగిన విధంగా బుద్ధిచెప్పాలి. వీలయినంతవరకూ ఏడిపించాలి! తనని ఇలా ఒంటరిగా వదిలినందుకు అతడికికూడా ఓ పాఠం నేర్పాలి.

మనసులోనే గట్టిగా నిర్ణయించుకుంది జ్యోతి.

"నీళ్ళు తోడివున్నాయి రావే" అని లోనుండి తల్లి పిలవడంతో ఆలోచనల నుండి తేరుకుంది.

లేచి లోపలికి నడిచింది. ఆమె నడుస్తుంటే కరినాగులాంటి ఆమె జడ ఆమె నడుముపై నాట్యంచేస్తోంది. ఆమె నడకల లోనే నాట్యం చేస్తుందా అన్నట్టుందా నడక.

* * *

ప్యూన్ వచ్చి ఆఫీసర్ తనను పిలుస్తోం దనడంతో ఉలిక్కిపడ్డాడు వాసు.

"నన్నేనా?" సందేహ నివారణ కోసం మళ్ళీ అడిగాడు వాసు.

"మిమ్మల్నే సార్!" చెప్పాడు ప్యూన్.

అనుకున్న పరిస్థితి రెండో రోజే ఎదురయిందా?

"వస్తున్నా...పద" చెప్పి పైకి లేచాడు వాసు.

'ఏం అంటుందో జ్యోతి! గదిలోకి పిలిచి చివాట్లు పెడుతుందా! లేక ట్రాన్స్‌ఫర్ చేస్తానని బెదిరిస్తుందా! ఆనాటి సంఘటన గుర్తుచేసి ఇకనుండి నీ అంతుచూస్తానని అరుస్తుందా! ఏమంటుందో?' ఏవేవో ఆలోచనలతో బయలుదేరాడు వాసు.

కత్తుల బోనులోకి వెళ్ళబోయేవాడిలా భయపడుతున్నాడు వాసు.

'జరగబోయే పరిస్థితి గురించి అతి ఎక్కువగా ఊహించుకుని భయపడటం పిరికివాడి మొదటి లక్షణం'.

తలుపు తీసుకుని లోనికి అడుగు పెట్టాడు వాసు.

"గుడ్‌మార్నింగ్ మేడమ్!" భయంగానే అన్నాడు వాసు.

ఆమె మౌనంగా ఉంది. ఓ నిముషం పాటు చూస్తున్న ఫైల్స్‌లోనుండి తల కూడా ఎత్తి చూడలేదు.

'అబ్బా...ఎంత గర్వం! కనీసం కూర్చోమని అయినా చెప్పొచ్చుగా' మనసులోనే అనుకున్నాడు వాసు.

ఓ నిముషం తర్వాత తల ఎత్తకుండానే అంది-'కూర్చోండి'.

ఎదుటి కుర్చీలో కూర్చున్నాడు వాసు.

"మీ పేరేనా వాసు?" అడిగిందామె.

'అదికూడా తెలియదా' అని అనాలనుకున్నాడు. కానీ అనలేదు. "అవును మేడమ్" అన్నాడు వాసు.

"ఈ ఫైల్ చెక్ చేసింది మీరే కదూ?" అన్నదామె.

"అవును మేడమ్" ఫైల్ చూసి అన్నాడు వాసు.

"ఈ ఫైల్లో ఎన్ని తప్పులున్నాయో గమనించండి" ఫైల్ ముందుకు తోస్తూ అందామె.

ఫైల్ చేతిలోకి తీసుకున్నాడు వాసు. అందులో తను చేసిన పెద్ద తప్పేమీ లేదు. టైపిస్ట్ శైలజ టైప్ చేయడంలో కొన్ని తప్పులు కొట్టింది. ఆ కొన్ని తప్పుల్ని సరిదిద్దకుండా పంపించడమే తను చేసిన తప్పు-కానీ ఆ సమాధానం చెప్పలేకపోయాడు వాసు.

'తన తప్పేమీ లేకపోయినా భయపడి తిరిగి జవాబు చెప్పలేక ఆ తప్పు తన నెత్తిన వేసుకోవడం పిరికివాడి రెండవ లక్షణం'.

తల దించుకున్నాడు వాసు.

"ఓకే! ఇకనైనా కాస్త జాగ్రత్తగా పనిచేయండి. ఇక మీరు వెళ్ళొచ్చు" అతడిని హెచ్చరిస్తూ అందామె.

బతుకుజీవుడా అనుకుంటూ బయట పడ్డాడు వాసు.

"గురూ! నా ప్రియురాలి గొంతు కూడా కోకిల కంఠంలా ఉందా?" శంకరం దగ్గరకు వచ్చి అన్నాడు.

అతడిని పొడిచి చంపాలన్నంత కోపం వచ్చినా మారుపలుకక కుర్చీలో కూలబడ్డాడు.

సాయంత్రం ఇంటికి చేరాడు.

జ్యోతి అప్పుడే తనమీద మొదటి దెబ్బతీసింది. ఇంకెంతలా బాధపెడుతుందో! అయినా ఆమెను తనేమి చేశాడని తనమీద ఇలా పగబట్టింది. ఆమెను మోసం చెయ్యలేదు. అవమానపరచలేదు. కేవలం ఆమె ప్రేమను తిరస్కరించాడు. అంతే!

అతడు కుర్చీలో కూర్చుని గతం గురించి ఆలోచించసాగాడు. అతడి కన్నుల ముందు అతడి కాలేజీ జీవితం కదలాడింది.




2

జీవితంలో మధురక్షణాలు' లభ్యమయ్యే స్థలం అది.

కొందరు అక్కడ ఆనందంగా విచ్చలవిడిగా తిరిగితే, మరికొందరు తమ జీవితంలో వృద్ధిలోకి వచ్చేందుకు అక్కడే పునాది వేసుకుంటారు.

అది కళాశాల.

ఎగిరే కెరటాలలోని ఉత్సాహం ఆ వయసులో ఉంటుంది. ఆ విద్యార్థి జీవితం ఆనందమయం.

కాలేజీలోకి అప్పుడే అడుగుపెట్టిన వాసు, మరోసారి వాచీ వంక చూసుకున్నాడు. పదిహేను నిముషాలు లేటు.

క్లాసు ముందుకెళ్ళి ఆగాడు.

క్లాసులో లెక్చరర్ పాఠం చెబుతున్నాడు. ఇప్పుడు క్లాసుకి వెళ్ళడమా, లేక వెనక్కు తిరిగి వెళ్ళటమా! క్లాసులోకి వెళితే లెక్చరర్ ఏదైనా అంటాడేమో! అసలే ఆయన కోపిష్టివాడు కూడానూ.

రెండు నిముషాలు అలా గడిపిన తర్వాత ఓ నిశ్చయానికి వచ్చినట్టు గుమ్మం దగ్గరికి వెళ్ళి అన్నాడు-

"ఎక్స్‌క్యూజ్ మీ సార్"

లెక్చరర్ చెబుతున్న పాఠం ఆపి వాసు వైపు చూసి అన్నాడు-

"యస్...కమిన్"

తేలిగ్గా ఊపిరి పీల్చుకుని క్లాసులోకి అడుగుపెట్టాడు వాసు.

అతడి రాకను గమనిస్తున్న జ్యోతి అతడిని చూసి నవ్వింది. వాసు అటూ ఇటూ చూసి తనూ నవ్వాడు- నవ్వలేక నవ్వినట్టు.

లెక్చరర్ పాఠం చెబుతూ ఉన్నాడు.

ఆమె వైపు చూడకూడదనుకుంటూనే మరోసారి ఆమెవంక ఓరగా చూశాడు.

ఆమె అతడినే గమనిస్తూ ఉంది. అతడు తన వైపు చూడగానే నవ్వింది.

తల తిప్పుకున్నాడు వాసు.

అందమైన ఆడది తనవంక చూస్తే

ఎవరో చూస్తారని తల తిప్పుకోవడం బాధనిపించింది అతడికి. కానీ తను ఆమె వైపు ధైర్యంగా చూడలేదు.

అది తన బలహీనతా? కాదు...పిరికి తనం!

ఇంకొక పది నిముషాలలో క్లాసు వదిలేస్తారనగా, అప్పుడు క్లాసులోకి అడుగుపెట్టాడు ఆనంద్.

లెక్చరర్ వంక చూడకుండా చేతు లూపుకుంటూ, ఈలవేసుకుంటూ వచ్చి కూర్చున్నాడు.

లెక్చరర్ ఆనంద్ వంక సీరియస్‌గా చూసి కూడా, 'ఈ వెధవతో నాకెందుకు' అని కాబోలు మళ్లీ తన పాఠంలో తల దూర్చాడు.

"ఏయ్ వాసూ! 'ఎంటర్ ది డ్రాగన్' మార్నింగ్‌షో ఉంది...వస్తావా" వెనక్కు తిరిగి వాసు వంక చూస్తూ అన్నాడు ఆనంద్.

వాసు భయంగా లెక్చరర్ వంక చూసి అన్నాడు–

"కాసేపు మౌనంగా ఉండు ఆనంద్! క్లాసు అయిపోయిన తర్వాత బయటకు వెళ్ళి మాట్లాడుకుందాం"

"ముందు నువ్వు వస్తావా రావా చెప్పు"

"నెక్ట్సక్లాస్ స్టాటిస్టిక్స్. చాలా ఇంపార్టెంట్ క్లాసు. నేను రాలేను" చెప్పాడు వాసు.

"ఓకే... నీ ఇష్టం" భుజాలెగరేసి అన్నాడు ఆనంద్.

అప్పుడే ఫస్ట్ పీరియడ్ అయినట్లు గంట మోగింది. లెక్చరర్ లేచి వెళ్ళి పోయాడు. ఇద్దరూ ఇవతలకు వచ్చారు.

"వాసూ...అయితే పిక్చర్‌కి రావా?" భుజంమీద చెయ్యివేసి కేంటిన్‌వైపు నడుస్తూ అన్నాడు ఆనంద్.

"నెక్ట్సక్లాస్ ఇంపార్టెంట్ క్లాస్. నేను రాలేను" చెప్పాడు వాసు.

"చూడు బ్రదర్! జీవితంలో ఆనం దాన్ని అనుభవించాలంటే ఇదే సరయిన వయసు. ఈ విద్యార్థి జీవితంపోతే వచ్చేది నిరుద్యోగ జీవితం. ఎవరి కాళ్లావేళ్లాపడో ఉద్యోగం సంపాదించుకున్నామనుకో, మన పెద్దవాళ్లు మనల్ని సుఖంగా ఉండ నివ్వరు. 'సంపాదిస్తున్నావుగా..ఇక పెళ్ళి చేసుకో' అని మెడకో గుదిబండని తగిలి స్తారు. అదే సంసార జీవితం. ఆ రెండు అధ్యాయాల్లో మనకు దక్కేది దుఃఖమే కానీ ఆనందం కాదు. అందుకే ఆనం దాన్ని ఇప్పుడే అనుభవించాలి" అర్జును నికి గీత బోధిస్తున్న కృష్ణుడిలా అన్నాడు ఆనంద్.

"ప్లీజ్...నువ్వెళ్ళిరా ఆనంద్"

"నేను చెప్పే నగ్నసత్యాలు నీకు అర్థంకావులే"

ఇద్దరూ కాంటిన్‌లో అడుగుపెట్టారు.

ఆనంద్ అందరినీ పలకరిస్తూ టీతాగు తున్నాడు. వాసు మాత్రం మౌనంగా టీ తాగుతూ ఆలోచనలో పడ్డాడు.

తన జీవితంలో ఎందరో స్నేహితులు ఎదురయ్యారు. కొందరు ఎంతో దగ్గర అయ్యారు.కానీ అందరూదూరం అయిపో యారు. తను ఎవర్నీ బాధపెట్టేవాడు కాదు. స్నేహితులకు తన డబ్బే ఖర్చు పెట్టేవాడు. అయినా అందరూ దూరం అయిపోయారు. కారణం–స్నేహితుల్ని ఆకట్టుకోవడం తనకు తెలియదు. జోక్స్ కట్ చేస్తూ, నవ్వుతూ తుళ్లుతూ, ఎవరి దగ్గర వారిమాటలు మాట్లాడుతూ కలసి పోవడం తనకు తెలియదు. అదొక్క కారణమే తననుండి స్నేహితుల్ని దూరం

చేసేది. ఓ మంచి స్నేహితుడు దొరకడం కూడా అదృష్టమే.

ఇప్పుడు తనకున్న ఒకేఒక స్నేహితుడుఆనంద్. డిగ్రీలోచేరిన మొదట్లో పరిచయం అయ్యాడు. ఇంతవరకూ స్నేహంగానే ఉన్నాడు.

"ఓకే వాసూ...నేను సినిమాకెళ్తున్నాను" వాసు దగ్గరగావచ్చి అన్నాడు ఆనంద్.

"అలాగే"

బిల్లు పేచేసి వెళ్ళిపోయాడు ఆనంద్.

పుట్టిందే ఆనందాన్ని అనుభవించే దానికిఅనుకునే వ్యక్తిఆనంద్. ఓ ఆశయం లేదు, ఓ గమ్యంలేదు. ఆనందంగా ఉండటమే ఆశయం....అనుభవించడమే గమ్యం.

లేచి క్లాసువైపు నడిచాడు.

మరో రెండు క్లాసులు నడిచాయి.

క్లాసులు అయిపోయిన తర్వాత ఇవతలకు వచ్చి లైబ్రరీవైపు నడువసాగాడు వాసు.

"ఏమండి" పరిచితమైన కంఠం అది.

తిరిగిచూశాడు వాసు. జ్యోతి పక్కగా వచ్చి ఆగింది.

"హిస్టరీ క్లాసుకి మీరు లేట్‌గా వచ్చినట్టున్నారు. నోట్స్ చెప్పారు లెక్చరర్"

"అలాగా" అతడు ముందుకు నడువసాగాడు. అతడి పక్కనే నడువసాగింది జ్యోతి.

"మీరు కావాలంటే నా నోట్స్ తీసుకెళ్ళండి. రాసుకుని రేపు తెచ్చివ్వండి" నోట్స్ అందించిందామె.

ఆమె చేతిలో నుండి నోట్స్ అందుకున్నాడు వాసు. ఇద్దరూ మెట్లు ఎక్కుతున్నారు.

"మనకు పరీక్షలు మరో రెండు నెలలలో జరగబోతున్నాయి కదా! మీరు బాగా చదువుతున్నారా?"

"మీలా ఫస్ట్‌క్లాస్ రాకున్నా కనీసం ఆర్డినరీలోనన్నా పాసవుతాను"

"మీరు తప్పకుండా ఫస్ట్‌క్లాస్ సంపాదిస్తారు" అందామె.

ఆమె మాటల్లో ఆప్యాయత వుంది. ఆమె కన్నుల్లో అనురాగం వుంది. ఆమె గుండెల్లో అభిమానం వుంది.

అది ఎప్పుడో గుర్తించాడు వాసు.

"ఏమిటీ...మీ స్నేహితుడు సినిమాకి పిలుస్తున్నాడా?" నవ్వుతూ అందామె.

"వాడికెప్పుడూ సినిమాలు, షికార్లే" తనూ నవ్వుతూ అన్నాడు వాసు.

ఆమెకు అతడితో ఇంకా ఎంతో మాట్లాడాలని వుంది. అలాగే మాట్లాడుతూ వుండిపోవాలనీ వుంది. కానీ అప్పటికే లైబ్రరీ వచ్చేసింది.

* * *

హాస్టల్‌లో-భోంచేసి వచ్చి పుస్తకం పట్టుకుని పడుకున్నాడు వాసు.

ఆ చిన్న గదిలో అతడు ఒక్కడే వుంటున్నాడు.

ఆ గదిలో ఓ మూల చిన్న మంచం. మంచం మీద పరుపు. మరో మూల సూట్‌కేస్. పైనున్న అరలో కొన్ని పుస్తకాలు.

శుభ్రంగా ఉందా గది.

పుస్తకం పక్కన పెట్టి ఆలోచనలలో పడ్డాడు వాసు. అతడి ఆలోచనలన్నీ జ్యోతిని గురించే.

జ్యోతి తనను ప్రేమిస్తోంది. తనంటే ప్రాణం ఇచ్చేందుకైనా సిద్ధంగా ఉంది. తనంటే పడిచస్తుంది.

కానీ విచిత్రం...ఆమె యందు తనకు




విడదీయలేనంత ప్రేమ మాత్రం లేదు. కేవలం ఓ విధమైన, చెప్పుకోలేని అభిమానం మాత్రమే.

అయితే ఆమె మాత్రం తనను విపరీతంగా ప్రేమిస్తోందని తెలుసు. అయినా తనలో ఏం స్పెషాలిటీ ఉందని ఆమె తనని ప్రేమిస్తూ ఉంది!

తను పెద్ద అందగాడుకాదు. కార్లలో తిరిగే ధనవంతుడుకాదు. కనీసం కళాకారుడన్నా కాదు. తెలివైన విద్యార్థి అసలే కాదు. మరి ఆమె తననే ఎందుకు ప్రేమించింది?

కేవలం ఆనాటి సంఘటనేనా, ఆమెలో తన మీద ప్రేమ జనించేలా చేసింది? ఆ ఒక్క సంఘటన తప్ప తమ మధ్య గాఢమైన ప్రేమ జనించే సంఘటనలు ఏం జరిగాయి? ఏమీ లేవు... ఆ ఒక్క సంఘటన, ఆ అతి చిన్న సంఘటన తప్ప.

ఆరోజు...

కాలేజీ వార్షికోత్సవాలు జరుగుతూ ఉన్నాయి—ఓ సినిమా స్టార్ ముఖ్య అతిథిగా!

తాము ఇద్దరు అప్పుడు సెకండ్ ఇయర్ చదువుతున్నారు. క్లాసులో తమ ఇద్దరికీ ముఖ పరిచయం తప్ప మరే పరిచయం లేదు.

ఆరోజు కాలేజీ లైబ్రరీ నుండి తను వస్తూ ఉన్నాడు.

ఆమె కూడా లైబ్రరీ నుండే వస్తోంది.

అప్పుడు సమయం ఆరున్నర అయి ఉంటుంది. చీకటిపడింది. ఆ స్థలంలో లైట్స్ కూడా లేవు.

అప్పుడే కారులోంచి దిగాడు ఆ సినీనటుడు.

స్టూడెంట్స్ అందరూ కారు వైపు పరుగెడుతున్నారు. ఆదొక వేలం వెర్రి. తోసుకుంటూ ముందుకు వెళుతున్నారు.

కారుకి దగ్గరగా ఉంది జ్యోతి. ఆమె పక్కనే వస్తున్నాడు తాను. అనుకోకుండానే తమ ఇద్దరిదగ్గరే కారు ఆగడంతో, వచ్చిన జనం మధ్య చిక్కుకుపోయారు. సినిమానటుడిని చూడాలని వచ్చిన జనం మధ్య చిక్కుకుపోయి ఉక్కిరిబిక్కిరి అయిపోతూ ఉందామె. తనదీ అదే పరిస్థితి. ఆ గుంపులో నుండి బయట పడాలని తాపత్రయపడ్డాడు తను.

ఆ గుంపులో నుండి తప్పించుకొని బయటపడాలని ప్రయత్నిస్తున్న ఆమెకు ఆ క్షణంలో ఆపద్బాంధవుడిలా కనిపించాడేమో! దగ్గరగా వచ్చి చెయ్యి పట్టుకుందామె.

చిత్రంగా ఆమెవైపు చూశాడు తను.

''అవతలికి పోవాలి నేను'' మాటలు తడబడుతూ వచ్చాయి.

ఆమె చేయి గట్టిగా పట్టుకొని, మరో చేయి ఆమె చుట్టూ కవచంలా ఉంచి, ఆ జనం నుంచి బయటపడ్డాడు తను.

ఆమె పక్కనేవున్న ఓ గోడకు ఆనుకొని ఎగశ్వాస పీలవసాగింది.

"ఏమండీ..." ఆతృతగా ఆమె వంక చూస్తూ అన్నాడు.

నీళ్ళు కావాలన్నట్టు చేతితో సైగ చేసింది. పరిగెత్తుకుంటూవెళ్ళి కాంటీన్‌లో నుండి గ్లాసుతో నీళ్లు తెచ్చి ఇచ్చాడు.

కొద్దిసేపటికి ఆమె తేరుకున్నట్టు కనిపించింది.

గ్లాసు కాంటీన్‌లో పెట్టి వచ్చాడు.

పిచ్చి జనం ఇంకా సినిమా నటుడి వెనకే పడి పక్కవారిని కూడా గమనించని స్థితిలో ఉన్నారు.

"లేవగలరా" అన్నాడు.

* పచ్చని పైరు విప్లవానికి..
* పాడి పరిశ్రమాభివృద్ధికి..
* గ్రామసీమల సౌభాగ్యానికి..
మార్గదర్శి

# అన్నదాత

## వ్యవసాయదారుల సచిత్ర మాసపత్రిక



సాలు చందా రూ. 24/- మాత్రమే

పోస్టేజి ఉచితం

విడిప్రతి రూ. 2/-



అన్నదాత
ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ, హైదరాబాద్-500 004
ఫోన్: 223422

లేచిందామె. ఇద్దరూ కాలేజీ ఆవర ణలో నుండి ఇవతలకు వచ్చారు.

"థాంక్సండీ! మీరు కాపాడకుంటే, మరో రెండు నిమిషాల్లో ఆ జనాల మధ్యే ఊపిరాడక నలిగి చనిపోయి ఉండేదాన్నేమో" అందామె!

మౌనంగా ఉండిపోయాడు తను.

"వస్తాను" నవ్వి చెప్పిందామె.

తలూపాడు తను.

వెళ్ళిపోయిందామె.

ఆ ఒక్క సంఘటనేనా జ్యోతికి తన మీద ప్రేమ కలిగించేలా చేసింది.

అవును...ప్రేమించేందుకు గొప్ప సంఘటనలేవో జరుగనవసరంలేదు. అతి చిన్న సంఘటన కూడా చాలు, అతి గొప్ప ప్రేమ జనించేందుకు.

జ్యోతితో తన తొలి పరిచయపు అనుభూతిని నెమరువేసుకుంటున్న వాసుకు తలుపు చప్పుడు వినిపించింది.

మంచం మీద నుండి వెళ్ళి తలుపు తీశాడు. ఈల వేసుకుంటూ లోనికి అడుగుపెట్టాడు ఆనంద్.

"వాసూ...ఏం చేస్తున్నావ్?"

"చదువుకుంటూ ఉన్నాను" పుస్తకం మూసి పక్కన పెడుతూ అన్నాడు వాసు.

"చదువు, చదువు, చదువు! స్కూలే పిల్లలా ఎప్పుడూ చదువుకోవటమేనా? కాసేపయినా ఆనందంగా ఉండేదిలేదా!" విసుగ్గా ముఖంపెట్టి అన్నాడు ఆనంద్.

"భవిష్యత్తులో ఆనందంగా ఉండాలంటే ఇప్పుడు కష్టపడటం తప్పదు బ్రదర్"

"భవిష్యత్తు ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు బ్రదర్! ఈరోజు, ఈక్షణమె మనం మరణించవచ్చు. అందుకే దొరికిన వరకూ అనుక్షణం అనుభవించడమే మన పని"

"ప్రతి మనిషికీ భవిష్యత్తుమీద ఓ నమ్మకంవుంటుంది బ్రదర్...ఆ నమ్మకం తోనే రేపటికోసం ఈరోజు కష్టపడతాడు మనిషి"

"నీతో నేను వాదించలేనుగానీ ఇప్పుడు నేను చెప్పినట్టు వింటావా లేదా"

"ఏం చెయ్యమంటావు చెప్పు గురూజీ" రెండు చేతులు కట్టుకుని విన యంగా అడిగాడు వాసు.

"సినిమాకి వెళ్దాంపద శిష్యా" అధికారికంగా అన్నాడు ఆనంద్.

"ఏ సినిమాకి వెళ్దాం గురూజీ?"

"'పారిస్ ఐ లవ్ యూ'కి వెళ్దాంపద శిష్యా"

"చిత్తం గురూజీ"

వాసు వైపు చిత్రంగాచూసి అన్నాడు "నిజంగానే వస్తావా?"

"బుద్ధితక్కువై గురువు అన్నానుగా. గురువు చెప్పినట్టు శిష్యుడు వినాలిగా! అయినా సినిమా చూడగానే చెడిపోతామా? చెడు చూడు, చెడు విను, కానీ చెడిపోకు. జస్ట్ ఫర్ ఎంటర్‌టైన్‌మెంట్...పోదాం పద"

"అయితే వస్తావన్నమాట"

"అయామ్ రెడీ" లేచాడు వాసు.

ఇద్దరూ సినిమాహాలు వైపు కదిలారు.

సినిమాచూసి తిరిగి వస్తుంటే ఆనంద్ అన్నాడు.

"మంగమ్మ మేడ దగ్గరికి వస్తావా?"

"ఎందుకు?" అమాయకంగా అడి గాడు వాసు.

చూసిన సినిమాలోని స్త్రీల అర్థనగ్న సౌందర్యం అతడి కనులముందు కని పిస్తోంది. నగ్నత్వాన్ని చూసిన కాము కత్వం ఎగసిపడుతోంది ఆనంద్‌లో.

"ఆ ఇంట్లో చక్కని చుక్కలు ఉంటాయి...వస్తావా?"

వయస్సుకు, ఆశయానికి ఘర్షణ పడుతుంది ఒక్కోసారి. ఒక్కోసారి వయసు గెలుస్తుంది. ఒక్కోసారి ఆశయం గెలుస్తుంది.

"సారీ...నేను రాలేను" అన్నాడు వాసు.

"మరి సినిమాకు వచ్చావుగా?" అడిగాడు ఆనంద్.

"నేను చెప్పానుగా! చెడు చూడొచ్చు, కానీ చెడిపోకూడదని. చెడిపోవడం అంటే ఇదే"

"ప్లీజ్...నాకోసం"

"అటువంటి పనులు ప్రాణ స్నేహితుడి కోసమైనా చెయ్యలేను"

వాళ్ళిద్దరి దారులూ వేరయ్యాయి. ఆనంద్ రోడ్డు మారితే వాసు ఇంటిదారి పట్టాడు.

* * *

నిద్రపోతున్న వాసు ఉలిక్కిపడి లేచాడు.

బయట హోరున గాలి కొడుతోంది. వర్షం కూడా వస్తోంది.

లేచి తలుపు తీశాడు. వర్షం జల్లు రివ్వునవచ్చి శరీరానికి తాకింది. తటాలున తలుపు మూసేశాడు. అప్పుడు గుర్తుకు వచ్చిందిఅతడికి, మధ్యాహ్నం రేడియోలో చెప్పిన తుఫాను హెచ్చరిక.

అప్పుడే మొదలయిన వర్షం గాలికి తోడై క్షణాల మీద తుఫానుగా మారిపోయింది. మంచం మీద వచ్చి కూర్చున్నాడు వాసు.

ఒక్క క్షణం-...

ఎవరో తలుపు తట్టినట్టయింది. గాలి విసురుకు కాబోలు అనుకున్నాడు. మరోసారి తలుపు తట్టిన చప్పుడూ, దానితో పాటే ఓ స్త్రీ పిలుపూ "ఏమండీ" అని.

ఈ వేళలో, ఈ వాతావరణంలో పిలిచేవారు ఎవరు?

లేచి వెళ్ళి తలుపు తీశాడు.

గాలివాన విసురుతో పాటు ఆమె కూడా లోపలికి వచ్చింది. లోపలికి అడుగుపెట్టిన వెంటనే తలుపు మూసేసింది.

సన్నగా ఉందామె. తెల్లగా ఉందామె. వర్షంలో పూర్తిగా తడిసిన ఆమె, ఒంటికి అంటుకున్న చీరతో క్రైపెక్కించేలా ఉంది.

"ఇంటికి వెళుతుంటే దారిలోనే గాలివాన వచ్చేసింది. అందుకే..." మెల్లగా చెప్పిందామె.

అతడు పలుకలేదు. టవల్ అందిస్తూ అన్నాడు-"తల తుడుచుకోండి"

టవల్ అందుకుందామె.

ఆమె తల తుడుచుకుంటుంటే ఓరగా ఆమె వైపు చూశాడు. ఒంటికి అంటుకున్న చీర ఒంపుసొంపులను బహిర్గతం చేస్తోంది.

తల నుండి రాలే నీటి బిందువులు మోముపై నిలచి, మోములోని తెల్లదనానితో పోటీ చేయలేక కిందకు జారుకుంటున్నాయి.

అతడు తనను పరీక్షగా చూడటం గమనించిందామె. ఆమె చూసిందని తెలిసి తల తిప్పుకున్నాడు అతడు.

బయట హోరున కురిసే వాన, భయంకరంగా వీచే గాలి. లోపల ఓ ఒంటరి స్త్రీతో తను. ఈ అనుభవం చాలా గమ్మత్తుగా ఉంది అతడికి. అలాంటి ఘట్టాలు కొన్ని పుస్తకాల్లో చదివే ఉన్నాడతను.

 

అతడిలోని ఆ భావ సంచలనం గమనించిందామె. కాని తనమీద ఏదైనాఅత్యాచారం చేస్తాడని మాత్రం భయపడలేదు. మానవ నైజాన్ని చదివిన మహామనీషిలా నవ్వుకుంది...అంతే.

అతడు మంచంమీద కూర్చున్నాడు. "కూర్చోండి" అన్నాడు అతడు. మంచం చివరగా కూర్చుందామె.

ఏదో పలకాలని అతడి మనసులో. కానీ పలుకను మాటలే లేనట్లు మౌనంగా ఉండిపోయాడు.

ఎక్కడో ఓ మెరుపు మెరిసింది. దానితో ఓ ఉరుము ఉరిమింది. గుప్పున లైట్లు ఆరిపోయాయి.

"కరెంట్ ఆఫ్ అయింది" అన్నది ఆమె.

"కొవ్వొత్తి ఉంది...చూస్తాను" ఆ చీకట్లో అతడి కంఠం అస్పష్టంగా పలికింది.

ఆమె ఉన్న వైపు నడిచాడు వాసు. కావాలనే కొవ్వొత్తి సాకుతో మంచం పక్కగా నడుస్తున్న అతడికి ఆమె కాలు అడ్డు తగిలింది. తూలి ఆమెమీద పడ్డాడు. ఆ వూపునకు ఆమె అలాగే మంచంమీదకు వెనక్కు వాలి పడింది. ఆమెమీద అతడు.

అతడిలో ఓ చలనం.

అతడిలో విద్యుత్ తరంగాల ప్రకంపన! శరీరంలోని అణువణువునా చైతన్య స్రవంతి.

శరీరమే గుర్తుకురాని ఓ వివశత్వం.

అతడి చేతులు రెండూ ఆమె నడుము చుట్టూ పెనవేసుకున్నాయి. అతడి పెదవులు ఆమె పెదవుల్ని అందుకోబోతున్నాయి పెదవుల మకరందం కోసం. అతడు ప్రణయ కెరటంలా విరుచుకు పడుతున్నాడు.

కానీ...

అతడు చేసే పనులన్నీ ఆమె నిశ్చల జీవ ప్రతిమలా చూస్తూ ఉంది. ఆ క్షణం స్త్రీలలో ఉండాల్సిన చలనం ఆమెలో లేదు.

అది గమనించాడు అతడు.

"ఇష్టం లేదా?" అడగలేక అడిగాడు అతడు.

"నాకు...నాకు ఆకలిగా ఉంది. ఏదైనా ఉంటే పెట్టు...ఆ తర్వాత నీ ఇష్టం"

ఉప్పెనలా ముంచుకు రావాలని వస్తున్న ఓ భయంకర కెరటం, ఎందుకో మనసు మార్చుకుని సముద్రగర్భంలో కలిసిపోయినట్టు తుఫానుగా రాబోతున్న ఓ భయంకరమైన విసురు, మధ్యలోనే మనసు మారి ప్రశాంతంగా మారిపోయినట్లు, అతడిలోని వుద్రేకం తగ్గిపోయింది.

కొవ్వొత్తి వెలిగిందా గదిలో.

ఆమె నుండి విడివడి కిటికీ వైపు నడిచాడు. కిటికీ తలుపులు తెరచి చూశాడు. తుఫాను వేగం మరింత పెరిగింది. కిటికీలోనుండి వర్షం జల్లులు అతడిమీద పడుతూనే ఉన్నాయి. అతడు కాసేపు అలాగే ఉండిపోయాడు. అతడిలో ఎన్నో భావాలు.

ఆ చల్లని నీరు చాలావరకూ అతడిలోని వేడిని తగ్గించింది.

ఇవతలకు వచ్చి, ఆమె వైపు చూశాడు వాసు. తల దించుకుని వుందామె.

"మీరుకాదు తల దించుకోవలసింది... నేను. తప్పుచేసింది మీరు కాదు...నేను" అన్నాడు వాసు.

వింతగా అతడివైపు చూసిందామె!



"ఇంటికొచ్చిన అతిథిపై అత్యాచారం చేయబోయాను"

"లేదు...వయసులో ఉన్నవారికి అవకాశం కలిగి, సమయం సందర్భం చిక్కితే ఎవరైనా ఇలాగే చేస్తారు"

అతడు ఆశ్చర్యంగా ఆమెవైపు చూశాడు.

తర్వాత అలమరా వైపు నడిచాడు. అలమరాలో ఉన్న బ్రెడ్ తీసి ఆమెకి ఇచ్చాడు.

"అది తింటూ ఉండండి...ఏదైనా సినిమా హాలు దగ్గరకెళ్ళి తినేందుకు ఏదైనా పట్టుకొస్తాను'' అన్నాడు వాసు.

"వద్దులెండి. ఈ గాలి వానలో ఎక్కడికని వెడతారు. వెళ్ళినా అంగళ్ళన్నీ మూసేసి ఉంటాయి" అందామె.

"ఫర్వాలేదు...వెళ్ళొస్తాను"

"ప్లీజ్...వద్దండి"

ఆ తర్వాత అతడు మౌనంగా ఉండిపోయాడు.

అలమరాలోనుండి టీ పొడి, చక్కెర తీశాడు వాసు. స్టౌ వెలిగించి బ్లాక్ టీ తయారుచేశాడు

"తీసుకోండి" అన్నాడు వాసు.

కృతజ్ఞతగా అతడివైపు చూసి కప్పు అందుకుందామె. తనూ ఓ కప్పు తీసుకుని ఆమె కెదురుగా కూర్చున్నాడు కుర్చీలో.

"మీ పేరు?" అడిగాడు వాసు.

"లక్ష్మి" చెప్పిందామె.

"ఏం చేస్తుంటారు?" అడిగాడు అతడు.

ఒక్క క్షణం బాధతో రెపరెపలాడాయి ఆమె కన్నులు.

"సారీ! మీకు అబద్ధం చెప్పలేను.

అలాగని నిజం చెప్పడం నాకు ఇష్టం లేదు. దయచేసి ఆ ప్రశ్న అడగొద్దు నన్ను"

చిత్రంగా ఆమె వైపు చూశాడు అతను. తర్వాత అనుకున్నాడు, 'తన వివరాలు చెప్పడం ఇష్టంలేదు కాబోలు'.

అందుకే టాపిక్ మార్చి అన్నాడు–

"గాలి చాలా బలంగా వీస్తోంది. ఉదయం వరకూ ఇలాగే ఉంటుందేమో?"

ఆమె బదులు పలుకలేదు. బదులుగా ఆవలించింది.

"మీరేం చేస్తుంటారు?" అడిగింది లక్ష్మి.

"డిగ్రీ చదువుకుంటూ వున్నాను. ఈ సంవత్సరం ఫైనలియర్" చెప్పాడు వాసు.

ఆవలించింది ఆమె.

"మీకు నిద్రొస్తున్నట్టుంది. ఆ మంచం మీదే పడుకోండి. నేనిక్కడ చాప వేసుకుని పడుకుంటాను" అన్నాడు వాసు.

"వద్దండీ! మీరు మంచం మీద పడుకోండి. నేను చాపమీద పడుకుంటాను" మొహమాటంగా అంది లక్ష్మి.

"వద్దు" గట్టిగా చెప్పాడు వాసు.

విధిలేనట్టు ఆ మంచం మీదే పడుకుంది లక్ష్మి.

కొవ్వొత్తి కొద్దికొద్దిగా కరిగి ఆరిపోయింది. మళ్ళీ చీకటి. బయట మాత్రం గాలి, వాన. అప్పుడప్పుడు ఉరుములు, మెరుపులు.

అతడికి మాత్రం నిద్రపట్టడంలేదు. అతడి ఆలోచనలన్నీ ఆమె మీదే.

ఆమె తన దగ్గరికి వస్తుందేమో! ఈ చలిలో వెచ్చని సుఖం అందిస్తానంటుందేమో!

కానీ ఆమె తన దగ్గరకు వచ్చినా తను కాదనాలి. ఆమెను తిరస్కరించాలి. ఆ మహోద్రేకంలో తను ఆమెను ఆక్రమించుకోవాలనుకున్నాడు. కానీ ఈ క్షణం తనలో ఆ కోరిక లేదు. ఆమె తనంత తను వచ్చినా, తన ఒంపుసొంపులను చూపించినా కాదనే మానసిక స్థయిర్యం తనలోవుంది.

తను అందరిలాంటి మగాడు కాకూడదు. ఆపదలో అబల తన గదిలోకి వస్తే, ఆశ్రయం కోరితే అది అలుసుగా తీసుకుని ఆమెమీద అత్యాచారం చెయ్యబోవటం నికృష్టులు చేసేపని.

తనకు కొన్ని ఆశయాలున్నాయి. తను సంస్కారవంతుడిలా బతకాలనుకుంటున్నాడు.

ఆలోచనలలో వున్నాడు వాసు.

ఆదేక్షణం మంచంమీద పడుకున్న ఆమెకు కూడా నిద్ర రావడంలేదు.

అతడు తన దగ్గరికి వస్తాడేమో! ఈ చలిలో వెచ్చని సుఖం కోరతాడేమో! అతడు కోరితే తను కాదనగలదా! వీలయినంతవరకూ అతనిని తన దగ్గరకు చేరకుండానే చెయ్యాలి.

కానీ ఆమె దగ్గరకు అతను ఎంత సేపటికీ రాలేదు.

అతడు నిద్రపోయినట్టు గమనించిన తర్వాత అనుకుందామె–

'మిత్రుడా! నీవు ఇచ్చిన ఆశ్రయానికి ప్రతిఫలంగా నీ దరికిచేరి నీకు సుఖాన్ని అందించగలను. అందరికీ సుఖాన్ని ఇవ్వడం నాకు అలవాటే. అందరికి 'డబ్బు'కు 'సుఖం' అందించే నేను నీవు చూపిన ఆదరణకు ప్రతిఫలంగా ఉచితంగానే సుఖాన్ని అందించగలను. కానీ నీకు ఆ అవకాశం ఎందుకు




ఇవ్వలేదో తెలుసా? నీమీద అభిమానంతో నీకు సుఖంతో పాటు సుఖవ్యాధుల్ని జమచేయకూడదని ... అంతే!'

వాసు నిద్రలేవక ముందే వేకువనే అక్కడినుండి వెళ్ళిపోయింది లక్ష్మి అనబడే ఆ యువతి.

* * *

"ఎక్కడినుండి వస్తున్నావు?" అడిగాడు వాసు.

మంచంమీద పడుకున్నాక తీరిగ్గా చెప్పాడు ఆనంద్.

"డాక్టర్ దగ్గరకు వెళ్ళాను"

"ఎందుకు?"

"ఈమధ్య ఓ సాహసం చేశాను. దాని ఫలితంగా డాక్టర్ దగ్గరకు వెళ్ళాల్సి వచ్చింది" అన్నాడు ఆనంద్.

"ఏం సాహసం చేశావు? ఏదైనా గోడ దూకి పడ్డావా?"

"అదికూడా విడమరచి చెప్పాలా? ఓ అమ్మాయి దగ్గరకు వెళ్ళాను. దాని ఫలితం డాక్టర్‌దగ్గరకు వెళ్ళాల్సిరావడం"

బాధగా మిత్రుడివైపు చూశాడు వాసు.

"అలాంటి పాడుపనులు చేయక పోతేనేం" మందలింపుగా అన్నాడు.

సిగరెట్ వెలిగించుకుని అన్నాడు—

"ఏదో థ్రిల్‌కోసం వెళ్తాం బ్రదర్"

"థ్రిల్‌కోసం వెళ్ళి ఆరోగ్యం పాడు చేసుకుంటారా?"

"ఆరోగ్యానికన్నా ఆనందం చాలా ముఖ్యం బ్రదర్"

వాదించడం ఇష్టంలేక చేతిలోకి పుస్తకం తీసుకొని తెరిచాడు వాసు.

"కాసేపయినా ఆ పుస్తకం మొయ్యి. నీ ముందు కూర్చుంటే నాకే పిచ్చెక్కేట్టుంది. నేను ఉన్న కాసేపయినా ఆ పుస్తకం మూలపడెయ్యి" విసుగ్గా అన్నాడు ఆనంద్.

పుస్తకం మూశాడు వాసు. తర్వాత అన్నాడు—"ఏమిటి చెప్పు?"

"నేనేదో చెప్పేందుకు కాదు నిన్ను చదువు ఆపమన్నది. అలా చదివి చదివి నీకుఎక్కడ పిచ్చిపట్టుద్దోనని నా భయం"

"త్వరలో పరీక్షలు కదా! అందుకని కాస్త ఎక్కువగా కష్టపడి చదువుకుందా మనుకుంటున్నాను. సరే ఆపేసాను.... ఇప్పుడు చెప్పు ఏం చెయ్యమంటావో?''

"చదువుకునేందుకైనా, ఎందుకైనా ఓ టైము ఉండాలి బ్రదర్"

మౌనంగా ఉండిపోయాడు వాసు.

కాసేపు మౌనంగా ఉన్న తర్వాత ఆనంద్ అన్నాడు—

"రాత్రి గాలివాన వలన మన టౌన్‌కి చాలా నష్టమట. చుట్టుపక్కల పల్లెల్లో చాలా పంట పొలాలు దెబ్బతిన్నాయట"

గాలివాన అనగానే వాసుకి రాత్రి జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది. దాన్ని గురించి మిత్రుడికి చెప్పాలని పించింది.

"ఆనంద్! రాత్రి గాలివానప్పుడు నా రూమ్‌లో ఓ సంఘటన జరిగింది... చెప్పేదా?" అన్నాడు వాసు.

"ఏమిటది?" అడిగాడు ఆనంద్.

"రాత్రి గాలివాన ఎక్కువయ్యే సమయంలో నా రూమ్‌లోకి ఓ అమ్మాయి వచ్చింది..."

"రియల్లీ" మధ్యలోనే అందు కున్నాడు ఆనంద్.

"నిజం"

"అయితే రాత్రంతా స్వర్గ సుఖాలు అనుభవించావన్నమాట. అందమైన అమ్మాయి, బయట వాన, లోపల చలి,

చలిని తీర్చే జంట. వాటే వండ్రఫుల్ నైట్! నిజంగా నువ్వు అదృష్టవంతుడివి. అంతేకాదు ఇక ఆ అమ్మాయి కనిపిస్తే రోజూ స్వర్గపుటంచులు అందుకోవడమే. యూ ఆర్ లక్కీ ఫెలో" తుది, మొదలు లేకుండా చెప్పుకుపోతూనే ఉన్నాడు ఆనంద్.

"నువ్వు అనుకున్నది ఏమీ జరుగ లేదు ఆనంద్" మెల్లగా అన్నాడు వాసు.

"ఏం..." ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద్.

"నాకిష్టం లేకపోయింది"

"ఇష్టంలేక పోయిందా! లేక ఆమె ఎదురుతిరిగి కాదనిందా" అనుమానంగా అడిగాడు వాసు.

"ఆమె ఎదురుతిరగలేదు. కానీ నా మనసే ఒప్పుకోలేదు. ఆశ్రయం ఇచ్చిన స్త్రీని, ఆమె ఉన్న స్థితిని అలుసుగా తీసుకుని ఆమెను లొంగతీసుకోవడం ఇష్టం లేకపోయింది" చెప్పాడు వాసు.

అంతా విన్న తర్వాత ఆనంద్ అన్నాడు-

"నువ్వు చాలా అమాయకుడివి. చాతకానివాడివి. లేకుంటే ఓ ఆడది ఇష్ట పడిన తర్వాత కూడా ఆమెను విరహానికి గురిచేసి అలాగే ఉండిపోయావంటే... అంతకన్నా చాతకాని తనం మరొకటుంటుందా?"

"అది చాతకానితనం కాదేమో! మంచితనానికీ, చేతకానితనానికీ తేడా తెలుసుకోలేక అలా మాట్లాడుతున్నావు" మామూలుగానే అన్నాడు వాసు.

"చాతకానితనాన్ని మంచితనం అని భావించుకుంటూ ఆత్మతృప్తి పొందుతానంటే నాకేమీ అభ్యంతరం లేదు. చాతకాని ప్రతివాడు తమది చాతకానితనం అని ఒప్పుకోరు. అది మంచితనం అనే భావిస్తారు"

వాసు విసురుగా తలతిప్పి ఆనంద్ వైపు చూశాడు.

అది గమనించకుండానే ఆనంద్ చెప్పుకుపోతున్నాడు.

"ఓ మగాడు పదిమంది ఆడవారిని వెంటేసుకుని తిరుగుతుంటే మరో మగాడు అంటాడు వాడు వ్యభిచారి, తిరుగుబోతు, నాకలాంటివి నచ్చవు అని. వినేవాడికి అది మంచితనంగానే తోస్తుంది. కానీ ఆ అన్న వాడి మనసులోకి తొంగిచూస్తే వాడికి కూడా పదిమంది ఆడవారిని వెంటేసుకుని తిరగాలనే ఉంటుంది. కానీ వాడి పిరికితనంతోనో, ఆడవాళ్ళను ఆకర్షించడం చాతకాకనో అలాగే ఉండిపోతాడు. అది మంచితనం అనే మేలిముసుగులో ఉండే పిరికితనం అని పక్కవారికి అర్థంకాదు కదా!"

"నో! అవకాశం ఉన్నా మంచితనం కోసం, ఆశయంకోసం సుఖాలు వదులుకునేవారు కొంతమంది ఉన్నారు" అరిచినట్టు అన్నాడు వాసు.

"మంచివాళ్లు లేరని నేను చెప్పడం లేదు బ్రదర్! నేను చెప్పేది పబ్లిక్ సైకాలజీ గురించి. పిరికితనంతో, అవకాశం దొరక్క మంచివాళ్లుగా మిగిలిపోయే మంచివాళ్ళ గురించి. ఫర్ ఎగ్జాంపుల్ నీలాంటి పిరికివాళ్ళ గురించి" వాసు వైపు చూపిస్తూ అన్నాడు ఆనంద్.

"నాలాంటివాళ్ళ గురించా!" ఆశ్చర్యంగా అన్నాడు వాసు.

"అవును....నీలాంటి పిరికివాళ్ళ గురించే. జ్యోతి నిన్ను ప్రేమిస్తోంది. నువ్వుకూడా జ్యోతిని ప్రేమిస్తున్నావు.




అందమైన ఆమెను వెంటేసుకుని తిరగాలని, ఆమెతో షికార్లకు పోవాలని నీకూ ఉంది. కానీ వీధుల్లో నీకు తెలిసినవారు, మీ ఊరివాళ్లు ఎవరైనా కనిపించి చూస్తారేమోననే భయంతో నువ్వు ఆమెను వీలయినంతవరకూ దూరం చేసుకుంటున్నావు. ఈ విషయం అబద్ధం అని నీ గుండెలమీద చెయ్యేసుకుని చెప్పు" అన్నాడు ఆనంద్.

ఒకక్షణం ఆలోచించాడు వాసు. జ్యోతిని చూస్తే తనకు ఎంతో ఆనందం వేస్తోంది. ఆమెను దగ్గరకు తీసుకోవాలని, ఆమెతో సినిమాలకు, షికార్లకు వెళ్ళాలని పిస్తుంది. కానీ నిజమే...ఆనంద్ అన్నది నిజమే.

"నేను చెప్పింది కరెక్టే కదూ! నీ పిరికితనాన్ని నువ్వు మంచితనంగా భావించుకుని తృప్తిపడుతున్నావు కానీ నన్ను నేను మంచివాడుగా భావించుకోవడంలేదు. బతకడమే మంచితనానికన్నా గొప్పతనంగా భావించుకుంటున్నాను. మన ఆర్థిక పరిస్థితి పెద్ద గొప్పదికాదు. అంతంతమాత్రమే. ఈ డిగ్రీ పాసవగానే ఉద్యోగం వస్తుందనేం లేదు. ఉత్తరం దక్షిణం లేనిదే ఉద్యోగం రాదు. అవి ఇచ్చుకోగల పరిస్థితి కాదు మనది. అందుకే శక్తిగల ఒకరి అండ కావాలి మనకు. ఆ అండ నాకున్న నేర్పుతో నేను సంపాదించుకోవాలనుకున్నాను. ఆ కారణంగానే నేను నీరజను ఆకర్షిస్తున్నాను. ఆమె తండ్రి ఆస్తిపరుడు. ఇన్‌కంటాక్స్ ఆఫీసర్. ఆమె చేత ప్రేమింపబడితే ఆ తర్వాత నా జీవితమంతా సాఫీగా గడిచిపోతుంది. ఇప్పుడు చెప్పు—అన్నీ ఉన్న నీవు పిరికితనంతో జీవితంలో అనుభవించలేకున్నావు. కానీ ఏమీలేకున్నా జీవితంలో అన్నీ సమకూర్చుకోవాలనీ, అనుభవించాలనీ కృషి చేస్తున్నాను నేను. వీలయినంత వరకు చక్కదిద్దుకుంటున్నాను.

"ఇప్పుడు బాగా ఆలోచించు. ఎందుకూ పనికిరాని నీ పిరికితనం లేదా మంచితనం గొప్పదో! లేక సుఖపడేందుకు నేను ఎంచుకున్న మార్గం గొప్పదో" ఆనంద్ ఆగాడు.

వాసు బదులు చెప్పలేదు. ఆలోచిస్తున్నట్టు మౌనంగా ఉండిపోయాడు. కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

ఆనంద్ చెప్పినదాంట్లో చాలావరకు తనకు వర్తిస్తుంది. అందుకు తను ఒప్పుకుంటాడు. కానీ బతుకులో స్థిరపడేందుకు ఆనంద్ ఎంచుకున్న మార్గం తనకు నచ్చలేదు. ఆ దారి అంటే ఒక విధంగా ఆమెను మోసం చేస్తున్నట్టే! తన స్వార్థం కోసమే ప్రేమిస్తున్నాడు. ఆటువంటి హీనమైన పని తను చేయగలడా? తను అటువంటి పని చెయ్యలేడు.

"ఆనంద్! ఆ నీరజను నువ్వు మోసం చేస్తున్నావేమోననిపిస్తోంది. నీ స్వార్థం కోసం ఆమెను ప్రేమిస్తున్నావు. ఆమె నీది నిస్వార్థమైన ప్రేమ అని భ్రమ పడుతోంది కదా!"

"ఆమెను నా స్వార్థంకోసమే ప్రేమిస్తున్నాను. కానీ ఆమెను మోసంచేసే ప్రసక్తే లేదు. ఆమెను స్వార్థంతోటే ప్రేమించాను. కానీ రేపు ఆమె తల్లిదండ్రులు ఒప్పుకోకపోయినా, ఆమె ఆస్తిపాస్తులు నాకు రాకపోయినా ఆమెను నేను పెళ్లాడతాను. ఆమెను సుఖపెట్టేందుకే ప్రయత్నిస్తాను. నా ప్రేమలో స్వార్థం ఉండొచ్చు కానీ, మోసం ప్రసక్తే లేదు" చెప్పాడు ఆనంద్.

దొంగకూడా తనవైపు బలమైన వాదనే చెప్పాడు. మనసులోనే అనుకుని మౌనంగా ఉండిపోయాడు వాసు. ఇక ఆ టాపిక్ గురించి మాట్లాడటం ఇష్టంలేక, మరో టాపిక్ తీసుకొచ్చాడు.

"రాత్రి గాలివాన వచ్చింది కదా... ఊరెళ్ళి మీ అమ్మవాళ్లను చూసి రాకూడదా?" అన్నాడు వాసు.

"ఉదయమే వెళ్ళాలనుకున్నాను. కానీ రోడ్డుకు అడ్డంగా చెట్లు పడి బస్సులు నడవటంలేదట. రేపు ఉదయమే వెళ్ళి వస్తాను. ఇంతకీ నువ్వు ఊరెళ్ళవా?" అడిగాడు ఆనంద్.

"నాదీ అదే ప్రాబ్లమ్. బస్సులు నడవడం లేదట. సాయంత్రమైనా నడుస్తే వెళ్ళి వస్తాను'' చెప్పాడు వాసు.

"ఓకే బ్రదర్...వెళ్ళొస్తాను" కాసేపు కూర్చున్న తర్వాత అన్నాడు ఆనంద్.

"అలాగే" అన్నాడు వాసు. ఆనంద్ వెళ్ళిపోయాడు.

ఆనంద్ వెళ్ళిపోయినా అతడు అన్న మాటలు గురించే ఆలోచించసాగాడు వాసు.

అవకాశంచిక్కినా, అపకారం తలపెట్టకుండా మంచితనంతో వదిలివేస్తే అది పిరికితనమా! చాతకానితనమా! మంచి తనం కాదా?

అవకాశం సృష్టించుకొని, స్వార్థంతో ప్రవర్తించేవాడే గొప్పవాడా?

తనలో ఏదైనా లోపం ఉన్నా, అది లోపంగా గుర్తించేదానికన్నా, అదో గొప్పతనంగా ఊహించుకుని తృప్తి పడుతుంటారు కొందరు. వాసు కూడా అలాగే తన పిరికితనాన్ని మంచి తనంగా భావించుకుని తృప్తిపడుతున్నాడు. అయితే కొన్ని సందర్భాలలో అతడు మంచితనంగానే ప్రవర్తించాడు. లక్ష్మి విషయంలో కూడా మంచితనంతో మానవత్వంతోనే వ్యవహరించాడు. కానీ అతడు పిరికివాడే. అందుకే మంచి వాడనే బిరుదును తనకు ఊహించుకుని ఆలోచిస్తున్నాడు వాసు.

ఏమి లోకం ఇది! మంచితనాన్ని చాతకానితనంగాభావించే లోకం...మంచి తనానికి, చాతకానితనానికి తేడా తెలుసు కోలేని లోకం!!

ఈ లోకం మంచితనాన్ని ఎప్పటికి గుర్తిస్తుందో!

తను మంచివాడు కాబట్టే నీరజను అలా మోసం చెయ్యకూడదని ఆలోచించ గలుగుతున్నాడు. ఆమె మీద జాలిపడుతున్నాడు.

తనే అయితే ఆనంద్‌లా ఓ స్త్రీని మోసం చేయగలడా! ఆనంద్ చేసేది మోసంకాదా! మాయ మాటలుచెప్పి ప్రేమింపచేసుకోటం మోసం కాదా!

వాసు కనులముందు ఆనంద్ ప్రేమ జీవితం కదలాడసాగింది.



## 3

తొలి రోజుల్లో...ఓనాడు...!

గదిలో కూర్చుని ఎదురు ఇంటివైపు చూస్తూ ఉన్నాడు ఆనంద్. ఆ అమ్మాయి మరో కొద్దిక్షణాలలో వీధిలోకి వస్తుంది. తను ఆమె వెంటపడాలి. మెల్లగా మాటలు





కలపాలి. మనసులోనే అనుకున్నాడు ఆనంద్.

అనుకున్నట్టుగానే మరో అయిదు నిముషాలలో ఇంటిలో నుండి ఇవతలకు వచ్చింది నీరజ.

ఆమె చూపులలో పడాలని ఆమె పక్కనే నడువసాగాడు. ఆమె తనను గమనించాలి. అది అతడి ఉద్దేశం. అనుకున్నట్టుగానే ఆమె అతడివైపు చూసింది. ఆమె ఎక్కే బస్సు ఎక్కాడు ఆనంద్. ఇద్దరిదీ ఒకే కాలేజీ కావడంతో ఒకే స్టాప్‌లో దిగారు.

ఇద్దరూ కాలేజీలో ప్రవేశించారు. ఆమె బి.ఎస్సీ ఫైనలియర్ అని వివరం సేకరించాడు ఆనంద్.

ఆ మర్నాటి నుండి ఆమె వెళ్ళే టైముకే ఇవతలకు రావడం, ఆమె వెళ్ళే బస్సులోనే పోవడం జరుగుతోంది.అయితే అతడు ఆమెను పలకరించడం లాంటివి చెయ్యలేదు. ఆమె దృష్టిలో బుద్ధిమంతుడిగా కనిపించడమే అతని ఉద్దేశం.

అతడు ఊహించినట్టుగానే ఆమె దృష్టిలో పడ్డాడు!

"ఎదిరింట్లో ఓ గదిలో ఓ కాలేజీ కుర్రాడు వచ్చి చేరాడు. చాలా బుద్ధిమంతుడు" ఆ పదిరోజులలో ఆమె అతన్ని గురించి ఏర్పరచుకున్న అభిప్రాయం ఇది.

పదకొండో రోజు ఆమెను పలకరించాడు అతడు.

''నా పేరు ఆనంద్ అండీ... మీ ఎదిరింట్లో ఉంటున్నాను'' చెప్పాడు ఆనంద్.

అలాగా అన్నట్టు తలాడించింది ఆమె.

"ఏం చదువుతున్నారండీ మీరు?" తెలియనట్టే అడిగాడు అతడు.

"బి.ఎస్సీ ఫైనలియర్''

''అలాగా! అందుకేకాబోలు మీరు ప్రతిరోజూ పన్నెండు గంటలవరకు చదువుకుంటూ ఉంటారు" ఎప్పుడో సెకండ్‌షో నుంచి వస్తూ చూసినదాన్ని బట్టి అనేశాడు.

''నేను పన్నెండు గంటలవరకూ చదువుకుంటానని మీకెలా తెలుసు?''

''నేనూ ప్రతిరోజు పన్నెండు గంటలవరకూ చదువుకుంటూ ఉంటానండీ! మీరు పడుకున్నతర్వాతే పడుకుంటాను. అదే మీ గదిలో లైట్ తీసేసిన తర్వాతే నేనూ పడుకుంటాను" తడబడకుండా అబద్ధం చెప్పేశాడు.

"అలాగా!" అన్నదామె – ఎంత కష్టపడి చదివే కుర్రాడు అనుకొంటూ.

ఆ రాత్రి ఆమె తన గదివైపు చూస్తుందని తెలుసు అతడికి. అందుకే లైటు వేసి ఉంచి హాయిగా నిద్రపోయాడు ఆనంద్.

నీరజ పన్నెండింటివరకూ చదువుకుని పడుకోబోయే ముందు ఆనంద్ చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి. అతడు ఇంత పొద్దుపోయినదాకా చదువుకుంటూ ఉన్నాడా! ఆ ఆలోచన మనసులోకి రాగానే కిటికీ దగ్గరకువచ్చి నిలబడి చూసింది.

ఆ గదిలో లైటు ఇంకా వెలుగుతూ వుంది.

పాపం! ఎంత కష్టపడి చదువుకుంటూ ఉన్నాడు. ఈకాలంలో జులాయిగా తిరిగే వాళ్ళే ఎక్కువగానీ, ఇలా కష్టపడి చదివేవాళ్ళు ఎంతమంది ఉన్నారు– అనుకుంటూ పడుకుంది నీరజ.

అప్పటికి మూడు గంటలక్రితమే ఆనంద్ గురక పెట్టి నిద్రపోతున్నాడని

ఆమెకెలా తెలుస్తుంది?

ఆ మర్నాడు ఆతడు కనిపించగానే ఆమే అంది- "హలో!"

"హలో" ఆమే పలకరించడంతో పొంగిపోతూ అన్నాడు ఆనంద్.

"నాకన్నా చాలా ఎక్కువ కష్టపడే ట్టున్నారే మీరు? నేను పన్నెండు గంటలకు లైటార్పి నిద్రపోయేప్పటికి మీ గదిలో లైటు వెలుగుతూనే ఉంది. ఇంతకీ ఎన్ని గంటలవరకూ చదివారండీ?" అడిగింది నీరజ.

"ఎన్ని గంటలో ఏముందండీ.. పన్నెం డున్నరకు ఆపేశాను" చెప్పాడు.

"మీరింతగా కష్టపడి చదువుతున్నారే! ఇంతకీ మీరేం చదువుతున్నారు?" అడిగింది నీరజ.

"బి.ఎ. ఫైనలియర్" చెప్పాడు ఆనంద్.

"ఏ గ్రూప్?"

"హెచ్.ఇ.పి."

"ఆ గ్రూప్ కోసం ఇంతగా కష్టపడి చదవాలా!'' ఆశ్చర్యంగా అడిగింది నీరజ.

ఆనంద్ ఓ క్షణం తత్తరపడి తర్వాత అన్నాడు-

"యూనివర్సిటీ ఫస్ట్ రావాలని నా ఆశయమండీ! అందుకే ఇంతగా కష్టపడి చదువుతున్నాను"

అంతలో బస్సు వచ్చింది. ఇద్దరూ ఎక్కారు.

ఆరోజు రాత్రి నుండి లైట్ వేసి పడుకోవడం అలవాటు చేసుకున్నాడు ఆనంద్.

మరో పదిరోజులు గడిచాయి. వాళ్ళ



పరిచయం కొద్దిగా పెరిగింది. ఆమెకు అతడిమీద గౌరవం మరికొద్దిగా పెరిగింది.

ఆరోజు బస్సు ఎక్కబోయేముందు ఆనంద్ అడిగాడు–

"ఈరోజు సాయంత్రం పార్కుకి రాగలరా?"

"ఎందుకు?" అడిగిందామె.

"ఊరికే...మాట్లాడదామని" నసిగాడు ఆనంద్.

"అలాగే" నవ్వి అందామె.

ఆ సాయంత్రం గంట ముందునుంచే పార్కులో నీరజ కోసం వెయిట్ చేయ సాగాడు. అయిదు కావస్తుండగా అతడి దగ్గరికి వచ్చింది నీరజ.

"చాలా సేపయిందా వచ్చి?" అడిగింది ఆమె.

"ఓ గంట నుంచి ఎదురుచూస్తు న్నాను. కానీ ఈ గంట ఓ యుగంలా గడిచింది నాకు. మీరు వస్తారా రారా అని సందేహం ఓ పక్క, మిమ్మల్ని ఎంత త్వరగా నా కన్నులతో చూడ గలనో అని ఆతృత ఓవైపు,ఓ యుగంలా గడిచింది నాకు"

ఆమె నవ్వి అతడి పక్కనే కూర్చుంది.

"మీరు మాటలు భలే చెప్తారే! ఇంతకీ నన్ను ఎందుకు రమ్మన్నారు?"

"ఎందుకంటే...మీతో మాట్లాడాలని" నసిగాడు ఆనంద్.

"ఏం మాట్లాడాలని?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"ప్రత్యేకంగా ఏదో మాట్లాడాలని కాదండీ! ఏదయినా, ఏ విషయం గురిం చయినా మీతో మాట్లాడాలని. విషయం ఏదయితే ఏమిలెండి ... మీ ఎదురుగా





కూర్చుని మాట్లాడటమే నాకు కావలసింది"

"మీరు భలే చిత్రంగా మాట్లాడతారే"

"నా మనసు మీకు అర్థం కాలేదు లెండి! నా మనసు అర్థం అయితే నా మాటలు చిత్రంగా అనిపించవు. బాధగా అనిపిస్తాయి"

ఆమె రెండు నిముషాలు మౌనంగా ఉంది. అతడి ఉద్దేశం అర్థం అవుతూ వుందామెకు, టాపిక్ మార్చిందామె.

"మీరు నవల్స్ చదువుతారా?" అడిగిందామె.

"ఓ .... రోజుకు ఒక నవలన్నా చదవనిదే నాకు నిద్ర పట్టదండి. నవలలంటే పిచ్చిగా చదువుతాను"–ఏ పుస్తకం పట్టు కున్నా తనకు నిద్ర వస్తుందన్న విషయం దాచిపెట్టి గొప్పగా అన్నాడు ఆనంద్.

"అలాగా. ఈమధ్య కొత్తగా విడుద లయిన 'ప్రేమమంత్రం' నవల చదివా రాండీ!ఆహా...ఆ రచయిత ఎంత వెరైటీగా రాశాడండి" ఆనందంగా అన్నది నీరజ.

"అవునండోయ్! హీరోని, హీరోయిన్ ఓ ముద్దు పెట్టుకుని అతడిని విడిచిపెట్టి వెళ్ళిపోతుంది కదండి" ఏదో చీకట్లో బాణం వెయ్యడమంటే ఇలాగే కాబోలు అనుకుంటూ అన్నాడు ఆనంద్.

"ఆహా ! మీరు చెప్పేది 'ప్రేమ తంత్రం' నవలలోది. అయినా ఆ నవలలో వెరైటీ ఏముంది? అన్ని నవలల్లోలాగే హీరో కొట్టడం, హీరోయిన్ వెళ్ళిపోవడం. 'ప్రేమమంత్రం'లో వెరైటీ ఉంది కదండీ! హీరోయిన్ ముద్దు ఇవ్వలేదని హీరో కొట్టబోతే, హీరోయిన్ ఆడా మగా సమానమేనని అర్ధగంట ఉపన్యాసమిచ్చి తనే ఒక కరాటే దెబ్బ వేస్తుంది. దాంతో హీరో అలిగి వెళ్ళిపోతాడు. చివరికి తన తప్పు తెలుసుకుని తిరిగివచ్చి హీరోయిన్ కాళ్ళమీద పడతాడు''

"కరెక్ట్...కరెక్ట్! ఇప్పుడు గుర్తుకు వచ్చింది. దాన్ని అన్ని నవలల్లా కాకుండా రచయిత 'విప్లవపంథా'లో రాశాడు. హీరోయిన్ కరాటే గుద్దుతో హీరో అలిగి వెళ్ళిపోవడం, చివరికి తిరిగొచ్చి కాళ్ళమీద పడటం...చాలా వెరైటీ నవల" గడగడ చెప్పేశాడు ఆనంద్.

"అందుకే కదండీ! ఆ నవల అంతగా సేల్ అయింది"

"అవును. రికార్డులు బద్దలుకొట్టిందట" అని ఆగి అనుమానంగా చూశాడు ఆనంద్.

"అన్నట్టు... మీకు కరాటే ఏమయినా వచ్చా?" అనడిగాడు.

"నాకు పెద్దగా రాదులెండి. ఏదో మూడు నెలలు నేర్చుకుని ఆపేశాను. అయినా ఈ దేశంలో ప్రతి స్త్రీ కరాటే నేర్చుకోవాలని నేనంటాను. భర్త తన మీద చెయ్యి ఎత్తకుండా భార్య కాపాడుకోవాలంటే ఆడది కరాటే నేర్చుకుని వుండాలి. అలా నేర్చుకుంటేకానీ మగవాళ్ళ ఆగడాలు తగ్గవు" ఆవేశంగా అన్నది నీరజ.

ముందుకు తూలి పడబోయి నిలదొక్కుకున్నాడు ఆనంద్. కరాటే నేర్చుకున్న భార్యతో కాపురం గురించి ఓ క్షణం ఆలోచించాడు. ఇప్పటివరకూ కార్టూన్స్‌లో అప్పడాల కర్రలే చూస్తున్నాడు. ఇకనుండి ఆడాళ్ళ చేతిలో 'నన్‌ఛాకో'లు కనిపిస్తాయేమో!

"చాలా పొద్దుపోయినట్టుంది...వెళ్దాం పదండి" పైకి లేచింది నీరజ.

ఆమె వెనుకే బయలుదేరాడు ఆనంద్.

ఆ రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతంలో పది, పన్నెండు పుస్తకాలతో తన గది లోకి ప్రవేశించిన ఆనంద్‌ను చూసి అడిగాడు వాసు.

"ఏమిటి ఆనంద్! అన్ని పుస్తకాలు ఒకేసారి చేతపట్టావు. ఇంతకీ ఏం పుస్తకాలు అవి"

"'ప్రేమపాట్లు' అంటారు నాయనా వీటిని! ప్రేమకోసం గాడిద బరువు మొయ్యాల్సి వచ్చింది. పరీక్షలప్పుడు కూడా ఓ గంట చదివిన పాపాన పోలేదు నేను. ఇప్పుడు ఈ ప్రేమకోసం ఈ రాత్రంతా ఈ పుస్తకాలు...అదే నవల్స్ చదవక తప్పదు గురూ!"

"ప్రేమకోసం నవల్స్ చదవడమా! అంటే ఈ నవల్స్ చదివి అందులో రాసిన విధంగా ప్రేమించాలని అనుకుంటున్నావా?" అడిగాడు వాసు.

"నవలలు చదివి ఆ విధంగా ఆడాళ్ళ చేత ఆకర్షింపబడాలనుకునే స్థితికి నేను దిగజారలేదు గురూ! ఆడాళ్ళచేత ఎలా ఆకర్షింపబడాలా అన్న విషయాన్ని, నవలలో రాసుకునేందుకు నేనే ఆ రచయిత్రులకు చెప్పగలను.కాకపోతే ఇప్పుడు ఆ నవల్స్ నేను చదవాల్సి వచ్చింది. ఎందుకంటే—నా లవర్‌కి ఈ నవలల పిచ్చివుంది.'ముద్దు–గుద్దు','హద్దు పద్దు', 'పిచ్చి పిచ్చి', 'ఆకు వక్క' ఈ నవలలన్నీ వదలకుండా చదువుతుంది. నాకు బుద్ధి తక్కువయి నేను కూడా నవలలు చదువుతానని చెప్పాను. దాంతో నన్ను జలగలా పట్టేసింది. ఆ నవలలో హీరోయిన్ హీరోని కరాటే గుద్దు గుద్దుతుంది కదా! ఈ నవలలో హీరోయిన్ రౌడీలతో భలే ఫైట్ చేస్తుంది కదా! అని నన్ను యక్ష ప్రశ్నలు వేస్తుంది. నాకు తెలియదు మొర్రో అంటే తెలుగు నవలలు చదవని పల్లెటూరి మొద్దువా అని హేళనచేస్తుంది.

అందుకే ఈ రాత్రికి ఈ పన్నెండు నవలలు కంఠోపాఠంలా నేర్చుకుంటాను. రేపు ఎప్పుడయినా ఈ నవలల గురించి ప్రస్తావిస్తే అనర్గళంగా ప్రసంగించేలా కంఠస్థం చేసుకుంటాను. ఏ నవలలో ఏ హీరోయిన్‌ని ఎలా కొట్టింది, ఏ నవలలో ఏ హీరోయిన్ హీరోమీద ఎలా పగతీర్చుకుంది-అంతా కంఠస్థం పట్టేస్తాను"

నవ్వాడు వాసు.

"అవునులే గురూ! ప్రేమలో పడ్డ వాడిని చూసి అందరూ నవ్వుతారు" అంటూ ఆ నవలలు తీసుకుని వెళ్ళి పోయాడు ఆనంద్.

ఆ మర్నాడు అదే టైముకు వచ్చాడు ఆనంద్.

"వాసూ...అలా వెళ్దాంపద" అన్నాడు ఆనంద్.

"ఎక్కడికి?" అడిగాడు వాసు.

"నీరజగారికి ఓ పుస్తకం కావాలట. ఏ షాపుల్లోనూ లేదట. ఎక్కడైనా వుంటే తెచ్చివ్వమంది. ఆడది ఏదైనా అడిగితే తేలేకపోతే వాడు మగాడేకాదు. అటువంటి వాడిని ఏ నవనాగరిక అమ్మాయి ప్రేమించదు. ఇప్పుడు మనం ఆ పుస్తకం కోసం వేటకు వెళుతున్నాం"

ఇక తప్పదన్నట్లు అతడి వెనుకే బయలుదేరాడు వాసు.

ఇద్దరూ ఓ షాపులో కెళ్ళారు. సేల్స్‌మన్ దగ్గరగా వచ్చాడు.

"సిగ్గు వుందా!" అడిగాడు ఆనంద్.

అతడి వైపు వింతగా చూశాడు వాసు.

"ఏమిటీ?" అనుమానంగా అడిగాడు సేల్స్‌మన్.

"'సిగ్గు' నవల వుందా అని అడుగుతున్నాను" తడబడి అన్నాడు ఆనంద్.

"ఓహో...అదా! అవి స్టాక్ లేవండీ" చెప్పాడు సేల్స్‌మన్.

ఇద్దరూ షాపునుండి ఇవతలకు వచ్చారు.

"ఇదేం పేపరా?" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"కథ బాగానే వుంటుందటరా! ఆడవాళ్ళ కష్టాలన్నీ వివరించి, ఆఖర్న.. 'ఆడాళ్ళని ఇన్ని కష్టాలు పెడుతున్నారే మీకు సిగ్గులేదా?' అని రచయిత్రి మగాళ్ళని ప్రశ్నించిందట" వివరించి చెప్పాడు ఆనంద్.

"ఓహో...అలాగా! అయినా షాపులో కెళ్ళి సేల్స్‌మన్‌ని సిగ్గు ఉందా అని అడక్కు. ఎవరైనా కోపిష్టివాడయితే కొట్టినా కొడతాడు. 'సిగ్గు' నవల ఉందా అని అడుగు" చెప్పాడు వాసు.

"అలాగే" అన్నాడు ఆనంద్.

ఆరోజు టౌనుమొత్తం తిరిగి ఎలాగో ఆ పుస్తకం సంపాదించారు.

అలా తన స్వార్థం కోసం ఆడదానిని ప్రేమపేరుతో వంచిస్తున్నాడు ఆనంద్. అది తన ధైర్యం, నేర్పు అని చెప్పుకుంటు న్నాడు అతడు.

మరి, జ్యోతి తనను ప్రేమిస్తోంది. తను కూడా జ్యోతిని ప్రేమిస్తున్నాడు. కానీ తన పిరికితనంతో తను జ్యోతిని దూరం చేసుకోవాలనుకుంటున్నాడు.

అఫ్‌కోర్స్ ... తనది తప్పే! పిరికి తనంతో ప్రియురాలిని దూరం చేసుకోవటం తప్పే. కానీ ఆనంద్ చేసే తప్పుకన్నా పెద్దతప్పా?

ఏదీ నిశ్చయించుకోలేక, ఓ నిర్ణయానికి రాలేకపోయాడు వాసు.

* * *

టీస్టాల్‌లో కూర్చుని వున్నారు స్నేహితులు ఇద్దరూ. ఏదో చెప్పుకుని





నవ్వుకుంటూ ఉన్నారు ఇద్దరూ.

అప్పుడే అనుకోని సంఘటన ఒకటి జరిగిపోయింది.

రౌడీలా కనిపించే ఒకడు నిర్లక్ష్యంగా సిగరెట్ పీక విసిరికొట్టడంతో అనుకోకుండా అది వచ్చి వాసుకు తగిలింది. వాడు సారీ చెబుతాడేమోనని చూశాడు ఆనంద్. కానీ వాడు నిర్లక్ష్యంగా తల ఎగరేసి పోబోయాడు. ఆనంద్‌కి ఒళ్ళు మండుకొచ్చింది. వెళ్ళి వాడి చొక్కా పట్టుకున్నాడు.

వాసు గుండె దడదడలాడింది. వాడు చూస్తే రౌడీ వెధవలా ఉన్నాడు. వాడితో తగాదా ఎందుకు?

"ఏరా! ఒళ్ళు కనిపించటంలా! సిగరెట్ ముక్క మొహానికి కొడతావా?" చొక్కా పట్టుకుని గుంజుతూ అన్నాడు ఆనంద్.

"ఏయ్...ఏమిటి చొక్కా పట్టుకుంటావు? చూడక విసిరి కొట్టాను" నిర్లక్ష్యంగానే జవాబు ఇచ్చాడు వాడు.

"చూడక విసిరితే సారీ అని మర్యాదగా చెప్పొచ్చుగా"

"ఏయ్! నాకవన్నీ తెలియదు. నా చొక్కా పట్టుకున్నావే, నేనెవరో తెలుసా?" కోపంగా అడిగాడు వాడు.

"ఎవడివయితే నాకెందుకు? మర్యాదగా సారీ చెప్పు. వదిలేస్తా. లేకుంటే ఇక్కడ పెద్ద గలాటా జరిగిపోతుంది" హెచ్చరించాడు ఆనంద్.

"ఆనంద్..పోనీలే! వాడిని వదిలెయ్" భయపడుతూ అన్నాడు వాసు.

"నువ్వు నోర్మూసుకో" అని వాసుని కసురుకొని, వాడివైపు తిరిగాడు ఆనంద్.

"రేయ్...మర్యాదగా సారీ చెప్పు" ఎర్రబడ్డ కళ్ళతో అన్నాడు ఆనంద్.

"నేను ఏదీ చెప్పను! ఏంచేస్తావురా?" విదిలించుకుంటూ అన్నాడు వాడు.

"ఏం చేస్తానా?" మొహం మీద గట్టిగా కొట్టాడు ఆనంద్. ఎగిరి బయట పడ్డాడు వాడు.

వాడు ఒక్క క్షణం బిత్తరపోయాడు. ఎదుటి వ్యక్తి అలా కొడతాడని ఊహించలేదు! ఎదుటి వ్యక్తి కొట్టడంతో పిచ్చిపట్టినట్టు ఆనంద్‌పైకి వచ్చాడు వాడు. అది ఊహించినట్టుగానే వాడు దగ్గరకు రాగానే 'ఫట్ ఫట్'న రెండు దెబ్బలు వేశాడు ఆనంద్! కుప్పలా కూలాడు వాడు.

ఎదుటి వ్యక్తి తనకన్నా బలమైన వాడనీ, అతడితో తను పోట్లాడలేననీ అర్థం చేసుకున్నాడు వాడు. అందుకే నిస్సత్తువుగా పైకి లేచాడు.

"రేయ్...నన్నుకొడతార్రా! మీ అంతు చూస్తాను" అరుస్తూ వెళ్ళాడు వాడు.

"ఆనంద్! లేనిపోని తగాదా మనకెందుకురా? వాడెళ్ళి వాడి గాంగ్‌ని తీసుకు వస్తాడేమో?" భయంగా అన్నాడు వాసు.

"మరి అంతభయపడేట్టుంటే నువ్వెళ్ళు. వాళ్ళసత్తా ఏమిటో నేనుచూసుకుంటాను" కోపంగా అన్నాడు ఆనంద్.

అనవసరమైన తగాదాలో ఇరుక్కున్నామేమోననుకుంటూ అక్కడే నిలబడిపోయాడు వాసు. ఇప్పుడు వాడు ఎంత మందిని తీసుకొస్తాడో? ఈరోజు తమకు హాస్పిటల్ యోగం ఉందనుకున్నాడు వాసు.

అప్పుడే లోపలినుండి వచ్చారు ముగ్గురు స్టూడెంట్స్.

"ఏమిటి ఆనంద్! ఏమైంది?" అడిగారు వారు.

జరిగింది చెప్పాడు ఆనంద్.

"అలాగా! సరే మేమూ రెడీయే" అన్నారు ముగ్గురూ. వాళ్ళూ ఆగిపోయారు.

మరో పది నిముషాలు గడిచాయి.

వెళ్ళినవాడు మరో ముగ్గుర్ని వెంట బెట్టుకుని రావడం కనిపించింది వారికి. వాసు గుండెలు గుభేలుమన్నాయి. ఈరోజు తామిద్దరికీ హాస్పిటల్లో పడక తప్పదు– మనసులోనే అనుకున్నాడు వాసు.

ఈ పక్క ఐదుగురూ, ఆ పక్క నలుగురు. అందరూ ఎందుకు అయినా సిద్ధపడే ఉన్నారు.

మరోక్షణం ఆగితే అక్కడ ఏం జరిగి ఉండేదో ఏమో?

అప్పుడే అక్కడ రిక్షా దిగాడు ఓ మధ్య వయస్కుడు. అతడెవరో అక్కడ ఉండే అందరికీ తెలుసు. ఆ పేటకి పెద్ద దాదా అతడు.

అప్పుడే రిక్షాదిగిన అతడు అక్కడి పరిస్థితి గమనించాడు.

"ఏమిట్రా ఏమయింది...?" వాళ్ళ ముగ్గుర్నీ ఉద్దేశించి అడిగాడు అతడు.

వాళ్ళలో మొదటివాడు జరిగింది చెప్పాడు.

"ఓస్...ఇంతేనా? రేయ్! స్టూడెంట్ కుర్రాళ్ళతోతగాదా పెట్టుకోవద్దని మీకెన్ని సార్లు చెప్పాన్రా! వాళ్ళూ మీలాగే ఆవేశ పరులు. సరే ఇప్పుడు మటుకు ఏమయింది కానీ వాళ్ళకు సారీ...చెప్పండి" అన్నాడు అతడు.

"అదికాదు గురూ!" మొదటివాడు ఏదో చెప్పబోయాడు.

"ముందు నేను చెప్పినట్టు చెయ్యరా" కళ్ళు ఎర్రచేసి అన్నాడు అతడు.

మొదటివాడు ఆనంద్ దగ్గరకు వచ్చి అన్నాడు–"సారీ గురూ! పొరపాటయి పోయింది" చేతులు పట్టుకున్నాడు అతడు.

"సరే! ఇంకెప్పుడయినా జాగ్రత్తగా ఉండు" అన్నాడు ఆనంద్. వాళ్ళు వెళ్ళి పోయారు.

దాదా ఆనంద్ దగ్గరగా వచ్చాడు.

"అదేమిటి బ్రదర్! ఒకవేళ వాళ్ళు తొందరపడ్డా, మీరు కూడా తొందర పడతారా! అందరం ఒకే సెంటర్‌లో ఉండే వాళ్ళం. ఈరోజు కొట్లాడుకున్నా రేపు ముఖాలు చూసుకోవలసినవాళ్ళం. మనలో మనం కొట్లాడుకుంటే ఎలా? ఈరోజు సమయానికి నేను రాకపోతే చాలా అనర్థం జరిగిపోయి ఉండేదేమో?" ఆనంద్ భుజం మీద చేయివేసి టీ స్టాల్ లో పలికి తీసుకెళుతూ అన్నాడు అతడు.

"అది కాదండీ! వాళ్ళే తొందరపడ్డారు" అన్నాడు ఆనంద్.

"నేనూ అదే చెబుతున్నాను బ్రదర్! మనలో ఒకరు తొందరపడ్డా మరొకరు సర్దుకోవాలి. మనలో మనం కొట్లాడు కుంటే ఎలా?"

అందరూ ఓ టేబుల్ ముందు కూర్చు న్నారు. దాదాను చూసి సప్లయర్ భయంగా వచ్చి అడిగాడు. ఏవేవో ఆర్డర్ ఇచ్చాడు దాదా.

"తీసుకోండి బ్రదర్!" అన్నాడు దాదా. తినక తప్పలేదు వారికి.

ఎప్పుడయినా, ఎక్కడయినా వాళ్ళ మీద ఎవరైనా రౌడీజం చేస్తే తన దగ్గరకు రమ్మని చెప్పాడు అతడు.

అందరూ ఇవతలకు వచ్చారు. ఆ పేట దాదా కాబట్టి అతడికి హోటల్‌లో ఫ్రీ.

ఆనంద్, వాసూ ఇద్దరూ రూమ్ వైపు నడవసాగారు.

"చూశావా వాసూ! ఈ లోకం తీరు ఎలా ఉందో! ఈరోజు వాడిని చూసి





భయపడి మౌనంగా ఉంటే, వాడు సారీ చెప్పడం కాదుకదా.... మరో రోజు మన మొహాన ఉమ్మువేస్తాడు. అందుకే అన్యాయం జరిగినపుడు ధైర్యంగా ఎదుర్కోవాలి. పిరికితనం పనికిరాదు" అన్నాడు ఆనంద్.

'నిజమే! తనలో పిరికితనం ఉంది. ఆ పిరికితనాన్ని పోగొట్టుకోవాలని తనూ అనుకుంటాడు. కానీ ఆ పిరికితనం తనను విడిచిపోదే!

తనలో పిరికితనమే కాదు, మంచితనం కూడావుంది. కానీ పిరికివాడు చేసే మంచి గుర్తింపుకు రాదు. ఆ మంచితనం పిరికితనంకింద కప్పబడిపోతుంది.

అందుకే తనూ ఒక్కోసారి అనుకుంటుంటాడు - ఆనంద్‌లా ధైర్యంగా ఉండాలి, నేర్పుగా వ్యవహరించాలి అనీ, అయితే ఆనంద్‌లోని దుర్గుణాలు అలవర్చుకోకూడదని. కానీ తను ఎంత ప్రయత్నించినా ఆ సమయానికి ధైర్యంగా నిలబడలేడు. పిరికివాడిలా భయపడుతాడు. నిజమే...పిరికివాణ్ని అందరూ మరింత భయపెడతారు.

* * *

వాసు, ఆనంద్ ఇద్దరూ ఆ గదిలో కూర్చుని ఉన్నారు.

"ఆనంద్...నా ప్రేమ ఎలా ముగుస్తుందో నాకు తెలియదు. పోనీ నీ ప్రేమ సంగతి ఏమిటో ఆలోచించావా? ఆ అమ్మాయిని ప్రేమించావుగా. .మరి పెళ్ళి కోసం ఎలాంటి ప్రయత్నాలు చేస్తున్నావు?" అడిగాడు వాసు.

"నాకు తెలుసులే వాసూ! ప్రేమకు క్లయిమాక్స్ పెళ్ళి. నా ప్రేమ హాస్య, శృంగారరస ప్రధానంగా సాగి చివరికి ఇప్పుడు క్లయిమాక్స్‌కి వచ్చింది. మరి ఈ క్లయిమాక్స్ ఏ రస ప్రధానంగా ముగుస్తుందో ఏమో?" అన్నాడు ఆనంద్.

"ఎలా ముగుస్తుందో ఏమోనని విధికి వదిలేసి చేతులు ముడుచుకు కూర్చుంటే ఎలా?ఇక పదిరోజులలో మనకు పరీక్షలు. ఆ తర్వాత ఎవరికివారు విడిపోతాము. నువ్వు ఆ గది ఖాళీచేయాల్సి ఉంటుంది. అందుకే ఆమె నిర్ణయం ఏమిటో వెంటనే తెలుసుకో" అన్నాడు వాసు.

"ఆహా! స్నేహితుడి మీద ఎంత అభిమానంరా! ఆ మాత్రం నిన్ను గురించి, నీ ప్రేమ గురించి నువ్వు ఆలోచించుకుంటే ఎంత బాగుండేది? సరేలే..ఇప్పుడు నన్ను గురించి కదా అడిగింది. ఈరోజే ఆమె నిర్ణయం అడుగుతాను" అన్నాడు ఆనంద్.

"సరే .... తొందరగా తేల్చుకో" అన్నాడు వాసు.

వెళ్ళిపోయాడు ఆనంద్. ఆ రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో తిరిగి వచ్చాడు.

"వాసూ! సిరజను పెళ్ళి గురించి అడిగాను. ముందుగా పెద్దల నిర్ణయం కోసం ప్రయత్నిద్దాము అన్నదామె. ఒకవేళ ఆమె తలిదండ్రులు ఒప్పుకోకపోతే స్వనిర్ణయం తీసుకుందామన్నది. అది మంచి మాటేనని నేనూ ఒప్పుకున్నాను. ఈ రాత్రికి ఆమె తమవాళ్ళతో మా పెళ్ళి గురించి, ప్రేమ గురించి చెబుతుంది" అన్నాడు ఆనంద్.

"ఒకవేళ ఆమె పెద్దవాళ్ళు ఒప్పుకోకపోతే?" అన్నాడు వాసు.

"అప్పుడు మేమే నిర్ణయం తీసుకుంటాము" చెప్పాడు ఆనంద్. ఆ తర్వాత కాసేపు ఉండి తన గదికి వెళ్ళిపోయాడు ఆనంద్.







ఆ మర్నాడు మళ్ళీ అదే టైముకు వాసు గదికి తిరిగి వచ్చాడు ఆనంద్. అతడి ముఖమంతా బాధతో నిండివుంది.

"ఏమయింది ఆనంద్?" అడిగాడు వాసు.

"నీరజ తండ్రి మా పెళ్ళికి ఒప్పుకోలేదట. ఎవరో కులంకానివాడిని పెళ్ళాడుతావా అని అరిచారట" బాధగా అన్నాడు ఆనంద్.

"మరి ఏం చెయ్యాలనుకున్నారు మీరు?" అడిగాడు వాసు.

"అందుకే మేమిద్దరం ఓ నిర్ణయం తీసుకున్నాము. మా డిగ్రీ పరీక్షలు అయిపోయిన తర్వాత ఇద్దరం కలిసి గుడిలో పెళ్ళి చేసుకుందా మనుకున్నాము" అన్నాడు ఆనంద్.

"ఆనంద్!" బాధగా అన్నాడు వాసు.

"నేను ఓ పనిచేస్తే అందులోని కష్టాన్ని, సుఖాన్ని రెండింటినీ మనస్ఫూర్తిగా స్వీకరిస్తాను. నీరజను నేను నా స్వార్థం కోసమే ప్రేమించాను. అయితే నా ప్రేమలో సిన్సియారిటీ లేకపోలేదు. ఒక మనిషిని ప్రేమించాలనుకొని ప్రేమించవచ్చా అంటే, ఎందుకు ప్రేమించకూడదు. నచ్చిన వ్యక్తిని ఆమెలో చూసుకుంటే అదే ప్రేమ. ఒక విధంగా అది ప్రేమ కూడా కాదు. కాబోయే భార్యను ఎంచుకోవడం. అంతే!

"ఆమెను నేను ఆకర్షించాను. ఆమె మనసులో నేను స్థానం సంపాదించుకున్నాను. ఇప్పుడు ఆమె నుండి నాకు దక్కేది కష్టమేనని, ఆమెను వదులుకుంటే అది మోసం అవుతుంది. అటువంటి మోసం నేను చెయ్యలేను. అందుకే మేమిద్దరం దొంగతనంగా పెళ్ళి చేసుకో

వాలని నిశ్చయించుకున్నాము" చెప్పాడు ఆనంద్.

వాసు ఉత్సాహంగా ఆనంద్ భుజం తట్టాడు. తను చేయలేని పని స్నేహితుడు చేయగలుగుతున్నందుకు, కొంతన్నా తృప్తి కలిగింది.



## 4

ఆఖరి పరీక్షకు ముందురోజు పేపరురాసి హాలులోనుండి ఇవతలకు వచ్చాడు వాసు.

అప్పటివరకూ అతనికోసమే కని పెట్టుకుని ఉన్న జ్యోతి అతని దగ్గరగా వచ్చింది.

"బాగా రాశారా?" అడిగింది జ్యోతి.

''బాగానే రాశాను! మరి మీరు ఎలా రాశారు?"

"నేనూ బాగానే రాశాను!" అని ఆగి, "అన్నట్టు...మీతో కొద్దిగా మాట్లాడాలి. అలా ఏదైనా హోటల్‌కి వెళ్దాం వస్తారా?" అన్నదామె.

అతడు ఆమె వంక ఓ క్షణం పరిశీలనగా చూసి అన్నాడు–"పదండి వెళ్దాం"

ఇద్దరూ 'దూరం'గా నడుస్తూ ఓ హోటల్‌కి చేరుకున్నారు.

ఫామిలీరూమ్‌లో కూర్చున్నారిద్దరూ.

బేరర్ రావడంతోనే జ్యోతిని అడిగాడు వాసు–

"ఏం తీసుకుంటారు?''

"మీ ఇష్టం" చెప్పిందామె.

''రెండు వెనీలా ఐస్‌క్రీమ్" చెప్పాడు వాసు. బేరర్ వెళ్ళిపోయాడు.

ఓ అందమైన యువతితో కలసి అలా హోటల్‌కు రావడం అతడికి థ్రిల్లింగ్‌గా ఉంది. అసలు ఓ స్త్రీతో కలసి ఇలా హోటల్‌కు రావడం అతడికిదే ప్రథమం. అందుకే అతడికి భయంగానూ ఉంది.

బేరర్ ఐస్‌క్రీమ్ తెచ్చిపెట్టాడు.

జ్యోతి తన అరచేయివైపు చూసుకుంటూ ఉంది. కాసేపు ఇద్దరిమధ్యా మౌనం. ఏదో చెప్పాలని ఆమె ప్రయత్నిస్తోంది. కానీ స్త్రీ సహజసిద్ధమైన బిడియంతో ఆమె నోటి నుండి మాట పెగలడంలేదు.

చెప్పాలనుకున్న విషయం ఎలా మొదలుపెట్టాలో తెలియక చాలాసేపు మౌనంగా ఉంది. చివరికి మౌనాన్ని భంగం చేసింది.

"మనకి ఇంకొక్క పరీక్ష మాత్రమే ఉంది. ఈ పరీక్ష అయిపోతే మనం విడిపోతాము కదూ!'' ఉపోద్ఘాతంలా అంది జ్యోతి.

"అవును...రేపటితో మనం అందరం ఎవరికివారే అయిపోతాము. ఆ తర్వాత నిరుద్యోగులుగా, ఉద్యోగులుగా, వ్యాపారవేత్తలుగా, రాజకీయవేత్తలుగా–రకరకాలుగా అవుతారు కదూ!"ఐస్‌క్రీం తింటూ అన్నాడు.

అతడి మాటలు పెద్దగా పట్టించుకోకుండా అంది ఆమె.

"అందుకే మనం విడిపోయే ముందు మన గురించి ఓ విషయం మీతో మాట్లాడదామని అనుకుంటున్నాను"

"ఏమిటా విషయం ... చెప్పండి జ్యోతిగారూ" ఆ విషయం లీలగా అర్థం అవుతుండగా అన్నాడు వాసు.





"జీవితంలో ఓ వ్యక్తికి ఎప్పుడు, ఎవరిమీద ప్రేమ కలుగుతుందో ఎవరూ చెప్పలేరు"

అతడు మౌనంగా ఉండిపోయాడు.

"నాకు తెలుసు...మీరు ఏ విషయాన్న యినా ఎదురుగా అడగలేరని. అందుకే నేనే చొరవతీసుకుని అడుగుతున్నాను. చెప్పండి ... నామీద మీకు ఎలాంటి అభిప్రాయం ఉంది?"

మగాడు చెప్పాల్సిన విషయం స్త్రీయే చెప్పాల్సిరావడం, చాలా బాధకలిగించే విషయం-ఆ స్త్రీకి.

''మీ మీద నా అభిప్రాయమా! మీ గురించి మన క్లాసులో ఎవరినడిగినా చెపుతారండీ—జ్యోతి తెలివైనది, మంచిది, అందమైనది అని. మరి నా అభిప్రాయంలో మార్పు ఎలా ఉంటుంది'' నవ్వుతూ అన్నాడు వాసు.

ఆమె నవ్వలేదు. మౌనంగా ఉండి పోయింది.

అతడికి అది ఏవిషయం గురించిన ప్రారంభమో అర్థం అవుతోంది. కానీ వెంటనే బయటపడదలచుకోలేదు. అందుకే అన్నాడు-

"మీ మీద నా అభిప్రాయం తెలుసు కునే అవసరం ఎందుకొచ్చిందో!"

కొద్దిసేపటి నుండి ఆ మాట ఎలా చెప్పాలో అని ఆలోచించుకుంటున్నటున్న జ్యోతి వెంటనే అనేసింది.

"అయితే నా ప్రేమను మీరు అంగీక రించగలరా!"

ఎప్పటినుండో మనసులోనే రిహార్సల్ వేసుకుంటున్నట్టు, వెంటనే ఆమె నోటి నుండి వచ్చేసింది ఆ మాట.

ఆశ్చర్యపడ్డాడు వాసు. ఆమె అంత సూటిగా అడుగుతుందని అతను అనుకో లేదు.

అతడికి ఆనందం కలిగింది. ఓ స్త్రీ చేత ప్రేమింపబడటం నిజంగా ఆనందం కలిగించే విషయమే మరి. ఆమె తనను ప్రేమిస్తూ వుందని అతడికి మొదటినుంచీ తెలుసు. కానీ ఆమె నోటినుండే 'నిన్ను నేను ప్రేమిస్తూ వున్నాను' అని చెప్పటం అతడి ఆనందానికి కారణం.

ఎంతగా ఆనందపడ్డాడో, వెంటనే అంతగా బాధ కలిగింది అతనికి. ఎందు కంటే తనను ప్రేమించే జ్యోతిని తను పెళ్ళి చేసుకోగలడా?

ఎందుకు పెళ్ళి చేసుకోలేడు? ఆమెకు ఏం తక్కువ??

జ్యోతి అందమైనది. మంచి మనసు కలది. చదువుకున్నది. అన్నింటికన్నా తనను ప్రేమిస్తూవుంది. ఇక అడ్డేముంది?

కానీ...

అతడి మనసులో ఏవో అస్పష్టమైన అనుమానాలు. తాము ఏకం అయితే ఏవేవో విపరీత పరిస్థితులను ఎదుర్కో వాలనే అనుమానం. మనసులో ఏదో తెలియని ఆందోళన. ఏదైనా జరగరానిది జరుగుతుందనే ఊహ.

అతడి మనసులో చెలరేగే సంక్షోభాన్ని గమనిస్తూ అందామె-

"చెప్పండి ... నన్ను పెళ్ళి చేసుకో గలరా?"

అతడు కొద్దిక్షణాలు మాట్లాడలేదు. కాసేపు తర్వాత ఆమే అంది -

"ఏం ... మన కులాలు వేరని భయ పడుతున్నారా?"

ఉలిక్కిపడ్డాడు వాసు. తన మనసు లోని అనుమానాన్ని ఆమె గ్రహించే సిందా? తల దించుకున్నాడు వాసు.

బేరర్ వచ్చి అడిగాడు వాసుని,

"ఇంకేం కావాలి సార్?"

"బిల్లు" చెప్పాడు వాసు. వెళ్ళిపోయాడు బేరర్.

"వాసుగారూ! మన కులాలు వేరని భయపడుతున్నారా మీరు? కులాంతర వివాహాలు ఈరోజుల్లో మామూలే. దాన్ని గురించి పెద్దగా భయపడాల్సిన అవసరం లేదు. చదువుకున్న వాళ్ళం, లోకాన్ని చదువుకున్నవారం. మనమే ఇలా కులాల గురించి ఆలోచిస్తే ఇక చదువురాని, లోకం తెలియని ప్రజలు ఎప్పటికి బాగుపడుతారు? ఆలోచించండి. అయినా ఆడదానిని నేను ధైర్యంగా ముందడుగు వేస్తుంటే, మగవారయి వుండి మీరింకా ఆ స్థితిలోనే వుండటం ఆశ్చర్యంగా వుంది. అంతేకాదు – బాధగా కూడా వుంది"

"నేను భయపడటం లేదు" దింకంగా అన్నాడు వాసు.

బేరర్ వచ్చి బిల్లు టేబిల్ మీద పెట్టి వెళ్ళాడు. క్లీనర్ వచ్చి కప్పులు తీసుకెళ్ళిపోయాడు.

"పోనీ మరొకటి చెప్పండి. నేనంటే మీకిష్టం లేదా?" అడిగింది జ్యోతి.

ఆమె అంటే తనకు ఇష్టం లేదా! ఆ మాట తన గుండెల్లోనుండి రాగలదా! ఆమెకు తను ప్రేమలేఖలు రాయక పోవచ్చు. ప్రేమ వూసులు చెప్పక పోవచ్చు. కానీ ఆమె తన ఊహల్లోకి వచ్చినప్పుడల్లా తన మనసు తియ్యని బాధతో స్పందించడం కాదనగలడా! కానీ ఆమెను తలచుకుంటే తనకు ప్రేమలేఖలు రాయాలని, ప్రేమవూసులు చెప్పాలనిపించడాన్ని తెలుసుకోలేనంత అమాయకుడా? ముందుముందు తను అనుకునే



వాడు– ఆమె మీద తనకుండేది మామూలు అభిమానం మాత్రమే అని. కానీ ఇప్పుడు ఆలోచిస్తే, మనసు పరిశీలించుకుంటే అనిపిస్తుంది ..ఆమె మీద తనకుండేది అభిమానం కాదని, అంతకు మించిన భావమని. అది ప్రేమరాగమే ఎందుకు కాకూడదు? అవును...నిజం. ఆమెను తను ప్రేమిస్తున్నాడు. కాని...అతడికి ఆమెను నొప్పించాలనిపించలేదు. అతడు నిజమే చెప్పాడు.

"మీరంటే నాకిష్టమే"

సంతోషంతో మెరిసిన ఆమె కన్నులను గుర్తించాడు వాసు. ఆమె పెదాలపై దరహాసరేఖ పసిగట్టాడు.

"అయితే మరి అడ్డు ఏమిటి?" అడిగిందామె.

అతడు చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు.

"నేనూ కొద్దిగా ఆలోచించుకోవాలిగా" వాదించలేక వాయిదా కోరుతున్న వకీలులా అన్నాడు వాసు.

'ఆమె ముఖంలో కొద్దిగా నిరాశ తాండవించింది. ఆ తర్వాత కొద్దిసేపు ఆగి అందామె–

"సరే...మీరు బాగా ఆలోచించుకోండి. మీ నిర్ణయం గురించి మన పరీక్షలు అయిపోయిన తర్వాతే చెప్పండి"

"అలాగే" అన్నాడు అతడు.

జ్యోతి లేచింది. వెనుకే వాసు లేచాడు. బిల్లు చెల్లించి ఇవతలకు వచ్చారు ఇద్దరూ.

జ్యోతి అతడివైపు చూస్తూ అంది–

"మీరు సరయిన నిర్ణయమే తీసుకుంటారని ఆశిస్తాను"

* * *

ఏదో ఆలోచనలలో ఉండి పరధ్యానంగా సమాధానం చెబుతున్న వాసుని

గమనించాడు ఆనంద్. అందుకే అడిగాడు-

"ఏమిటి వాసూ! దేని గురించో ఆలోచిస్తున్నట్టున్నావు"

తలెత్తి ఆనంద్ వైపు చూశాడు వాసు. తన పరిస్థితి తన మిత్రుడికి చెప్పి సలహా పొందాలని, అతడికి చాలా సేపటి నుండి అనిపిస్తోంది. కాసేపు ఆలోచించి అసలు సంగతి చెప్పాలనే నిశ్చయించుకున్నాడు.

"ఆనంద్! నాకో సమస్య వచ్చింది. దాని గురించే ఆలోచిస్తూ ఉన్నాను" అన్నాడు వాసు.

"ఏమిటా సమస్య?" అడిగాడు ఆనంద్.

వాసు కుర్చీలో వెనక్కు వాలి కూర్చున్నాడు. గొంతు సవరించుకుని చెప్పసాగాడు. అతడి మనసులోని అనుమానాలు ఒకొక్కటే బయటకు రాసాగాయి.

"ఒక అమ్మాయి, ఒక అబ్బాయిని ప్రేమించింది. ఎంతో గాఢంగా ప్రేమించింది. అతడికి కూడా ఆమె అంత గాఢంగా కాకపోయినా ఆమె మీద కొద్దిపాటి ప్రేమ వుంది. ఆమెను పెళ్ళి చేసుకునేందుకు కూడా అతడికి ఏ ఇతర అభ్యంతరంలేదు. కానీ ఒకేఒక పెద్ద అగాథం వారి మధ్య వుంది...అదే కులం. ఆమె కులం వేరు...అతడి కులం వేరు.

"ఈ సమాజం ఎంతో అభివృద్ధి చెందింది. కానీ ఈనాటికీ ఈ సమాజం కులాంతర వివాహాలను సమ్మతించేంతటి విశాల దృక్పథం అలవరచుకోలేదు. ఆమెను పెళ్ళిచేసుకుంటే అతడు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది. అందుకే అతడు ఏ నిర్ణయాన్నీ తీసుకోలేకపోతున్నాడు. ఆమెను పెళ్ళిచేసుకుని ఈ సమాజాన్ని ఎదిరించడమా! లేక ఈ అనవసరపు బరువు ఎందుకు అనుకోవడమా! ఏది అతడు తీసుక్కోవలసిన నిర్ణయం?" చెప్పి ఆగాడు వాసు.

"ఎవరిదో సమస్య అని డొంక తిరుగుడుగా ఎందుకు చెప్పటం? అది నీ ప్రేమకథే అని చెప్పుకోవచ్చుగా" హేళనగా అన్నాడు ఆనంద్.

"అవును .... నా ప్రేమ కథే"

"నువ్వు చెప్పేది కరక్టే వాసూ...ఈ సమాజం ప్రేమ వివాహాలను ప్రోత్సహించేంతగా ఎదగలేదు. దానికి నేనూ ఒప్పుకుంటాను. కానీ తనను వలచి వలపించుకునే ఓ స్త్రీని ఈ సమాజం కోసం వదులుకోవటం చాలా పిరికితనం! ప్రేమించడం గొప్ప కాదు...ప్రేమించబడటం గొప్ప. ఆ అదృష్టాన్ని కాలదన్నుకోకు. అందులో జ్యోతిలాంటి అందం, గుణం అన్నీ వున్న ఓ మంచి ప్రేమికురాలను కోల్పోకు వాసూ!"

"ఆమెను పెళ్ళి చేసుకోవాలని నాకూ వుంది. కానీ పెళ్ళయినతర్వాత రాబోయే ఇబ్బందులు..." ఆగాడు వాసు.

"వాసూ! భయపడి పరుగెడుతుంటే ఈ సమాజం వెనకబడి తరుముతుంది. ఎదురునిలిస్తే తోక ముడుచుకు పారిపోతుంది. ఇది అందరికీ తెలిసిన నిత్యసత్యం. అందుకు ఉదాహరణ ఆరోజు మనకు హోటల్‌లో జరిగిన సంఘటనే" చెప్పాడు ఆనంద్.

"సమాజమేకాదు ఆనంద్...బంధువులు కూడా వెలివేసినట్టు చూస్తారు"

"అవకాశవాదులే బంధువులు. వాళ్ళ కోసం మన ఆనందం ఎందుకు కాలదన్నుకోవాలి?"

"అంతేకాదు...రేపు పుట్టబోయే పిల్లల భవిష్యత్తేమిటి? వాళ్లు కులంలేని వాళ్ళ

లాగానే పెరగాలికదా!" ఆలోచనగా అన్నాడు వాసు. ఈ అనుమానాలన్నీ ఎప్పటినుండో వాసు మనసులో గూడు కట్టుకుని వున్నాయి. ఆ కారణాల వలనే జ్యోతిని మనసులో నుండి తుడిచి వేయాలని ప్రయత్నించేవాడు వాసు.

వాసు సందేహం విని, అతడినో అమాయకుడిని చూసినట్టు చూశాడు ఆనంద్.

"వాసూ! ఓ పాతిక ముప్పై సంవత్సరాల తర్వాత కూడా ఈ కులాలు, మతాలు వుంటాయనుకుంటున్నావా?లేదు. అప్పటికి ఈ కులాలు వుండవు. మతాలు వుండవు. మతాల పేరున మారణ హోమాలూ వుండవు.

"ఒకవేళ అప్పటికి ఈ కులాలు, మతాలు వున్నా ఇంతగా పట్టింపులు వుండవు. అప్పటి యువకులు 'మా నాన్నగారి తరంలో కులాలు చూసి పెళ్ళి చేసుకునేవారట' అని వారి పిల్లలకు చెప్పి నవ్వుకుంటారు. ఇది నిజం"

"అప్పటి పరిస్థితిని గురించి కూడా కాదులే ఆనంద్!ఇప్పుడు ఈ సమాజాన్ని, బంధువులను, ఇంట్లో పరిస్థితిని-వీటన్నింటిని ఎలా ఎదుర్కోవాలో అర్థం కావడం లేదు" అన్నాడు వాసు.

"ఎదుర్కోవాలి! పరిస్థితులను ఎదుర్కొని నిలబడటమే మగతనం" అన్నాడు ఆనంద్.

కోపంగా ఆనంద్ వైపు చూశాడు వాసు. అంటే తను మగాడిని కాదని పరిహసిస్తున్నాడా ఆనంద్.

వాసు కోపం గమనించాడు ఆనంద్.

"వాసూ! స్నేహితుడి మీద కోపపడటం కాదు ఇప్పుడు నువ్వు చెయ్యవలసింది. నీ భవిష్యత్తును గురించి సరయిన నిర్ణయం తీసుకోవాలి. నువ్వు నా స్నేహితుడివి. తప్పుదారిలో ఆలోచిస్తున్నావనే బాధతో నేను ఇలా అంటున్నాను. వాసూ..జ్యోతిని ఎట్టిపరిస్థితులలోనయినా నువ్వు పెళ్ళి చేసుకోవాల్సిందే!

"ఇటువంటి విషయాలలో పిరికితనం పనికిరాదు. కనీసం నన్ను చూసి అయినా నువ్వు తెలుసుకో. నీ ఆర్థిక పరిస్థితి, నా ఆర్థిక పరిస్థితి ఒకటే. నిన్ను ఓ కలవారింటి అమ్మాయి ప్రేమించింది. నన్ను ఎవరూ ప్రేమించకున్నా, ఓ కలవారింటి అమ్మాయి నన్ను ప్రేమించేటట్టు చేసుకున్నాను. ఇంకో నాలుగు రోజులలో ఆ అమ్మాయిని గుడిలో పెళ్ళి చేసుకోబోతున్నాను. మరి నువ్వు ఆ అమ్మాయే పెళ్ళి గురించి హెచ్చరించి తనేముందు అడుగువేసి సిద్ధపడివస్తే నీ పిరికితనంతో జీవితాల్నే దుఃఖమయం చేసుకుంటున్నావు. అదే నా బాధ" అన్నాడు ఆనంద్.

వాసు మౌనంగా విన్నాడు.

"వాసూ! ప్రేమంటే అదొక తియ్యని రంపపుకోత. అది గుండెల్లో ఎప్పుడూ మండే ఓ అగ్ని గుండం. జ్యోతి నిన్ను ప్రేమిస్తోంది. నీకూ ఆమెమీద ప్రేమ ఉంది కనుక ఆమెను పెళ్ళిచేసుకో. నువ్వు కాదంటే ఆమె భగ్న ప్రేమికురాలు అవుతుంది. జీవితాంతం ఆ తియ్యని రంపపుకోత అనుభవిస్తుంది. ఆ అగ్ని గుండాన్ని మనసులోనే దాచుకోవలసి వస్తుంది"

ఈమధ్య తను చదివిన నవలలోని వర్ణనలు కొన్ని జొప్పించి, మరీ వివరించి చెప్పాడు ఆనంద్.

"నువ్వు చెప్పేది కరక్టే బ్రదర్! కానీ నా మనసులోని భయాలు..."




"భయాలన్నీ పారదోలెయ్ వాసూ! నువ్వు ఊఅను చాలు. నీ పెళ్ళి, నా పెళ్ళి ఒకేసారి చేసేకుందాం. మన స్నేహితులందరి సమక్షంలో ఈ ప్రేమ వివాహాలు జరిగిపోతాయి. ఆ తర్వాత మన రెండు జంటలు ఒకే ఇంట్లో కాపురం పెట్టేసుకుందాం. ఈ పెద్దలు ఇప్పుడు కాదన్నా కొద్ది కాలానికైనా దిగిరాక మానరు. మనలను ఆదరించకా మానరు" అన్నాడు ఆనంద్.

"వాళ్ళు ఒకవేళ ఆదరించకపోతే? మనలను వదులుకుంటే??" అనుమానంగా అన్నాడు వాసు.

"పోనీ...అది వాళ్ళ కర్మ! నీ తల్లి నిన్ను వదిలి ఎక్కడికీ పోలేదు. పోతే నా తల్లి తండ్రులు నన్ను కాదన్నా నాకు బాధలేదు. ఇక మన మామలు వాళ్ళు కూడా అంతే. అయినా మన పెద్దలకు మనం ఎందుకు తలవంచాలి? మన భార్యను మనం పోషించుకోలేకపోతే కదా ఈ బాధంతా! మనం చదువుకున్నాం. ఉద్యోగం చేసి మన సంసారాన్ని మనం పోషించుకోగలం. ఇప్పుడు చెప్పు జ్యోతిని పెళ్ళి చేసుకుంటావా లేదా?"

వాసు కొద్దిగా తటపటాయించి అన్నాడు, "నేను కొద్దిగా ఆలోచించుకోవాలి"

ఆనంద్‌లో కోపం పెల్లుబికింది. వాసును ఓ పురుగును చూసినట్టు చూశాడు.

"ఇన్ని చెప్పినా ఇంకా ఆలోచించుకోవాలంటున్నావు. ఛీ...నీలాంటివాళ్ళకు ఎన్ని విధాలుగా చెప్పినా మీ భయాల్ని పోగొట్టుకోరు. నువ్వు మారవు. నువ్వో పిరికివాడివి"

అక్కడినుండి విసురుగా వెళ్ళిపోయాడు ఆనంద్.

అవును...పిరికివాడికి ఎందరు ఎన్ని విధాలుగా చెప్పినా ఆ పిరికితనం పోదు.

అలసిపోయినవాడిలా వెనక్కు వాలాడు వాసు.

* * *

పరీక్ష హాల్లోకి వెళ్తున్న వాసు పక్కగా వస్తూ అంది జ్యోతి.

"హలో...బాగా ప్రిపేరయ్యారా?"

"ఆ...ప్రిపేరయ్యాను" ఉలిక్కిపడి అన్నాడు "మరి మీరు?"

"ఫర్వాలేదు" నవ్వేసిందామె.

అందరూ ఎగ్జామ్స్ హాలులో ప్రవేశించారు.

వాసు పరీక్ష రాస్తున్నాడే కాని అతని మనసు మనసులో లేదు. తను జ్యోతికి చెప్పబోయే సమాధానం గురించే ఆలోచిస్తూ ఉన్నాడతను.

"ఏమని చెప్పాలి జ్యోతికి"

"నీ కులం వేరు నా...కులం వేరు, నిన్ను పెళ్ళి చేసుకుంటే నేను ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది. అందుకే నిన్ను పెళ్ళి చేసుకోలేను" అని చెప్పేస్తే.

మరీ భయస్తుడు చెప్పే మాటల్లా ఉన్నాయి అవి.

నో...అలా కాదు.

"జ్యోతీ! నాకిప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు. దయచేసి నామీద ఆశలు పెంచుకోకు. మరొక అందమైన యువకుడిని చూసి పెళ్ళిచేసుకో" అనేస్తే ఎలా ఉంటుంది?

"నీకోసం ఎంత కాలమైనా ఆగుతాను వాసూ" అని ఆమె అంటే? మరెలా చెప్పాలి??

"జ్యోతీ! నువ్వు నా ప్రాణం. నువ్వు



నా ఊపిరి. నిన్ను పెళ్ళి చేసుకోవాలనీ, ఈ లోకాన్నే ఎదిరించాలనీ ఉంది. కానీ నిన్ను పెళ్ళిచేసుకుంటే నా తల్లి ఆత్మహత్య చేసుకుంటుంది. నావాళ్ళు నన్ను వెలివేస్తారు! నన్ను క్షమించు జ్యోతీ..."

నో! ఇలా కూడా కాదు. ఇది మరీ డ్రమెటిక్‌గా ఉంది.

మరెలా చెప్పాలి?

ఆలోచిస్తూ మరోవైపు చూశాడు వాసు.

ఆనంద్ జేబులోనుండి కాగితాలు తీసి ఆన్సర్‌షీట్ కింద పెట్టి రాస్తూవున్నాడు.

ఇన్విజిలేటర్ అతడు చేసే పనినిచూసి కూడా, చూసీచూడనట్టు పోతున్నాడు.

వాసు మనసు ఒక్క నిమిషం



చివుక్కుమంది.

తను సంవత్సరమంతా కష్టపడి చదివాడు. కానీ ఆనంద్ సంవత్సరం పొడవునా సినిమాలకూ, షికార్లకూ, అడ్డమైన తిరుగుళ్లు తిరుగుతూ కాలక్షేపం చేసేశాడు.

ఇప్పుడు అతడు అవినీతి చేస్తూ తనతో సమానంగా పాసవుతున్నాడు.

కష్టపడ్డవాడికీ, కులాసా పురుషుడికీ సమానమైన ప్రతిఫలం.

అయినా నీతికీ నిజాయితీకి స్థానం ఎక్కడుంది?

అవినీతి ఇంత సులభమయితే అందరూ అవినీతివైపే ఆకర్షింపబడరా! అవినీతే చేయబోరా!

లాస్ట్ బెల్ అయింది.

పేపర్ ఇచ్చేసి ఇవతలకు వచ్చాడు వాసు. అతడి వెనుకే వచ్చాడు ఆనంద్.

"వాసూ.. నెత్తిమీదనుండి పెద్ద బరువు

తొలగిపోయినట్టుంటోయ్. ఇక మనం తిరిగి ఎప్పటికి కలుసుకుంటామో! మధ్యాహ్నం భోంచేసి నీ గదికి వస్తాను. ఇద్దరం సినిమాలకు షికార్లకు తిరుగుదాం.. ఏమంటావు"

నిన్న అన్నమాటలు మరచిపోయాడు ఆనంద్!

"నీవు రోజూ సినిమాలకు, షికార్లకు తిరిగేవేకానీ పరీక్షలు పెద్ద బరువు అని అనుకున్నావా! ఈరోజు బరువు దించుకున్నావని సంతోషించేదానికి"

నవ్వాడు ఆనంద్. "నేనెంత కష్టపడ్డానో నీకేం తెలుసోయ్"

అప్పుడే లోపలినుండి వస్తూవుంది జ్యోతి. వాసుతో ఆనంద్ మాట్లాడటం గమనించి, ఓ పక్కగా నిలబడింది ఎటో చూస్తూ.

ఆమెను గమనించాడు ఆనంద్. వాసు బుగ్గమీద చేత్తో సున్నితంగా కొట్టి అన్నాడు - "ఇప్పుడయినా సరయిన నిర్ణయం తీసుకో" తరువాత, "వస్తానూ" అంటూ వేగంగా వెళ్ళిపోయాడు ఆనంద్.

ఆమెను చూసి పారిపోవాలన్నంతగా భయంవేసింది వాసుకు.

"బాగా రాశారా?" అడిగింది జ్యోతి.

"బాగా రాశాను. మరి మీరెలా రాశారు?" అడిగాడు వాసు.

"బాగానే రాశాను"

"మీ హాల్‌టిక్కెట్ ఇలా ఇవ్వండి. రేపు మీ నంబర్ చూడాలంటే నాకు ఉపయోగపడుతుంది"

"అది అవసరమా!" ఆమెలో ఏదో అనుమానం ప్రవేశించింది.

"అవసరం అంటే ... ఇష్టముంటేనే ఇవ్వండి"

హాల్‌టిక్కెట్ అతడికి ఇచ్చింది. దానికి ఆమె ఫొటో ఉంది.

"మనం ఎక్కడికైనా వెళ్ళి కాసేపు మాట్లాడుకుందామా!"

తలూపాడు వాసు.

ఇద్దరూ హోటల్ వైపు కదిలారు.

ఓ ఫామిలీ గదిలో కూర్చున్నారు. బేరర్‌కి ఆర్డరిచ్చిపంపినతర్వాత అందామె.

"నేను మీకు చెప్పినదానిని గురించి ఏమి ఆలోచించారు"

ఆ మాటలు అంటున్నప్పుడు ఆమె గొంతు కొద్దిగా వణికింది. అతడు కొద్దిసేపు మౌనంగా ఉన్నాడు.

అతడి మౌనం చూసి ఆమెలో ఏదో అనుమానం.

ప్రాణప్రదంగా దాచుకున్న ఓ వస్తువు చెయ్యిజారి బురదగుంటలో పడిపోబోతున్నప్పుడు కలిగే బాధలాంటి అనుభూతి అది!

"చెప్పండి" అన్నదామె.

"నేను మీకు చెప్పేదానిని గురించి ఆలోచించాను. కానీ..."

"కానీ..." ఊపిరి బిగపట్టిందామె.

జడ్జిమెంట్ వినబోయేముందు నేరస్తుడికి కలిగే ఆతురతతో ఉందామె.

"అయామ్ సారీ" పూర్తిచేశాడు అతడు.

చెట్టుకింద కూర్చుని సేదతీరాలనే ఉద్దేశంతో అలసిసొలసి చెట్టుకిందికివస్తే చెట్టే విరిగి మీదపడినట్టు అయిందామెకు.

కొన్ని క్షణాలు ఆమెకు నోట మాట రాలేదు.

"ఈ నిర్ణయం బాగా ఆలోచించే తీసుకున్నారా?" అడిగిందామె.

"బాగా ఆలోచించాను" నోరు పెగుల్చుకుని అన్నాడు అతడు.

"ఏమండీ! మీరు ఏమీ అనుకోక





పోతే ఒక విషయం చెప్పండి. మీరు నన్ను ఎందుకు కాదంటున్నారో కారణం చెప్పండి?"

"కారణమా!" తడబడ్డాడు అతడు

"చెప్పలేరు. ఆ కారణం మీరు చెప్పలేరు. కానీ నాకు తెలుసు...మీరు ఏ కారణంతో నన్ను వద్దంటున్నారో. నా కులం, మీ కులం వేరనేకదా మీరు నన్ను కాదనేది. మనం పెళ్ళాడితే ఎన్నో సమస్యలను ఎదుర్కోవాలనే కదా మీరు భయపడేది. కానీ మీరొకటి తెలుసుకో పడంలేదు. ప్రేమనేది మన మనసులలో వుండే ఈ ఇబ్బందులు ఒక లెక్కలోనివి కావు. మన ప్రేమ ఫలిస్తే ఈ లోకాన్నంతా ఎదిరించగలం"

వాసు ఏమీ బదులు పలకలేదు. మౌనంగా వుండిపోయాడు.

"ప్రేమనేది మనిషిని ఎంతగా దిగజారుస్తుందో ఇప్పుడు అర్థం అవుతోంది నాకు. జీవితంలో ఇంతవరకూ నా తండ్రిని కూడా ఇది కావాలని గట్టిగా అడగలేదు నేను. ఆయన ఆఫీసరయినా, నేను కోరే కోరికలు వెంటనే తీర్చగల శక్తి వున్నా కూడా ఆయనను ఇంత వరకూ నేనేమీ కోరలేదు. చివరకి నా చదువు కూడా నా కష్టార్జితంతోనే చదువుకుంటున్నాను. నా మీద ఆయనకు అంత గొప్ప అభిప్రాయం వుంది కాబట్టి ఆయన మన ప్రేమకు అడ్డు కూడా చెప్పరు..."

"ఇంతటి ఆత్మాభిమానంతో బతికిన నేను తొలిసారిగా మిమ్మల్ని యాచిస్తున్నట్టుగా అడుగుతున్నాను. చెప్పండి. నన్ను... నన్ను అంగీకరించలేరా?"

ఆమె అంతగా చెప్పినా అతడిలోని పిరికితనం పోలేదు.

"నన్ను...నన్ను క్షమించండి జ్యోతి గారూ"

"ఈ నిర్ణయం మీరు బాగా ఆలోచించి తీసుకున్నారా? చెప్పండి. ఇంకా మిమ్మల్ని బతిమిలాడనులేండి" ఆమె స్వరంలో జీరను గమనించాడు.

"అవును జ్యోతిగారూ! ఇది నేను ఆలోచించి తీసుకున్న నిర్ణయం" అంత గట్టిగా ఎలా చెప్పాడో అతడికే ఆశ్చర్యంగా వుంది!

పక్కనే వున్న స్పీకర్‌లో నుండి మంద్రస్థాయిలో ఘంటసాల పాట వినిపిస్తోంది. "అగ్గివంటి వలపంటించి, హాయిగ వుండాలనుకోకు".

ఆమె గుండెల్లోనూ ఆ క్షణం అగ్ని మండుతోంది. మండే అగ్నిపర్వతంలా వుంది ఆమె గుండె.

"ఇక మీ నిర్ణయం మారదా?" బడబాగ్నిని మనసులోనే వుంచుకుని అడిగింది జ్యోతి.

బదులు పలకలేదు వాసు.

ఆమె అతడిని ఏమీ అనలేదు. నాలుగే నాలుగు మాటలు అన్నది జీవితాంతం మరచిపోలేని విధంగా.

"నా ప్రేమ కోసం నా వైపు పరిస్థితులన్నీ చక్కబెట్టుకుని వచ్చాను నేను. నువ్వు మగాడివై వుండి, ఓ ఆడది చేసినంత సాహసం చెయ్యలేకపోయావు. నువ్వు మగవాడివి కాదు. మగవాడికి వుండాల్సిన ధైర్యం, చొరవా నీలో లేవు. నువ్వో పిరికివాడివి. నపుంసకుడినైనా ప్రేమించవచ్చేమో కానీ పిరికివాడిని ప్రేమించకూడదు. ఇది నా జీవితంలో నీ ద్వారా నేను నేర్చుకున్న పాఠం"

విసురుగా వెళ్ళిపోయింది జ్యోతి.

నిస్సత్తువుగా వెనక్కు వాలాడు వాసు. విసురుగా వెళ్తున్న అమ్మాయిని

బాధగా, జాలిగా చూశాడు.

బిల్లు తీసుకుని ఇవతలకు వస్తూ అనుకున్నాడు వాసు–

'ఇన్ని మాటలు అనిపించుకుని ఇంకా ఎందుకు బతకాలి? ప్రియురాలిని పోగొట్టుకుని ఎలా జీవించాలి?'

* * *

అతడికి పిచ్చిపట్టినట్టుగావుంది.

నువ్వు పిరికివాడివి, పిరికివాడివి అని లోకమంతా అన్నట్టుగావుంది. తల పగిలి పోతున్నట్టుగావుంది.

"నువ్వు మగాడివి కావు. మగాడి కుండాల్సిన ధైర్యం, చొరవ నీలో లేవు. నీవు పిరికివాడివి''

అది జ్యోతి గొంతు.

"నువ్వు పిరికివాడివిరా వాసూ!"

అది ఆనంద్ గొంతు.

అలాగే పడుకుని కప్పుకేసి చూస్తు న్నాడు. కళ్లు మూసుకుంటేచాలు అందరూ తనని తనముందు నిలబడి పిరికివాడని హేళన చేస్తున్నట్టుంది.

ఒంటరిగావుంటే ఆలోచనలు ఎక్కు వవుతూంటాయి. ఆనంద్ కూడా ఇంకా రాలేదు.

కనీసం అతడితో కలసి సినిమాకి వెళ్ళినా కొంచెంసేపు మనశ్శాంతి దొరుకు తుందేమో?

అప్పుడే ఆ గదిలోకి అడుగుపెట్టాడు ఆనంద్. రాగానే అడిగాడు "వాసూ... ఏమయింది నీ విషయం?''

"ఏ విషయం?"

"ఇంకేవిషయంనీ...ప్రేమ విషయం"

"వీలు కాదన్నాను"

కొద్ది క్షణాలు ఆనంద్ కన్నులు బాధతో రెపరెపలాడాయి. తర్వాత కొద్ది సేపట్లోనే అతడు మామూలు వ్యక్తయి పోయాడు. ఇక ఆ విషయం గురించి మాట్లాడనవసరంలేదన్నట్టుగా అన్నాడు.

"ఓకే...లీవిట్! ఇది మన ఆఖరి పరీక్ష అయిపోయినరోజు. మన కాలేజీ జీవితం ముగిసిపోయినరోజు. అందుకే ఈరోజు జాలిగా గడిపివద్దాం పద!''

"అప్పుడే, ఈ ఎండలో ఎందుకులే- ఫస్ట్‌షో కెళ్దాం. రాత్రంతా నిద్రలేదు కదా! నిద్రొస్తోంది. కాసేపు పడుకునివెళ్దాం" అన్నాడు వాసు.

"సరే" ఒప్పుకున్నాడు ఆనంద్.

"అదిసరే...ఇంతకీ నీ పెళ్ళిఎప్పుడు?" అడిగాడు వాసు.

"గురువారం రాత్రికి మన స్నేహితుల సమక్షంలో గుళ్ళో పెళ్ళి చేసుకోదలచు కున్నామురా! అప్పటివరకూ నువ్వు ఇక్కడే వుండాలి. మా పెళ్ళికి నీవు తోడు వుండాలి" అన్నాడు ఆనంద్.

"అలాగేలే'' ఒప్పుకున్నాడు వాసు.

ఇద్దరూ కాసేపు నిద్రపోయారు. లేచి ముఖం కడుక్కునేటప్పటికి నాలుగున్నర అయింది. ఇద్దరూ గదినుండి బయటికి వచ్చారు.

ఇద్దరూ కాసేపు పార్కులో కూర్చు న్నారు...మాట్లాడుకుంటూ. ఆ తర్వాత సినిమాకెళ్ళారు.

సినిమా వదిలిన తర్వాత అన్నాడు ఆనంద్.

"వాసూ! ఈరోజు జాలీగా గడపా లనుకున్నాము మనం. అందుకే ఏదైనా బార్‌కెళ్ళి ఓ బీర్ తీసుకుని, అలాగే భోంచేసి సెకండ్‌షో సినిమాకి వెళ్ళి పోదాం''

మామూలు పరిస్థితులలో అయితే వాసు తాగేందుకు ఒప్పుకుని వుండేవాడు కాడేమో! కానీ మధ్యాహ్నంనుంచి తల





తిరుగుతున్నట్లుగా వుంది. జ్యోతిని మరచి పోలేకుండా వున్నాడు. ఆమె అన్న మాటలు కూడా మనసులో మెదలుతూ ఉన్నట్టున్నాయి. అవన్నీ మరచిపోవాలను కున్నాడు. అందుకే అంగీకరించాడు వాసు.

ఇద్దరూ బార్‌కువెళ్లి ఓ మూల టేబిల్ చూసుకుని కూర్చున్నాడు.

ఓ బీర్, ఒక క్వార్టర్ విస్కీ ఆర్డరిచ్చాడు ఆనంద్.

ఆర్డరిచ్చినవి తెచ్చి టేబిల్‌మీద పెట్టి వెళ్ళిపోయాడు బేరర్.

"వాసూ! జ్యోతిలాంటి ప్రియురాలిని పోగొట్టుకుంటున్నావు. ఇందుకు నాకు చాలా బాధగావుంది. ఇప్పటికయినా మించిపోయిందిలేదు. ఆమె దగ్గరకు వెళ్ళి, నీ అంగీకారాన్ని తెలియచెయ్యి" అన్నాడు ఆనంద్.

"ఆనంద్! ఇక ఆ విషయాన్ని గురించి మాట్లాడవద్దు. ఆమెను మరచి పోవాలనే ఇక్కడకు వచ్చాను. మరచి పోయే విషయాన్ని మళ్ళీ జ్ఞాపకం చేయకు"

ఆ ప్రస్తావన వాసుకు ఇష్టంలేదని గ్రహించాడు ఆనంద్.

డ్రింక్స్ పూర్తయిన తర్వాత రెండు బిరియాని, రెండు చిల్లీ చికెన్ తెప్పించాడు ఆనంద్. తర్వాత వైట్ రైస్ తెప్పించుకుని తిన్నారు.

భోజనం అయింది. ఇద్దరూ సినిమా హాలువేపు కదిలారు.

టిక్కెట్స్ తీసుకొచ్చాడు ఆనంద్.

"వాసూ...న్యూస్‌రీల్ వేస్తున్నారు వెళ్దాంరా!"

హాలువేపు నడవబోతూ మామూలుగా చూశాడు గేటువేపు. వాసు కన్నులు అదో విధమైన కాంతితో మెరిశాయి. అతడికి ఆనందం కలిగింది.

చేయి పట్టుకుని హాలువేపు నడవ బోతున్న ఆనంద్, వాసు ఆగడంతో తనూ ఆగి అతడివేపు చూశాడు. అతడి చూపులు ఎక్కడో గేటుదగ్గర ఉన్నాయి. తనూ ఆవేపు చూశాడు.

అటుచూసి ఓ క్షణం ఉలిక్కిపడ్డాడు. కారణం ఆమెను చూసికాదు..ఆమెను వాసు అంత ప్రత్యేకంగా ఎందుకు చూస్తున్నాడా అని.

"ఇప్పుడే వస్తాను" ఆనంద్ చేయి విడి పించుకుని ముందుకు కదలబోయాడువాసు.

అతడి చేయి పట్టుకుని ఆపి అడిగాడు ఆనంద్ "ఎక్కడికి?"

"ఆనంద్ ... నీకోసారి చెప్పాను గుర్తుందా! తుఫాన్ వచ్చినరోజు నా గది లోకి ఓ అమ్మాయి వచ్చిందని. ఆమెను అనుభవించలేదని చాతకానివాడివి అని నువ్వు అన్నావు. అదుగో గేటుదగ్గర నిలబడివున్న అమ్మాయే ... లక్ష్మి" ఉత్సాహంగా అన్నాడు వాసు ఆవేపు చేయి చూపిస్తూ.

అక్కడ రిక్షావాడితో మాట్లాడుతూ ఉంది లక్ష్మి.

ఆనంద్ ముఖంలో చిత్రమైన భావం కదలాడింది. చివరికి తెప్పరిల్లి అన్నాడు–

"సరేలే! సినిమా బిగిన్ కాబోతోంది వెళ్దాంరా"

"ఆమెను పలకరించి వస్తాను" ముందుకు కదలబోయాడు వాసు.

అతడిచేయి పట్టుకుని ఆపి అన్నాడు ఆనంద్–

"ఆమె మీ కులమే ! పెళ్ళి చేసు కుంటావా ఏం?"

అతడి గొంతులోని వ్యంగ్యం గుర్తించ

లేదు వాసు.

"మా కులమేనా! నీకెలా తెలుసు" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"ఎలా తెలుసన్నది తర్వాత చెబుతాను దాన్నేమీ పలకరించనవసరం లేదు. ముందు సినిమాకెళ్దాంరా!" చేయి పట్టుకున్నాడు ఆనంద్.

ఆ స్త్రీని 'దాన్ని' అని హీనంగా సంబోధించినందుకు బాధవేసింది వాసుకు.

"ఏం పలకరిస్తే?" అడిగాడు వాసు.

"అక్కడివాళ్ళంతా నిన్ను అదో విధంగా చూస్తారు"

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"ఓ వ్యభిచారిణితో మాట్లాడేవాడిని అంతా తేడాగా చూడరా!"

వాసు విసుగ్గా తలెత్తి చూశాడు ఆనంద్‌వంక. అతడి ముఖం మామూలుగానే వుంది.

"ఒకరోజు నీవు మంచి అవకాశం పోగొట్టుకున్నావని బాధపడ్డాను ఆ రోజు. కానీ ఈరోజు ఓ అపాయంనుండి బయటపడ్డావని సంతోషిస్తున్నాను. ఆ రోజు ఆమెను నువ్వు అనుభవించి ఉంటే నువ్వూ హాస్పిటల్‌కు వెళ్ళాల్సివుండేది. సిఫిలిస్‌కు ట్రీట్‌మెంట్‌కోసం"

కొద్దిసేపటినుండి తగ్గినట్టున్న బాధ మరింత ఎక్కువయింది. కనులుతిప్పి గేటువేపు చూశాడు వాసు. ఆమె ఇంకా ఆ రిషావాడితో మాట్లాడుతూనే వుంది.

"ఆమె అలాంటిదని నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా ఆనంద్‌వంక చూస్తూ అడిగాడు వాసు.

"నీకోసారి చెప్పాను గుర్తుందా! ఓ సాహసం చేసి డాక్టర్ దగ్గరకు వెళ్ళానని. ఆ సాహసం ఆమెను అనుభవించడమే"

తల పగిలినట్టనిపించింది వాసుకు.

"దాన్ని గురించి ఆలోచించకు. సినిమా బిగిన్ అయింది వెళ్దాంరా" చేయి పట్టుకున్నాడు ఆనంద్.

గేటువైపు చూశాడు వాసు. అప్పుడే రిషా ఎక్కి వెళ్తోంది లక్ష్మి. బహుశా 'బేరం' కుదిరింది కాబోలు.

"సారీ బ్రదర్! నేను పిక్చర్‌కి రాలేను" అన్నాడు వాసు.

"డోంట్ బీ సిల్లీ! ఎవరో రోడ్డున పోయే దానికోసం నువ్వు తల బద్దలు కొట్టుకోవడం ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు ఆనంద్.

సినిమా ఇంటర్వెల్ వరకూ చూసిన తర్వాత అడిగాడు వాసు–

"ఇక నేను సినిమా చూడలేను... వెళ్దాంరా!"

బదులు పలకకుండా లేచి వచ్చేశాడు ఆనంద్.

ఆ తర్వాత నాలుగు రోజులకు ఆనంద్, నీరజల పెళ్ళి గుడిలో జరిగిపోయింది. పెళ్ళికి తనూ దగ్గర ఉన్నాడు. చేతనయిన వరకూ అన్నివిధాల సహాయంచేశాడు.

స్నేహితులు తప్ప, ఆ పెళ్ళికి ఇరువర్గాల పెద్దవాళ్ళెవరూ రాలేదు.

పెళ్ళయిన తర్వాత టౌన్‌లోనే ఓ ఇల్లు తీసుకుని కాపురం పెట్టాడు ఆనంద్. అదంతా చూసి తను ఊరు వెళ్ళిపోయాడు వాసు.

ఆనంద్ ఉద్యోగ ప్రయత్నాలు చేయసాగాడు.

పెళ్ళయిన నెల తర్వాత వారి తల్లిదండ్రులు మెట్టు దిగి వచ్చారు.

నీరజ తండ్రి ఆనంద్‌కి ఉద్యోగం చూశాడు. ఢిల్లీలో ఉద్యోగం. భార్యా




సమేతంగా ఉద్యోగస్తుడై వెళ్ళిపోయాడు ఆనంద్.

రిజల్ట్స్ వచ్చిన తర్వాత నాలుగు నెలలకు వాసు కూడా ఉద్యోగస్తుడయ్యాడు.

ఆ తర్వాత రెండు నెలలకు వాసు పెళ్ళయింది.



## 5

'గతం'లో నుండి వాస్తవంలోకి వచ్చాడు వాసు.

ఆకాశాన నక్షత్రాలు మిణుగురు పురుగుల్లా మెరుస్తున్నాయి. నక్షత్రాల కన్నా తామెంతో అందంగా ఉన్నానని కాబోలు ఛాతీ విరుచుకుని షికారుగా బయలుదేరాడు చంద్రుడు.

జ్యోతికి తనేం అన్యాయం చేశాడని, ఈనాడు తనమీద పగపట్టినట్టు వ్యవహరిస్తోంది?

ఆమెను పెళ్ళి చేసుకుంటానని గర్భవతిని చేసి వదిలి వేయలేదే!

ఏ మాయమాటలూ చెప్పి ఆమె మానాన్ని దోచుకోలేదే!

మరి ఆమెకు ఎందుకింత కోపం?

ఆమెను పెళ్ళి చేసుకోవడం, చేసుకోక పోవడం తన ఇష్టం. పెళ్ళి చేసుకోలేదని పగపట్టినట్టు వ్యవహరిస్తుందా!

బోడి ఆఫీసరయితే మాత్రం తను భయపడాలా తను? ఆమె కింది ఉద్యోగస్తుడయితే మాత్రం ఆమె తనను భయపెడుతుందా?

నో...ఇక నేను ఆమెకు భయపడకూడదు – మనసులోనే అనుకున్నాడు వాసు.

టైము చూసుకున్నాడు. పదిగంటలయింది.

మైగాడ్! ఇంతసేపటి నుండి తను ఆలోచనలలోనే ఉన్నాడా! అవును గతాన్ని తలచుకుంటే కాలం అలాగే గడిచిపోయింది.

ఇక ఆ రాత్రికి భోజనం చేయాలనిపించలేదు. అలాగే పడకమీద వాలిపోయాడు.

కాని ఆ రాత్రి జ్యోతిని గురించిన ఆలోచనలు అతడిని ఓ పట్టాన నిద్ర పోనివ్వలేదు.

ఎప్పటికో నిద్రపోయాడు.

* * *

అప్పుడే ఆఫీసులోకి అడుగుపెట్టిన వాసు చెవినబడ్డాయి ఆ మాటలు.

"ఆయన దగరయ్యా ఆ ఫైలు ఉండేది! ఆయనేమో లంచాలు తీసుకోరు. ఇక నేనేం చేసేది" చెబుతున్నాడు శంకరం. అది తన గురించేనని వాసుకు అర్థమయింది.

అతను లోపలికి అడుగుపెట్టేప్పటికి వాళ్లు వెళ్ళిపోయారు.

లోనికి నడిచి తన సీట్లో కూర్చున్నాడు వాసు. కొద్దిసేపటి తర్వాత అతడి దగ్గరకు వచ్చాడు ఆఫీస్ ప్యూన్.

"మేడమ్ మిమ్మల్ని రమ్మంటున్నారు సార్!"

"వస్తున్నా పదా!"

ఆ వెంటనే శంకరం అతడి దగ్గరికి

వచ్చాడు.

"గురూ! మన మేడమ్ మమ్మల్ని ఎవరినీ ఎక్కువగా పిలవదే...నిన్నే ఎందుకు పిలుస్తుంది" అనుమానంగా అడిగాడు శంకరం.

"ఏమో నాకేం తెలుసు" విసుగ్గా అన్నాడు వాసు.

"గురూ! ఒకవేళ మన మేడమ్ 'మన ఆఫీసులో సిన్సియర్ వర్కర్ ఎవరు? తెలివైనవాడు ఎవరు?' అని అడిగితే నా పేరే చెప్పు గురూ" గడ్డం పట్టుకుని అన్నాడు శంకరం.

"అలాగేలే" చేయి విదిలించి ముందుకు కదిలాడు వాసు.

"కూర్చోండి" లోనికి వచ్చిన వాసుని చూసి అంది జ్యోతి.

"ఫర్వాలేదులెండి. ఎందుకో పిలిచారట?" అన్నాడు వాసు.

"ముందు కూర్చోండి" చెప్పిందామె. మౌనంగా కూర్చున్నాడు వాసు.

"మీకో విషయం చెబుదామని పిలిచాను" పేపర్ వెయిట్ తిప్పుతూ అందామె.

"ఏమిటి?" అడిగాడు వాసు.

"మీరు త్వరలో ట్రాన్స్‌ఫర్ కావచ్చు. వీలయినంత దూరానికి ట్రాన్స్‌ఫరయి పోతారు"

తలెత్తి ఆమెవైపు చూశాడు వాసు.

"అంతటితో నామీద మీకున్న కోపం పోతుందా? ఇంకా ఏదైనా మిగిలి ఉంటుందా?" తను అంత గట్టిగా మాట్లాడ గలనని అతడు అనుకోలేదు వాసు.

"మీమీద నాకు కోపమా! భలేవారే... ఆరోజు మిమ్మల్ని పెళ్ళిచేసుకుని వుంటే మీ భార్యగా వంటగదిలో పడివుండును! అంతే తప్ప ఇలా ఆఫీసర్‌గా ఇంతటి స్థితికి రాగలనా! నన్నీ స్థితికి తెచ్చిన మిమ్మల్ని ఎలా మరచిపోగలను. అందుకే కృతజ్ఞతగా ఈ చిరుకానుక" అందిజ్యోతి చిరునవ్వుతో.

"థాంక్స్" లేచాడు వాసు.

"ట్రాన్స్‌ఫర్ అప్పుడే రాదులేండి! బహుశా రెండు నెలలు పట్టొచ్చు. ఈ రెండు నెలలలోగా మెమోలు,సస్పెండ్‌లు లాంటివి బహుమతులుగా ఇస్తుంటాను లేండి"

అక్కడినుండి ఎప్పుడు బయట పడదామా అని మౌనంగా నిలబడి ఉన్నాడు వాసు.

"ఓకే...యుకెన్‌గో" చెప్పిందిజ్యోతి.

ఇవతలకు వచ్చేశాడు వాసు.

వాసును చూడగానే కుర్చీలోనుండి లేచివచ్చాడు శంకరం.

"గురూ...ఇంతకీ మేడమ్ ఎందుకు పిలిచింది?" ఆరాగా అడిగాడు శంకరం.

వీడికి తగిన బుద్ధి చెప్పాలి – మనసులోనే అనుకున్నాడు వాసు.

"ఆమెగారికి ఓ పనిమనిషి కావాలట వెతికిపెట్టమంది. నీవల్ల వీలవుతుందా? వీలయితే ఆమె దగ్గరకెళ్ళి చెప్పు" అన్నాడు వాసు.

"ఓ! మేడమ్‌గారికి పనిమనిషిని వెతికిపెట్టడమా! ఆహా ... అంత అదృష్టమా! అయితే ఆ కార్యభారాన్ని నేను స్వీకరిస్తాను" ఆనందంగా అన్నాడు శంకరం.

"అయితే ఆ విషయం లోపలికెళ్ళి ఆమెకు చెప్పు" కసిగా అన్నాడు వాసు.

అద్దంలో చూసుకుని తల దువ్వుకుని, కాలర్ సర్దుకుని లోపలికి అడుగుపెట్టాడు శంకరం.

"ఎక్స్‌క్యూజ్‌మీ మేడమ్" లోనికి





అడుగుపెట్టి అన్నాడు శంకరం.

"ఏం కావాలి?" తలెత్తి అతడిని చూసి అడిగింది జ్యోతి.

"మేడమ్...మీరు వాసుగారికి మీకో పనిమనిషి కావాలని చెప్పారట. కానీ ఆయనకు ఎవరూ తెలియదట. అందుకే నాకు చెప్పారు. దయచేసి మీకు ఎలాంటి పనిమనిషికావాలోఐమీన్..ఎంత జీతంలో, ఎంత వయస్సులో, ఎంతసేపు పని చేసేందుకో•లాంటి వివరాలు చెబితే అలాంటి పనిమనిషిని చూడగలను" వినా సంగా నిలబడి అన్నాడు శంకరం.

ఆమెకు కొద్దిసేపటివరకూ ఏమీ అర్థంకాలేదు.

"నేను....నేను వాసుగారితో ఓ పని మనిషిని చూడమని చెప్పానా?" ఆశ్చర్యంగా అడిగింది జ్యోతి.

"అవునండి! ఇప్పుడేకదా మీరు వాసుగారిని లోనికి పిలిచి చెప్పింది" గుర్తుచేస్తున్నట్లుగా అన్నాడు శంకరం.

ఆమెకు వెంటనే వాసు చేసిన మోసం అర్థం అయింది.

అతడితో తనకు పనిమనిషి అవసరం లేదని చెప్పాలనిపించింది. కానీ అలా చెబితే అది తనకు పరువు తక్కువ అవు తుంది. అది వాసు వేసిన ప్రాక్టికల్ జోక్ అని అతడికి చెపితే అతడి దృష్టిలో తను చులకన అవుతుంది. ఓ క్లర్క్ తన ఆఫీసర్ మీద ప్రాక్టికల్ జోక్ వేశా డంటే ఆ ఆఫీసర్ అంటే అతడికి ఎంత అలుసో అందరికీ తెలిసిపోతుంది. వాసు మీద పీకలదాకా కోపం వచ్చింది జ్యోతికి. తను అన్నమాటలకు బదులు అప్ప చెప్పాడు వాసు.

ముఖంమీద నవ్వు పులుముకుంది జ్యోతి.

"ఆ...కరక్ట్! గుర్తుకొచ్చింది. మాకో పనిమనిషి కావాలి. ఎలాంటిదో ఒక లాంటిది చూడండి" అన్నది జ్యోతి- అంతగా అతడు లేసుకొస్తే వద్దు అని చెప్పొచ్చు అనుకుంటూ.

"అలాగే మేడమ్! రేపు ఉదయాని కంతా మీకు పనిమనిషి రెడీచేసి పెడతాను"

"అలాగే" నవ్వి అందామె. ఆ నవ్వు చూసి ఊహాలోకంలో తేలిపోతూ అక్కడే నిలబడ్డాడు శంకరం.

"ఇక మీరు వెళ్ళొచ్చు" చెప్పింది జ్యోతి.

"యస్ మేడమ్" ఇవతలకు వచ్చాడు శంకరం. ఇవతలకు వచ్చి నేరుగా వాసు దగ్గరకు వచ్చాడు శంకరం.

"థాంక్స్ గురూ! ఇంత మంచి అవ కాశాన్ని నాకు కలిగించి మా ప్రేమకు పునాదిరాళ్లు వేయించిన నిన్ను ఏ పూలతో పూజించినా ఈ ఋణం తీరదు" చేతులు పట్టుకుని ఊపేస్తూ అన్నాడు శంకరం.

"ఏమంటుంది?" అనుమానంగా అడిగాడు వాసు.

"రేపు ఉదయానికల్లా ఆమెకు పని మనిషిని చూసిపెడతానని చెప్పివచ్చాను"

"ఆమె పనిమనిషి కావాలన్నదా?" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"కావాలని చెప్పడమేమిటి గురూ! ఎలాంటి పనిమనిషినయినాసరే వెంటనే చూడమన్నది" చెప్పాడు శంకరం.

ఆమెకు ఎలాగూ పనిమనిషి కావాలి కాబోలు-మనసులోనే అనుకున్నాడు వాసు.

"గురూ...జ్యోతి నవ్వింది. ఆహా! ఏమి ఆ నవ్వు. ముత్యాలు కింద రాలా యేమో ఏరుకుందామని కిందచూశాను




గురూ! ఎంత అందంగా నవ్వింది"

మింగలేక కక్కలేక మౌనంగా ఉన్నాడు వాసు.

"మొత్తానికి ఆమె దృష్టిలో పడవేసి నందుకు మీకు థాంక్స్ గురూ! నా అదృష్టం బాగుంది నేను కన్న కలలు నిజమై జ్యోతి నన్ను ప్రేమించి మా పెళ్ళి జరిగితే నీకు ఎంత గొప్ప బహుమానం..."

మాట్లాడుతూ తిరిగి చూసేటప్పటికి వాసు అక్కడలేదు.

* * *

ఆ రోజు ఆఫీసుకెళ్ళబోయే ముందుగా వచ్చాడు ముకుందరావు. అతని పక్కనే అయిదేళ్ళ స్వప్న.

తండ్రిని చూడగానే పరిగెత్తుకుంటూ వచ్చి మెడ చుట్టేసింది స్వప్న. కూతుర్ని గుండెలకు హత్తుకున్నాడు వాసు. బుగ్గలు రెండూ ముద్దులతో నింపేశాడు.

"అక్కా, పిల్లలు బాగున్నారా బావా?" అడిగాడు వాసు.

"ఆ...బాగున్నారు" కుర్చీలో కూలబడ్డాడు ముకుందరావు.

స్వప్నను లోపలికి తీసుకెళ్ళి, ఓ బిస్కెట్ పాకెట్ తీసి ఇచ్చాడు వాసు.

"ఏం ... బాగున్నావా?" కూతుర్ని అడిగాడు.

"బాగున్నాను డాడీ!" ముద్దుముద్దుగా చెప్పింది స్వప్న.

ఇవతలి గదిలోకి వచ్చి ముకుందరావు ఎదురుగా కూర్చున్నాడు వాసు.

"స్వప్నను తీసుకురమ్మన్నావుగా! అందుకే తీసుకొచ్చాను" అన్నాడు.

"మంచిపని చేశారు. లేకుంటే నేనే రావలసి వుండేది రేపో మాపో. ఇన్ని రోజులనుండి రావాలంటే తీరిక దొరకలేదు. స్కూల్ ఓపెన్ చేస్తున్నారు. ఎలాగో సమయానికి తీసుకువచ్చారు"

"స్వప్నను ఇక్కడే స్కూల్‌లో చేర్పిస్తానని రాశావు. ఇక్కడ చేర్పిస్తే ఆ చిన్నపిల్లను ఎవరు చూస్తారు? నువ్వేమో ఉదయం ఆఫీసుకు వెళితే సాయంత్రానికి తిరిగి వస్తావు. మరి దాని విషయమెలా?" అన్నాడు ముకుందరావు.

"స్వప్నను చూసుకునేందుకు, మా ఇద్దరికీ వండిపెట్టేందుకు ఒక పనిమనిషిని కుదుర్చుకుంటాను. ఎలాగో కొద్దికాలం తంటాలు పడాలిగా. స్వప్నను ఆ పల్లెటూర్లోనే ఉంచేస్తే చదువు ఎలా వస్తుంది?"

"అదీ నిజమే" అన్నాడు ముకుందరావు. మనసులో మాత్రం స్వప్నను వదిలేస్తే, వాసు ఇక డబ్బులు పంపించడేమోనని బాధ.

"మన ఊళ్ళోనే ఓ ముసల్ది వుంటే చూడు బావా! మా ఇద్దరికీ వండిపెట్టి తనూ తిని ఇక్కడే పడివుంటుంది"

"అయినా పనిమనిషిచేత వండించుకు తినాల్సిన కర్మ నీకేం పట్టింది. ఇరవై ఏడేళ్ళు కూడా లేవు నీకు, పెళ్ళి చేసుకునేందుకు ఏమొచ్చింది నీకు. ఈ కాలంలో కుర్రాళ్లు ముప్పైఏళ్ళ వరకూ పెళ్ళి చేసుకోవడం లేదు. ఏదో చిన్న వయసులో పెళ్ళయి బిడ్డ తండ్రివి అయ్యావు. కానీ ఇంకా పెళ్ళిగాని కుర్రాడిలాగానే ఉన్నావు నువ్వు. అందుకే హాయిగా పెళ్ళి చేసుకో. ఆ వచ్చే ఆవిడే స్వప్నను కూడా చూసుకుంటుంది"

అతడెప్పుడూ వాసుని పెళ్ళిచేసుకోమని అనలేదు. స్వప్నను దగ్గర పెట్టుకుని అతని సంపాదనలో కొంత భాగం గుంజుకునే ఉద్దేశంతో, పెళ్ళయితే

తమకు ఆ ఆదాయం దక్కదేమోనన్న భయంతో ఇప్పటివరకూ పెళ్ళి ప్రసక్తి తీసుకురాలేదు. ఇప్పుడు స్వప్న ఎలాగూ విడిపోవడంతో కనీసం బాగుకోరే వాళ్ళు లాగా ఉండటం వల్లనైనా లాభం ఉంటుం దేమోనని ప్లేట్ మార్చాడు ముకుందరావు.

అతడి మాటలకు బదులుగా నవ్వి ఊరుకున్నాడు వాసు.

"నీకు పెళ్ళిచేసుకునే ఉద్దేశంవుంటే చెప్పు. ఎక్కడైనా ఓ మంచి అమ్మాయిని చూస్తాను" అన్నాడు ముకుందరావు.

"ఇప్పుడు నాకు పెళ్ళిచేసుకునే ఉద్దేశం లేదు బావా! ఒకవేళ భవిష్యత్తులో ఆ ఉద్దేశమే కలిగితే తప్పక మీకు చెబుతాను"

"భవిష్యత్తులో...అంటే మరో పదేళ్ళు పోయిన తర్వాత ఎవరు పిల్లను ఇస్తారు నీకు?"

జవాబుగా నవ్వి ఊరుకున్నాడు వాసు.

"అవును డాడీ! పెళ్ళిచేసుకో" ముద్దుగా అంది స్వప్న.

"ఛీ...నోర్మూయ్" నవ్వుతూ కసురు కున్నాడు వాసు.

ఆ రోజుకు ఆఫీసుకు శలవు పెట్టాడు వాసు.

ఆరోజు మధ్యాహ్నం భోంచేస్తు న్నప్పుడు వాసు స్వప్నను అడిగాడు–

"నువ్వు ఇక్కడుంటావా లేక అత్తమ్మ దగ్గర ఉంటావా?"

"ఇక్కడే ఉంటాను నాన్నా"

"ఇక్కడే ఉంటే బుద్ధిగా చదువు కోవాలి"

"ఓ ... అలాగే చదువుకుంటాను! అత్తమ్మ దగ్గరకు మాత్రం పోను"

"ఏం?" అడిగాడు వాసు.

"అత్తమ్మ ఊరికే కొడుతుంది. తిడు తుంది" చెప్పింది స్వప్న.

ముకుందరావు ఉలిక్కిపడటం గమ నించాడు వాసు. అతడివంక చూసి నవ్వలేక నవ్వాడు ముకుందరావు.

ఆ రోజు మధ్యాహ్నం కాసేపు పడుకుని మాట్నీ సినిమాకు తీసుకు వెళ్లాడు.

ఆరోజంతా ఉండి మర్నాడు ఉద యమే ప్రయాణమయి వెళ్ళిపోయాడు ముకుందరావు.

ఆరోజు కూడా శెలవు పెట్టాడు వాసు. స్వప్నను తీసుకుని వెళ్ళి స్కూల్‌లో జాయిన్‌చేశాడు.

సాయంత్రం కూతురిని తీసుకొని బజారుకెళ్లాడు. ఓ బట్టల కొట్లోకెళ్ళి స్వప్నకు బట్టలు తీసుకుంటున్నాడు వాసు.

అప్పుడే రిక్షా దిగి షాపు లోపలికి వస్తూ కనిపించింది జ్యోతి.

జ్యోతి కూడా అతనివైపు చూసింది.

"డాడీ! ఈ గౌన్ బాగుంది. ఇది తీసుకుంటాను" అంటోంది ఆ పాప.

'ఓహో..కూతురు కాబోలు. ఈయనకు ఐదేళ్ళ కూతురు కూడా ఉందా! అంటే కాలేజి పూర్తయిన వెంటనే పెళ్ళిచేసు కున్నట్టున్నాడు. అంటే తన ప్రేమను అంత త్వరగా మరచిపోయాడా'–మనసు లోనే అనుకున్నది జ్యోతి.

"హలో వాసుగారా! బాగున్నారా! రెండురోజులు శెలవు పెట్టారే" పలక రించాలని పలకరించింది జ్యోతి.

"బాగున్నాను" చెప్పాడు వాసు.

"రెండురోజులు నుండి ఆఫీసుకు రాక పోయేసరికి, మీకేదో జబ్బు చేసిందను కున్నానులెండి"

స్వప్న వంక చూసి నవ్వలేక నవ్వాడు వాసు. స్వప్న ఇద్దరి వంకా చిత్రంగా చూస్తోంది.

"మీ కూతురా?" స్వప్న వంక చూస్తూ అంది జ్యోతి.

"ఆ...అవును" మెల్లగా అన్నాడు వాసు.

"హాయ్ బేబీ! నీ పేరేమిటమ్మా?" బేబీని ఎత్తుకుని అడిగింది జ్యోతి.

"స్వప్న! మరి నీ పేరేమిటి?" నవ్వి అడిగింది స్వప్న.

"జ్యోతి" నవ్వి అన్నది జ్యోతి.

స్వప్నకు గౌన్‌లు తీసుకున్నాడు వాసు. జ్యోతి రెండు చీరలు సెలక్ట్ చేసుకుని బిల్లు పేచేసి రిక్షా ఎక్కింది.

"వాసు తన ప్రేమను అంత తొందరగా మరచిపోయి, పెళ్ళి చేసుకుని కాపురం చేసుకుంటూ భార్యాబిడ్డలతో సుఖంగా ఉన్నాడు. తనను మాత్రం దుఃఖంలో ఉంచాడు. తన బతుకు ఇలా బాధలపాలు చేసినందుకు, అతడిని కూడా బాధపెట్టాలి. ఈ నెలరోజులనుండి అతడిని మాటలతో బాధపెట్టడం, భయపెట్టడం చేస్తుండేది. ఇకనుండి ఇంకా ఎక్కువ బాధపెట్టాలి. అయితే అతడిని బాధ పెట్టాలేగాని బ్రతుకు నాశనం చేయ కూడదు' మనసులోని అనుకుంది జ్యోతి.

"డాడీ! ఆ ఆంటీ ఏమిటి అలా మాట్లాడుతుంది? ఆ ఆంటీకి మాట్లాడటం తెలియదా?"

"అంతే! ఆమెకు మాట్లాడటం తెలి యదు" చెప్పాడు వాసు.

"ఆమె ఎలా తెలుసు నీకు?"

"మా ఆఫీసర్! అంటే మా ఆఫీసులో పనిచేసేవాళ్ళందరికన్నా పెద్ద ది" చెప్పాడు వాసు.

మర్నాడు వాసు ఆఫీసులో అడుగు పెట్టేసరికి శంకరం విసుగ్గా కొందరితో మాట్లాడుతూ ఉన్నాడు.

"ఆ ఫైల్ నాదగ్గర లేదయ్యా. అదుగో వస్తున్నాడే...ఆయనదగ్గరవుంది" వస్తున్న వాసుని చూపించి అన్నాడు శంకరం.

వాసు వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు. వచ్చినవాళ్ళు ఈసారి కొద్దిగా గొంతు తగ్గించి శంకరంతో అంటున్నారు–

"ఆయనకు కొద్దిగా చెయ్యి తడిపితే తొందరగా కదిలిస్తారా ఆ ఫైలు"

"అబ్బో...ఆయనా! ఆయనకలాంటివి గిట్టవండీ. లంచాలు తీసుకునేందుకు ఆయన భయపడతారు"

"ఆ ఫైలు కదలాలంటే మరెలా చెయ్యాలి?"

"వెళ్ళి మెల్లగా అడగండి. ఆయన ఏమైనా ఒప్పుకుంటారేమో! నైంటీ పర్సంట్ ఆయన తీసుకోరు. కాకుంటే మీ మంచితనంతో కాస్త త్వరగా చేసి పెట్టొచ్చు"

వాళ్ళు చిన్నగా మాట్లాడుకుంటూ ఉన్నా ఆ మాటలు తనకు వినిపిస్తూనే ఉన్నాయి. వాళ్ళు ఓ అయిదు రూపాయలు శంకరం చేతిలో పెట్టారు. మొహమాటంగా తీసుకుంటున్నట్టుగానే తీసుకుని జేబులో పెట్టుకున్నాడు శంకరం.

వాళ్ళు ఇద్దరూ శంకరం దగ్గర నుండి వాసు దగ్గరకు వచ్చారు. వాళ్ళు ఏదో చెప్పబోయేముందే తనే అన్నాడు వాసు–

"మీ ఫైల్స్ వీలయినంత తొందరలో చూస్తాను...మీరు వెళ్ళిరండి"

వాళ్ళు కాసేపు పలకకుండా నిలబడి తర్వాత అన్నారు–

"మీరు పంపిస్తారు. కానీ మాకు

తొందరగా కదలడంకావాలి. అందుకు..." జేబులోనుండి డబ్బు తీస్తున్నారు అతడికి మాత్రమే కనబడేటట్లు.

"సారీ! నాకలాంటివి ఇష్టంలేదు. మీరు వెళ్ళండి"

"ప్లీజ్...మా తృప్తికోసం "బలవంతం చేయబోయారు.

"మీ తృప్తికోసం తీసుకుంటే నా ఆత్మాభిమానంచంపుకున్నట్టుఅవుతుంది" ఖండితంగా చెప్పాడు వాసు.

వాళ్ళు రెండు మూడుసార్లు బతిమిలాడారు. చివరికి వీలుకాక 'ఆ ఫైలు తొందరగా పంపిస్తాననే' మాట వాసు నుండి తీసుకుని వెళ్ళిపోయారు.

అప్పటి వరకూ అదంతా గమనిస్తున్న శైలజ అతడి దగ్గరకు వచ్చింది.

"దేశమంతా మీలాంటి ఉద్యోగులే ఉంటే, ఈ దేశంలో లంచగొండి తనమనేది లేకుండా పోయివుండేది కదా" కుర్చీ లాక్కుని అతని ఎదురుగా కూర్చుంటూ అంది శైలజ.

నవ్వాడు వాసు. అంతే! అంతకన్నా ఎక్కువగా పలుకలేదు. తను ఇక్కడ శైలజతో నవ్వుతూ మాట్లాడితే అక్కడ ఎదురుగా శంకరం గుండెల్లో గునపాలు దిగేసినట్టుగా బాధపడతాడని అతడికి తెలుసు.

"ఈ దేశమంతా లంచగొండుల మయమయిపోయి ఉందండీ! మీలాంటి ఆశయపరులు వెతుకుదామన్నా కనిపిం చడం లేదు"

శంకరం ఉలిక్కిపడటం గమనిం చాడు వాసు. అయితే అతడు ఒక చెవి ఇటువేసి ఉన్నాడన్నమాట. అందుకే అన్నాడు–

"కాని ఇప్పుడు తప్పుచేయనివాడిని ఆశయపరుడు అనడం లేదండి! భయ స్తుడు అని అంటున్నారు అందరూ"

శంకరం వినాలనే పెద్దగా అంటు న్నాడు వాసు.

"వాళ్ళెవరో ఆశయాలు లేని మూర్ఖులండీ" టక్కున అంది శైలజ.

శంకరం ముఖం ఎలా ఉందోనని అతడి వైపు చూశాడు వాసు. అర్జంట్‌గా ఫైల్‌లో ముఖం దాచేసి ఉన్నాడు శంకరం.

మనసులోనే నవ్వుకున్నాడు వాసు.

అదే క్షణం అక్కడికి వచ్చాడు ప్యూన్–మేడమ్ పిలుస్తోందంటూ. అతడి వెనుకే కదిలాడు వాసు.

వెనుకే ఆఫీస్ స్టాఫ్ గుసగుసలాడుకో సాగారు. తను పిలవాల్సిన అవసరం లేని ఓ గుమస్తాని తమ ఆఫీసర్ ఎక్కువగా ఎందుకు పిలుస్తుందో వాడికి అర్థంకాలేదు. పోనీ వాళ్ళు బంధువులని అనుకునేందుకు, వాళ్ళ కేస్ట్‌లు వేరు. బహుశా ఏదో స్నేహితులు అయివుంటారు అని అనుకోసాగారు. దానితో ఆఫీస్‌లో ఈమధ్య వాసుకు గౌరవం పెరిగింది. బహుశా త్వరలో ప్రమోషన్ కూడా రావచ్చేమోననుకుంటున్నారు.

జ్యోతి గదిలోకి అడుగుపెట్టాడు వాసు. ఇద్దరు విజిటర్స్ వున్నారు ఆ గదిలో. ఒక క్షణం బిత్తరపోయాడు వాసు. వాళ్లు ఇంతకుముందు తన దగ్గరకు వచ్చి లంచం ఆశ చూపినవాళ్ళు. విజిటర్స్ రూంలోనుండి జ్యోతి గదిలోకి వచ్చి వుంటారు.

"కూర్చోండి" కుర్చీ చూపించి అంది జ్యోతి.

కూర్చున్నాడు వాసు. వాళ్లూ తన వైపు చూసి నవ్వారు. వాసు కూడా





బదులుగా నవ్వి వూరుకున్నాడు.

వాళ్ళతో ఓ ఐదు నిముషాల పాటు మాట్లాడి పంపేసింది జ్యోతి. ఆ విషయాలు తనకు సంబంధించినవికావు. వాళ్లు వెళ్ళిన తర్వాత తనవైపు తిరిగి నవ్వింది జ్యోతి.

"అదృష్టవంతులు. ఈరోజు ఉద్యోగం పోకుండా కాపాడుకోవడమేకాదు శ్రీకృష్ణ జన్మస్థలం దర్శించకుండా తప్పించుకున్నారు.

"అంటే" అర్థంకాక అడిగాడు వాసు.

"ఇంతకుముందు ఇక్కడ కూర్చుని మాట్లాడినవారు ఎవరనుకుంటున్నారు? వాళ్లు యాంటీకరప్షన్ ఆఫీసర్స్. నా కోరిక మీద ఆఫీసును చెక్ చేయడానికి వచ్చారు. ముఖ్యంగా మీకోసమే పిలిపించాను" నవ్వుతూనే అంది జ్యోతి.

అతడు బిత్తరపోయాడు.

"ఓహో...అది తమరి పన్నాగమా?" కోపంగా అన్నాడు వాసు. జ్యోతి కూడా నవ్వింది.

"ఎంత మాత్రం లంచగొండివో చూద్దామనుకున్నాను. చివరికి లంచం తీసుకునేందుకు కూడా భయపడతావనుకోలేదు" వ్యంగంగా అన్నది జ్యోతి.

"నేను భయపడలేదు. లంచం తీసుకోవడం తప్పనితెలిసి ఆతప్పు చేయలేదు... అంతే" చెప్పాడు వాసు.

"నేను మాత్రం పిరికితనంతోనే ఆ తప్పు చేయలేదనుకుంటున్నాను"

"ఒకసారి పిరికివాడుగా గుర్తింపు పడ్డాక, ఇక ఆ పిరికివాడు స్థిరనిర్ణయంతో మంచిచేసినా, దానికి గుర్తింపు వుండదు. పిరికితనంతో తప్పు చేయలేక మంచి చేశాడని అనుకుంటారు" అన్నాడు వాసు.

"ఇక మీరు వెళ్ళొచ్చు" అన్నది జ్యోతి.

ఇవతలకు వచ్చేశాడు వాసు. తను లంచం తీసుకునివుంటే అని అనుకోగానే అతని వళ్ళు జలదరించింది. ఒకవేళ తన బుద్ధి మారి వాళ్ళచేతులనుండి తను లంచం తీసుకుని వుంటే ఏమయివుండేది? తన ఉద్యోగం వూడిపోయివుండేది. తను కటకటాలు లెక్కపెట్టుకుంటూ కూర్చుని వుండేవాడు'' భయంగా అనుకున్నాడు వాసు.

యాంటీ-కరప్షన్ వాళ్ళయితే లంచంగా కాకున్నా తమ చేతినుండి డబ్బు తీసుకున్న శంకరాన్ని ఎందుకు అరెస్టు చేయలేదని అతడికి ఆలోచన రాలేదు. ఆ ఆలోచనే వచ్చివుంటే అతడికి మొత్తం అర్థం అయిపోయివుండేది.

గదిలో జ్యోతి నవ్వుకోసాగింది. వాళ్లు యాంటీకరప్షన్ వాళ్లని చెప్పి మొత్తంమీద వాసుని భలేభయ పెట్టింది. అప్పుడప్పుడూ భయపెట్టాలి. తనను దుఃఖంలోవుంచి, అతను భార్యాబిడ్డలతోసుఖంగా వుంటాడా? కసిగా అనుకుంది జ్యోతి.

కొద్దిసేపటికి ప్యూన్ వచ్చి శంకరంతో చెప్పాడు-"సార్...మిమ్మల్ని మేడమ్ పిలుస్తున్నారు"

"నన్నేనా?" ఆనందంగా అడిగాడు శంకరం.

"అవున్సార్...మిమ్మల్నే" చెప్పాడు ప్యూన్.

"గురూ! నన్ను నా జ్యోతి పిలుస్తోందట!" ఆనందంగా వాసు దగ్గరకు వచ్చి చెప్పాడు.

"సరే... వెళ్లు" విసుగ్గా అన్నాడు వాసు.

కర్చీఫ్‌తో ముఖం తుడుచుకున్నాడు. అద్దంలో చూసి తల దువ్వుకుని, కాలర్

సర్దుకున్నాడు. తలుపు తీసుకుని లోపలికి అడుగుపెట్టాడు శంకరం.

ఫైల్ చూసుకుంటున్న ఆమె తలెత్తి అతడిని చూసి కుర్చీ చూపించింది చేత్తో. కూర్చున్నాడు శంకరం. ఫైల్‌ని మూసి తలెత్తింది జ్యోతి.

"చూడండి శంకరం... మీరింత వరకూ ఏదో మంచివారని అనుకుంటుండే దాన్ని. కానీ మీరు లంచం తీసుకుంటారని మీ మీద కంప్లయింట్ అందింది నాకు"

"ఛీఛీ! లంచమా? లంచం తీసుకోవడమంటే నాకసహ్యమండీ. లంచం తీసుకునేవాళ్ళను చూస్తే చంపాలన్నంత కోపం వస్తుందండి నాకు. నా మీద మీకు ఎవరో అబద్దాలు చెప్పారండి. లంచం తీసుకోవటమే కాదండీ...మరే తప్పుడుపని చేయాలన్నా నాకు భయమండి. నేను అంత మంచివాడిననే మా మామలందరూ నన్ను మెచ్చుకుని నాకు తమ అమ్మాయిలను ఇవ్వాలని ఉవ్విళ్ళూరుతుంటారు. ఈ కాలంలో కూడా ఇలాంటి మగాడు ఉన్నాడా అని మా వీధిలోని అమ్మాయిలంతా నా వెంట పడుతుంటారండి. కానీ నేనొక అమ్మాయిని ప్రేమించానండీ ఆమె..."

"చూడండీ! మీ గురించి మీరు గొప్పగా చెప్పుకోవడం మంచిది కాదు. మీరు లంచం తీసుకున్నారని నా దగ్గర సాక్ష్యం వుంది" కోపంగా అంది జ్యోతి.

"నేను లంచం తీసుకున్నానని సాక్ష్యమా!" ఆశ్చర్యంగా ముఖం పెట్టాడు శంకరం.

"అవును. ఓ గంట క్రితం ఓ ఫైల్ కోసం వచ్చిన ఇద్దరి దగ్గర మీరు ఓ అయిదు రూపాయలు లంచం తీసుకున్నారా లేదా?"

ఆశ్చర్యపోయాడు శంకరం. గంట క్రితం జరిగింది ఇంతలో ఈమెకు ఎలా తెలిసింది? బహుశా వాసు చెప్పివుంటాడు.

"అదీ ...అది" నసిగాడు శంకరం.

"ఇది మీకు ఫస్ట్‌వార్నింగ్. ఇంక ఎప్పుడూ ఇలా జరగకుండా చూడండి. వెళ్ళండి" చెప్పింది జ్యోతి.

'బతుకు జీవుడా' అంటూ గదిలో నుండి ఇవతలకు వచ్చాడు శంకరం.

వాసు ఎదురుగా కూర్చుంటూ అన్నాడు శంకరం.

"బ్రదర్! మీ పద్ధతేం బాగాలేదు"

"ఏం చేశాను నేను"

"మన మేడమ్‌తో మీకు స్నేహం వుండొచ్చు. అంతమాత్రం చేత మిగతా వారిమీద చాడీలు చెప్పడం ఏమీ బాగా లేదు"

"నేను చాడీలు చెప్పానా? నువ్వు అనేదేమిటో నాకేమీ అర్థం కావటంలేదు"

"గంటక్రితం నేను తీసుకున్న అయిదు రూపాయల గురించి ఆమెకు ఎవరు చెప్పారు?"

"నువ్వు తీసుకున్న అయిదు రూపాయల గురించి ఆమెకు తెలిసిందా?"

"ఆ...తెలిసింది. నాలుగు మాటలు కూడా వడ్డించింది"

అయితే శంకరం డబ్బు తీసుకున్న సంగతి అవచ్చిన వాళ్ళద్వారానే జ్యోతికి తెలిసి ఉంటుంది"

"శంకరం! నిజంగా ఆ విషయం గురించి నాకేం తెలియదు"

"ఒక గంట నుండి ఆమె గదిలోకి వెళ్ళినవాడివి నువ్వొక్కడివే. నువ్వు కాకపోతే మరెవరు చెప్పి వుంటారు?"

"పొరపాటుపడ్డావు శంకరం! ఇంతకు ముందు లంచం ఇవ్వను వచ్చినవాళ్లు





ఆమె స్నేహితులేనట. వాళ్లు ఆ ఫైలు కోసం ఆమె దగ్గరకెళ్ళకుండా, మన దగ్గరే లంచంపెట్టి పనిచేయించుకోవాలను కున్నారు. కానీ అది వీలు కాకపోయే సరికి ఆమె దగ్గరికే వెళ్ళి జరిగింది చెప్పి నట్టున్నారు. అందుకే ఆమె నన్ను పిలిచి ఆ ఫైలు తొందరగా కదిలించమని చెప్పింది. బహుశా ఆ వచ్చినవాళ్ళే నీ విషయం చెప్పివుంటారు" జరిగినదానికి కొద్దిగా కల్పనను జోడించి చెప్పాడు వాసు.

"అలాగా" నిజం తెలుసుకుని అన్నాడు శంకరం.

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం" అన్నాడు వాసు.

"నువ్వు అబద్ధం చెప్పవని నాకు తెలుసులే"

కాసేపు మౌనంగా ఉన్న తరువాత అన్నాడు శంకరం-

"గురూ! ఎంత దయలేనివాళ్లు ఈ ఆడవాళ్లు. వీరికి కృతజ్ఞత అనే పదానికి అర్థం తెలుసా? ఆమెకు కృతజ్ఞత అనేది లేదు కాబట్టే నన్ను ఇలా అనగలిగింది. ఆ రోజు ఆమె కోసం టౌనంతా తిరిగి పనిమనిషిని మాట్లాడానే! కాళ్ళరిగేలా తిరిగి పనిమనిషిని తీసుకువస్తే, ఆమె అవసరం లేదని చెప్తే ఆ పనిమనిషికి నచ్చచెప్పి పదిరూపాయలు ఇచ్చిపంపానే! మా మేడమ్ ఎంతో మంచిది అని, తెలిసినవారందరికీ ప్రచారం చేస్తున్నానే ఇంత మంచి చేసిన నాకే...ఆఫ్టరాల్ ఐదు రూపాయలు లంచం తీసుకున్నందుకు ఫస్ట్‌వార్నింగ్ ఇచ్చిందామె. ఎంత కర్కశ హృదయం ఆమెది"

'ఎంత కర్కశ హృదయం ఆమెది' తనూ మనసులోనే అనుకుని శంకరంతో అన్నాడు వాసు-"పోనీలే బాధపడకు".

"బాధకాదు గురూ! అసలు నాకు చనిపోవాలనిపిస్తోంది"

"ఛీఛీ...ఇంత చిన్న విషయానికి అంత పెద్ద నిర్ణయాలు ఎందుకు?" భుజం మీద చేయివేసి అనునయంగా అన్నాడు వాసు.

"ఇది నీ దృష్టిలో చిన్న విషయంగా కనిపిస్తోందా గురూ! ప్రేమించిన ప్రియురాలిచేత తిట్టించుకోవడం చిన్న విషయమా గురూ"

అప్పటి వరకూ అతడిమీద జాలి కురిపిస్తున్న వాసుకు, ఒక్కసారిగా కోపం కలిగింది.

'ప్రేమించిన ప్రియురాలా! నీ మొహానికి అదొక్కటి తక్కువ. అసలు జ్యోతి నిన్నింకా తిట్టి ఉండాల్సింది' మనసులోనే అనుకున్నాడు వాసు.

అప్పటివరకూ జాలిగా కనిపిస్తున్న అతడి ముఖం ఒక్కసారిగా సీరియస్‌గా మారడం గమనించాడు శంకరం. ఎందుకు సీరియస్‌గా మారాడో మాత్రం అర్థంకాలేదు.

"గురూ...." మెల్లగా అన్నాడు శంకరం.

"నేను ఫైల్స్ చూసుకోవాలి నువ్వెళ్ళి నీ పని చూసుకో" సీరియస్‌గా చెప్పాడు వాసు.

అలా ఒక్కసారిగా సీరియస్‌గా ఎందుకు మారాడో అర్థం కాలేదు శంకరంకు. ఇతగాడికేదో మెంటల్ లూజ్ అనుకుంటూ తన సీట్లోకి వెళ్లాడు శంకరం.

మధ్యాహ్నం వరకూ ముభావంగా గడిపాడు వాసు. శైలజ రెండుమూడు సార్లు నవ్వుతూ పలకరించింది.




''ఏమిటి...ఈ రోజు మీరు, శంకరం డల్‌గా ఉన్నారు?''

"ఆయన సంగతేమో తెలియదు. నాకు మాత్రం మనసు బాగాలేదు"

''మేడమ్ ఎందుకు పిలిచింది మిమ్మల్ని?"

"ఏదో ఫైల్ గురించి అడిగింది''

"సాయంత్రం పిక్చర్‌కి రాగలరా! శాంతి థియేటర్‌లో మంచి ఇంగ్లీషు సినిమా ఆడుతోంది" నవ్వుతూ అడిగింది శైలజ.

"సారీ! నాకు వీలుకాదు".

"పోనీ...సాయంత్రం మా ఇంటికి టీకయినా రాగలరా" బతిమలాడుతూ అడిగిందామె.

''ఈరోజు నాకు వేరే ప్రోగ్రాం ఉంది. నా కూతురిని ఎగ్జిబిషన్‌కు తీసుకు పోవాలి. మరోసారి వచ్చేందుకు ట్రై చేస్తాను" విసుగ్గా అన్నాడు వాసు.

"మీరు ఎప్పుడు అడిగినా ఏదో ఒక కారణం చెబుతారు" కోపంగా అన్నది శైలజ.

''నాకు వీలు కాకపోతే నేనేం చేసేది చెప్పండి"

"అవునులెండి...మీకు ఎప్పుడూ వీలుకాదు" విసురుగా వెళ్ళిపోయింది శైలజ.

వెంటనే అక్కడికి పరిగెత్తుకొచ్చాడు శంకరం.

"గురూ...శైలజ ఏదో సినిమాకి అన్నట్టు వినిపించింది. ఇంతకీ ఏ సినిమాకి వెళుతుందట'' ఆరాగా అడిగాడు శంకరం.

"శాంతి థియేటర్‌కి వెళుతుందట. వెళ్ళి నీ అదృష్టాన్ని పరీక్షించుకో" అన్నాడు వాసు.

"థాంక్స్ గురూ! ఇటువంటి విషయాలలో నీవు నాకు ఇచ్చే కోపరేషన్ ఈ జన్మకు మరచిపోలేను".

చెయ్యిపట్టుకుని ఊపేసాడు శంకరం.

ఆ రోజు సాయంత్రం స్వప్నను తీసుకుని ఎగ్జిబిషన్‌కు వెళ్ళాడు వాసు. స్వప్న చేయిపట్టుకుని ఒక్కొక్కటి చూపిస్తూ ఉన్నాడు వాసు.

అలా స్వప్నకు చూపిస్తున్నప్పుడు ఓ చోట అతడికి తారసపడింది శైలజ.

"హలో" పలకరించింది శైలజ.

"హలో" విధిలేనట్టుగా అన్నాడు వాసు.

"సినిమాకెళ్ళాలనిపించలేదు. అందుకే ఇలా ఎగ్జిబిషన్‌కు వచ్చాను" నువ్వు ఎక్కడకు వచ్చినా నిన్ను వదలనులే అన్నట్టు అన్నది శైలజ.

వాసుకు శంకరం గుర్తుకు వచ్చాడు. పాపం! ఆ సినిమా థియేటరులో ఈ మహాతల్లికోసం ఎదురుచూస్తూ వుంటాడు.

"పాపా! నీ పేరేమిటి?" స్వప్నను ఎత్తుకుని అన్నది శైలజ.

"స్వప్న"

"చాలా స్వీట్ నేమ్" స్వప్నను ముద్దు పెట్టుకుని చెప్పింది శైలజ.

వాసు మౌనంగా నిలబడి వుండటం చూసి, శైలజే కలిపించుకుని అంది.

"అదేమిటి అలాగే నిలబడిపోయారు, స్వప్నకు ఎగ్జిబిషన్ అంతా చూపిద్దాం రండి!"

మౌనంగా ఆమెను అనుసరించాడు.

శైలజ స్వప్నకు అన్నీ తనే చూపించింది. అన్నీ వివరించి చెప్పింది. నవ్వించింది. ఏవేవో కొనిచ్చింది.

'బాగా మచ్చిక చేసుకుంటోంది' మనసులోనే అనుకున్నాడు వాసు.

ముగ్గురూ ఒకచోట కూల్‌డ్రింకు తాగుతూ కూర్చున్నారు. కాసేపు తర్వాత స్వప్న అడిగింది.

"డాడీ! ఐస్‌క్రీం తెచ్చుకుంటాను" పక్కనున్న కొట్టుచూపిస్తూ అంది.

"ఇదిగో బేబ! నువ్వెళ్ళి కొనుక్కో" డబ్బులు చేతిలో పెట్టింది శైలజ. స్వప్న ఆ వేపుకు పరుగెత్తింది.

వాసుకు ఆ పరిస్థితి ఇబ్బందిగా ఉంది. ఇలా తామిద్దరూ ఓచోట కూర్చుని ఉండటం ఎవరయినా చూస్తారేమో! ఏదైనా అపార్థం చేసుకుంటారేమో! మనసు లోనే భయంగా అనుకోసాగాడు వాసు.

అతడు ఏది జరుగుతుందని భయపడు తున్నాడో అది జరగనే జరిగింది.

తల్లితో కలిసి ఎగ్జిబిషన్ చూసేందుకని వచ్చిన జ్యోతి వాళ్ళిద్దరినీ చూడనే చూసింది.

ఇద్దరూ ఒకరిపక్క ఒకరు కూర్చుని ఉన్నారు. శైలజ ఏదో చెపుతోంది.అతడు మెల్లగా నవ్వుతున్నాడు.

"ఓహో! ఫర్వాలేదే! ఈ పిరికివాడు బాగా ధైర్యస్థుడయ్యాడే! ఇంట్లో భార్యను పెట్టుకుని, ఇలా గరల్ ఫ్రెండ్స్‌తో తిరగడంకూడా నేర్చాడే!" మనసులోనే అనుకుని, పళ్ళు కొరుక్కుంది జ్యోతి. వాళ్ళకి కనపడకుండా తప్పుకుని ఇంటికి వచ్చేసింది.

స్వప్న ఐస్‌క్రీం తెచ్చుకున్న తర్వాత లేచాడు వాసు.

"వస్తాము శైలజగారూ" స్వప్న చేయి పట్టుకున్నాడు.

"ఆంటీ! మా ఇంటికి ఎప్పుడొస్తారు" అడిగింది స్వప్న.

"మీ నాన్నగారు పిలిస్తే, ఎప్పుడైనా వస్తాను" నవ్వుతూ అంది శైలజ.

"నేను పిలుస్తున్నాగా! రండి ఆంటీ" బతిమలాడుతూ అంది స్వప్న.

"అలాగే వస్తాలే" స్వప్నను ముద్దు పెట్టుకుని అంది శైలజ.

వాసువంక తిరిగిచూసింది శైలజ. "చూశావా! నీ కూతుర్ని ఎలా ఆకట్టు కున్నానో! అన్నట్టుగా వుంది ఆ చూపు. తల తిప్పుకున్నాడు వాసు.

స్వప్నను తీసుకుని రిషా ఎక్కేసాడు. శైలజ నవ్వుతూ మరో రిషా ఎక్కింది.

ఆ మర్నాడు వాసు రావడం చూస్తూనే పరిగెత్తుకుంటూ ఎదురెళ్ళి, అతడికిదగ్గరగా చేరి ఏడుపు గొంతుతో అన్నాడు శంకరం-

"గురూ! ఎంత అన్యాయం జరిగి పోయింది"

"ఏమయింది?" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"నిన్న సాయంత్రం ఫస్ట్‌షో సినిమాకి శాంతి థియేటర్‌కు వస్తానన్న శైలజ రానేలేదు. ఎంతోసేపు వెయిట్ చేశాను గురూ...రాలేదు. ఐదురూపాయల టికెట్ వృథా అయిపోయింది"

"అలాగా" బాధగా అన్నట్టు అన్నాడు వాసు. శైలజ ఎగ్జిబిషన్‌కు వచ్చినట్టు తనను కలిసినట్టు మాత్రం చెప్పలేదు.

"పోనీలే గురూ! నేను దురదృష్ట వంతుణ్ని" తనకు తనే నచ్చజెప్పు కున్నాడు శంకరం. ఇద్దరూ కుర్చీల్లో కూర్చుని ఫైల్స్ చూసుకోసాగారు.

కొద్దిసేపటికి ఆఫీసు ప్యూన్ వాసు దగ్గరకు వచ్చాడు. "సార్! మిమ్మల్ని మేడమ్ పిలుస్తున్నారు"

లేచి ఆమె గదిలోకి నడిచాడు. కూర్చో మని చెప్పడంతో కూర్చున్నాడు. ఫైల్ మూసి తలెత్తి అతడిని చూసి నవ్వింది.

"నిన్న నేను ఎగ్జిబిషన్‌కు వచ్చాను"

"అలాగా" ఆ విషయం ఎందుకు చెబుతోందో అర్థంకాలేదు.

"ఫర్వాలేదే...మీరిప్పుడు ధైర్యవంతు లయినట్టున్నారు. అప్పటి పిరికితనం లేనట్టుంది మీలో. లేకుంటే ఓ పెళ్ళికాని అమ్మాయితో ధైర్యంగా తిరుగుతున్నా రంటే...ఫర్వాలేదు. కొద్దిగా భయం తీరి నట్టుంది. ఇప్పుడిప్పుడే ధైర్యం వస్తోంది మీకు" అంది.

అసలు విషయం అర్థంఅయింది అతడికి. భయంగా ఆమెవైపు చూశాడు వాసు. ఈ మహాతల్లి కళ్ళలోనే పడ్డామా అనుకుంటూ.

"పాపం! మీ ఆవిడ నువ్వో ఏక పత్నీవ్రతుడివి అని అనుకుంటూ ఉంటుంది. ఈ విషయం ఆమెకు ఏం తెలుసుంది. సరేలెండి...నేనయినా చెబు తాను"

"సారీ! నా భార్య ఇప్పుడు ఈ లోకంలో లేదు"

"అంటే...."

"ఆమె మూడేళ్ళక్రితమే స్వర్గస్తురా లయింది. ఓ యాక్సిడెంట్‌లో చని పోయింది"

"ఓ..సారీ! అయామ్ వెరీసారీ!" బాధ నిండిన కంఠంతో అన్నది జ్యోతి.

"ఇట్సాల్‌రైట్"

"చనిపోయి మూడేళ్ళయిందా!" అడి గింది జ్యోతి.

తలూపాడు వాసు.

"బస్ యాక్సిడెంట్‌లో పోయింది"

"మీ పాత విషయాలు జ్ఞాపకంచేసి మిమల్ని బాధ పెట్టినట్టున్నాను. అయామ్ వెరీ సారీ! మీరు వెళ్ళండి"

ఇవతలకు వచ్చేశాడు వాసు.

వాసు భార్య చనిపోయిందా!చనిపోయి మూడేళ్ళయిందా! అది తనకు తెలియకనే అతడు భార్యాబిడ్డలతో సుఖంగా కాపురం చేసుకుంటున్నాడన్న ఈర్ష్యతో తను ఇంతకాలం అతడిని బాధపెట్టింది. పాపం! అసలే బాధలతో వున్న అతడిని మరింత బాధపెట్టింది తను.

భార్య చనిపోయి మూడేళ్ళయితే ఇంతకాలంనుండి అతడెందుకు పెళ్ళి చేసుకోలేదు? ఏం కారణముంటుందబ్బా!

ఆలోచిస్తున్న ఆమెలో చిన్న ఆశ కలిగింది. వెంటనే ఆమెలో అహం కూడా బుసలుకొట్టింది.

ఆఫీసరయిన తను ఆఫ్టరాల్ ఓ క్లర్కుని పెళ్ళిచేసుకోవడమా! నో! మనసులోనే అనుకుంది.

కానీ మనసులో జనించిన ఆ కోరిక క్షణక్షణానికి పర్వతంలా పెరిగిపోతోంది. క్షణక్షణానికి ఆమె ఒకనాటి కాలేజీ విద్యార్థిని జ్యోతిలా మారిపోసాగింది. ఆమెలోని పాత ప్రేమ పొంగి పొరల సాగింది.

ఎంతో బలంవంతంమీద మనసును అదుపులోకి తెచ్చుకోగలిగింది జ్యోతి.



## 6

ఆఫీసునుండి వచ్చి కాఫీ తాగుతున్నాడు వాసు.

గేటు తీసుకుని ఎవరో లోనికి వస్తు

న్నారు. అతడిని వెంటనే గుర్తుపట్టలేక పోయాడు వాసు. గుర్తుపట్టగానే గ్లాస్ అక్కడ పెట్టేసి వేగంగా ఎదురువెళ్లాడు.

"ఎన్నేళ్ళు అయిందిరా నిన్ను చూసి" ఆనంద్ని కౌగిలించుకున్నంత పనిచేశాడు వాసు.

"నాలుగేళ్ళయిపోయింది కదా...ఈ వూరొచ్చి" అన్నాడు ఆనంద్.

''నువ్వు ఢిల్లీ వెళితే, నీకు కనీసం గుర్తుకూడా వుండము కాబోలు, ఓ వుత్తరం కూడా రాయవు'' నిష్ఠూరంగా అన్నాడు వాసు.

ఇద్దరూ లోనికి వచ్చారు. కుర్చీలో కూర్చున్నాడు ఆనంద్. ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులోకి వంచి ఆనంద్కి ఇచ్చాడు వాసు.

"ఇదేమిటి...కాఫీ నువ్వే ఇస్తున్నావు. మీఆవిడ పుట్టింటికి వెళ్ళిందా?"

''నీకు తెలియదుకదూ...ఆమె చని పోయింది"

"మైగాడ్! మీ మిసెస్ చనిపోయిందా. ఎప్పుడు?"

"మూడేళ్ళు అయింది. పుట్టింటికని బస్సులో వెళుతుంటే, బస్సు యాక్సిడెంట్ జరిగింది"

"బస్సు యాక్సిడెంటా?" తనలో తను అనుకున్నాడు ఆనంద్.

కొద్దిసేపు ఇద్దరిమధ్యా మౌనం. అప్పుడే లోపలికి అడుగుపెట్టింది స్వప్న.

"నా కూతురురా! పేరు స్వప్న" కూతుర్ని దగ్గరకు తీసుకుని అన్నాడు వాసు.

"హాయ్ బేబీ" స్వప్నను దగ్గరకు తీసుకుని తను తీసుకొచ్చిన బిస్కెట్ ప్యాకెట్స్, చాక్లెట్ బార్లు చేతిలో పెట్టాడు.

"ఇంతకీ నీకు పిల్లలెంతమంది?' అడిగాడు వాసు.

"పరిమిత కుటుంబం. ఓ బాబు, ఓ పాప...అంతటితో కట్"

"ఎలా వుంది నీరజ?"

"షి ఈజ్ ఫైన్" చెప్పాడు ఆనంద్.

"ఎప్పుడు వచ్చావు? ఎన్నిరోజులు వుంటావు??"

"ఈరోజు మధ్యాహ్నమే వచ్చాను వాసూ! ఇక్కడకు రాగానే ముందు నిన్ను చూడాలనిపించింది. నీరజను తీసుకురావాలనుకున్నాను. కానీ వాళ్ళ బంధువులు ఎవరో ఆమెను కలుసుకునేందుకు వచ్చారు. అందుకే రేపు వస్తానని చెప్పింది. పోతే నేను ఓ పదిరోజులు ఉంటాను''

"అయితే ఈ రాత్రికి నాతోనే వుండాలి. చాలారోజులకు కలుసుకున్నాం. ఇద్దరం కలిసి సినిమాలకు, షికార్లకు వెళదాం. మళ్ళీ ఆనాటి రోజులు జ్ఞాపకం వస్తున్నాయి నాకు''

"అలాగే. కానీ ఈరోజు రాత్రికాదు– అక్కడ మా మామయ్య ఎదురుచూస్తూ వుంటాడు. రేపు రాత్రికి ఇక్కడే వుంటాను...ఓకే"

ఒప్పుకున్నాడు వాసు.

ఆ తర్వాత చాలా పొద్దుపోయేంత వరకూ ఇద్దరూ మాట్లాడుకుంటూ కూర్చు న్నారు. ఎనిమిది గంటల ప్రాంతంలో వెళ్ళిపోయాడు ఆనంద్.

భోంచేసి పడుకున్నాడు వాసు. కానీ అతడికి ఎంతసేపటికీ నిద్రరాలేదు. అతడి ఊహలలో వందన చోటు చేసుకుంది.

తన సంసార జీవితాన్ని గురించి ఆనంద్కి వివరంగా తెలీదు. తెలిసివుంటే ఆనంద్ తనను మరోసారి పిరికివాడని

అని వుండేవాడు.

పిరికివాడు ప్రేమను సఫలం చేసుకోలేకపోవడమేకాదు ... సంసారాన్ని కూడా చక్కదిద్దుకోలేడు అని ఎత్తిపొడిచి వుండేవాడు.

తన పిరికితనం తన సంసార జీవితంలో కూడా తనను ఎంతగా బాధపెట్టిందో, తన మనసును ఎంతగా క్షోభపెట్టిందో తనకే తెలుసు.

పిరికివాడు సంసారాన్నికూడా చక్కదిద్దుకోలేడు అనే దానికి తన జీవితమే ఒక చక్కని నిదర్శనం.

వాసు తన సంసార జీవితాన్ని ఒకసారి నెమరువేసుకున్నాడు. నిజమే... ఏదీ తను అనుకున్నట్టు జరగలేదు! పెళ్ళి కూడా అంతే!

* * *

"రేయ్ వాసూ! వచ్చే ఆదివారం మనం పెళ్ళిచూపులకు వెళ్తున్నాం" అంది తల్లి సుందరమ్మ వాసుకు ఉద్యోగం వచ్చిన ఆరునెల్లకు. ఉద్యోగం రావడంతోనే టౌన్‌కి వచ్చేశారు వాళ్ళు.

"ఎవరమ్మా అమ్మాయి?" అడిగాడు వాసు.

"మన ఊళ్ళోనే! వేణుగోపాలంగారు లేరూ...వారి కూతురు వందన"

అతడి కన్నులముందు వందన చిన్ననాటి రూపం కదలాడింది. తను స్కూల్‌లో చదువుకునేప్పుడు తనకన్నా రెండుక్లాసులు జూనియర్‌గావున్న వందన గుర్తుకు వచ్చింది. ఆ వెంటనే పోలియో తగిలిన కాలుతో కుంటడం జ్ఞప్తికి రావడంతో ముఖం చేదు తిన్నట్టుగా అయింది.

"అమ్మా! ఆ కుంటిపిల్లనా!" మెల్లగా అడిగాడు వాసు.

"కుంటిదయితేనేమిరా! కట్నం దండిగానే ఇస్తారు"

కట్నం తీసుకుందామన్నందుకు బాధవేసింది అతడికి. కానీ ఆ మాట తల్లి ఎదురుగా అనేందుకు భయం!

ఆదివారం ఊరు వెళ్లారు పెళ్ళి చూపులకు.

పెళ్ళికూతుర్ని లోనుండి తీసుకు వస్తున్నారు అమ్మలక్కలు. కుంటుతూ వస్తున్న ఆమెను చూడగానే జాలివేసింది వాసుకు. వందనను కూర్చోబెట్టి పక్కకు తప్పుకున్నారు వారు.

ముద్దమందారంలా కూర్చుని ఉన్న వందనను చూడగానే ఈసారి అభిమానం కలిగింది వాసుకు.

కనులెత్తి చూసింది వందన. ఇద్దరి కనులూ కలుసుకున్నాయి.

ఈసారి ఆమె కన్నులలో వున్న నిర్మలత్వంచూశాక ఆప్యాయత కలిగింది! ఆమె కన్నులలోకి సూటిగా చూశాడు. తలదించుకుందామె.

పెళ్ళిచూపులు అయిపోయాయి. కట్నకానుకలు మాట్లాడుకున్నారు. తల్లితోపాటు అతని అక్క జలజ కూడా కలిసి వీలయినంత ఎక్కువ కట్నం రాబట్టారు.

పెళ్ళిచూపులు ముగించుకుని, కట్నకానుకలు మాట్లాడుకుని ఇంటికి తిరిగి వచ్చిన తర్వాత సుందరమ్మ అడిగింది.

"ఏరా! అమ్మాయి నచ్చిందా?"

"నచ్చిందమ్మా" చెప్పాడు వాసు.

ఆమె ఆశ్చర్యపోయింది. పెళ్ళికూతురు గురించి ఎంతో నచ్చచెప్పాలని ఆమె అనుకుంటుంటే, ఒకేసారి నచ్చిందనడంతో ఒక బాధ తప్పినట్టుగా సంతోషించిందామె. "నా కొడుకు బంగారమమ్మా" మెచ్చుకుందామె.

ఆమె దృష్టిలో బంగారమంటే తను

ఏం చెప్పినా గంగిరెద్దులా తల ఊపడమే!

ఆ తర్వాత నెలరోజులకు పెళ్ళి జరిగిపోయింది.

మొదటిరాత్రి భార్యను దగ్గరకు తీసుకున్నాడు వాసు.

"నీలాంటి భార్య దొరకడం నా అదృష్టం" అన్నాడు మనస్ఫూర్తిగానే.

"కాదు..మీలాంటి భర్త దొరకడం నా అదృష్టం" అతడి భుజాలమీద వాలింది వందన.

భార్యను దగ్గరకు లాక్కున్నాడు వాసు. ఆమె నీలి కురులతో ఆటలాడుకున్నాడు. ఆమె గుండెల్లో సేదతీర్చుకున్నాడు. ఆమె పెదవులలో మధువులు తాగాడు...

జీవితంలో తొలి కలయికలో వుండే మధురానుభూతిని తృప్తిగా అనుభవించారిద్దరూ.

వివాహ జీవితంలోని ఆనందాన్ని ఓ నెలరోజులుపాటు తృప్తిగా అనుభవించింది వందన.

ఆ తరువాత ఆ ఇంట్లో తన పరిస్థితి దిగజారుతున్నట్టు గమనించింది.

ఓ అత్తగారు కోడలు మీద ద్వేషం పెంచుకునేందుకు ఎన్నో కారణాలు. అందులో ఒకటి-తన కొడుకుని తన అదుపు ఆజ్ఞలలోనుండి కొత్తగా వచ్చిన కోడలు దూరం చేస్తుందేమోననే సైకలాజికల్ ఫీలింగ్ మొదటిది.

సుందరమ్మకు కూడా అలాంటి భయమే పట్టుకుంది. అందుకే కోడల్ని కూడా తన చెప్పుచేతల్లో ఉంచుకోవాలని ఆమె ఉద్దేశం.

ఇందుకు సుందరమ్మకు తోడయింది కూతురు జలజ.నెలరోజులు అత్తగారింట్లో వుంటే రెండు నెలలు అమ్మగారింట్లో పడి వుండటం ఆమెకు అలవాటు.

వందన పరిస్థితి మెల్లగా దిగజారసాగింది.

"ఏయ్ కుంటిదానా..."వంట ఇంట్లో నుండి పిలిచేది సుందరమ్మ.

"ఏమత్తయ్యా" విసుక్కోకుండా చెప్పేది వందన.

"ఆ కత్తిపీట ముందు కూర్చుని కూరలు తరుగు'' ఆజ్ఞ జారీచేసేది జలజ.

మౌనంగా ఆ పని చేసేది వందన.

అలాగే కొద్దిరోజులు సాగింది. ఆరోజు మాత్రం వాసు చెవిన బడ్డాయి ఆ మాటలు.

లోపలికి వస్తూ ఉన్న వాసుకి ఆ మాటలు వినిపించడంతో వాకిట్లోనే ఆగాడు.

"చచ్చినదానా..బాయిలర్‌లో బొగ్గులు వేయమని నీకెన్నిసార్లు చెప్పాను. ఒక్కసారి చెప్తే చేయలేవా"

''అదికాదు అత్తయ్యా! అంట్లు తోముతున్నా''

"అంట్లు అంతసేపు తోమావా?" మధ్యలోనే అందుకుని అంది జలజ.

సుందరమ్మ వంటగదిలోకి వచ్చి విసుక్కుంటూ ఉంది.

ఒక్క నిమిషం ఆగి ఇంట్లోకి అడుగు పెట్టాడు. తను వచ్చానన్నట్టు దగ్గుతూ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

ఒక్క నిమిషం అలాగే కూర్చుండిపోయింది సుందరమ్మ. కోడలిని తిట్టడం కొడుకు విన్నాడేమోనని కొద్దిగా జంకింది.

"వందనా! కాఫీ తీసుకురా'' అరిచాడు వాసు.

కొద్దిసేపటికి కాఫీ తీసుకుని లోపలికి వచ్చింది వందన. ఆమె చేతిలోని కాఫీ





తీసుకుని టేబిల్‌మీద పెట్టాడు వాసు.

"కూర్చో వందనా'' అన్నాడు వాసు.

"అవతల పని ఉంది'' నసిగింది.

"ఫర్వాలేదు...కూర్చో" ఆమె చేయి పట్టి కూర్చోబెడుతూ అన్నాడు వాసు. కూర్చుందామె.

ఆమెను తన రెండు చేతులతో చుట్టివేస్తూ అన్నాడు-

"అమ్మ ఏదో అరుస్తూ ఉన్నది నేనొచ్చేసరికి...ఏమయింది?" ఆమె చుబుకం పైకెత్తి అన్నాడు వాసు.

''ఏమీ అనలేదు"

"ఏమీ అనలేదా! నా చెవులతో నేను విన్నాను"

"కోపమొచ్చి ఏదో అరిచారు" సర్ది చెబుతున్నట్లు అన్నదామె.

ఆమె వంక ఆప్యాయంగా చూశాడు వాసు. తన వందన అందరు ఆడవాళ్ళ లాంటిది కాదు. భర్తకు అత్తమీద చాడీలు చెప్పదు.

తన కొడుకు, కోడల్ని ఆరిచినందుకు ఏమీ అనకపోవటంతో మెల్లగా విజృంభించేసింది సుందరమ్మ.

కానీ కోడలు గర్భవతి అని తెలిసేసరికి ఆమె ఆగడాలు కొద్దిగా తగ్గాయి. తొమ్మిదవ నెలలో కోడలు పుట్టింటికి వెళ్ళింది.

తిరిగి వచ్చిన తర్వాతే అసలు కథ ప్రారంభమయింది.

* * *

కోడలు తిరిగి వచ్చిన కొద్ది రోజుల వరకూ సుందరమ్మ ఆప్యాయంగానే ఉండేది. ఆ తర్వాత ఆమెలోని అత్తగారు విజృంభించేశారు. మళ్ళీ పూర్వపు పరిస్థితి నెలకొన్నది ఇంట్లో! అయితే ఈసారి మరోమెట్టు పైకెక్కింది సుందరమ్మ. కోడలిని కొట్టటం వరకూ వెళ్ళింది.

భార్యకోసం కొడుకు తనను ఎదిరించే ధైర్యం చేయకపోవటంతో ఆమె మరింత పేట్రేగిపోయింది.

వందన ఇక ఆ పరిస్థితిని ఓర్చుకోలేని స్థితికి వచ్చేసింది. అందుకే చివరికి తన బాధ భర్తతో చెప్పుకోవాలనుకుంది.

ఒకరోజు రాత్రి భర్త తనను దగ్గరకు తీసుకునే వేళ ఆమె అంది...

"ఏమండీ! మీ అమ్మగారు నన్ను అనవసరంగా బాధిస్తున్నారండీ"

ఈమధ్య ఇంట్లో వందన పరిస్థితి గమనిస్తూనే ఉన్నాడు వాసు. పుష్టిగా ఉండే వందన సన్నబడిపోవడం అతనికి తెలుస్తూనే ఉంది. తల్లికి మందలించాలనుకున్నాడు వాసు.

"అది కాదండీ...మీ అక్కగారు ఎక్కువగా ఇక్కడే ఎందుకుంటారు" అడిగింది వందన.

"ఏముందీ...అక్కడ అత్త, ఆడపడుచులకు సేవలు చేయలేక, ఏదో జబ్బు అని ఇక్కడకొచ్చి ఉంటూ ఉంటుంది"

"అలా వచ్చినామె, ఆమె కూడా నన్ను బాధిస్తూ ఉంటుంది. 'కుంటిదానా, చచ్చినదానా' అని తిడుతూ ఉంటుంది"

"రేపు అక్కయ్యను కూడా అరుస్తాలే" ఆమెనుదగ్గరకు తీసుకున్నాడు వాసు.

తన కష్టాలు తీరిపోయినట్టు భావించిందామె. తన భర్త తన బాధలను తీర్చి, తనను సుఖపెడతాడనుకున్నది. అందుకే గువ్వలా అతని గుండెల్లో ఇమిడిపోయింది. అతడి కౌగిలిలో కరిగిపోయింది. మర్నాడు ఉదయమే పేపర్ చదువుకుంటూ ఉన్నాడు వాసు. వందన లోపల పనిచేసుకుంటూ ఉంది. కొద్ది




సేపటికి సుందరమ్మ యధా ప్రకారం తన దండకం ఎత్తుకుంది. ఈమధ్య కొడుకుని కూడా లెక్క చేయకుండా, అతడు ఇంట్లో ఉన్నప్పుడే తిడుతోంది. అతడు ఇచ్చిన అలుసే అది.

వాసుకి రాత్రి వందన అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. తల్లిని మందలించాలను కున్నాడు.

"అమ్మా!" కుర్చీలో కూర్చునే పిలి చాడు వాసు.

"ఏం నాయనా" దగ్గరకు వచ్చి అడిగిందామె. ఆమె చంకలో మనుమరాలు ఉంది. కొద్ది క్షణాలు తటాపటాయించి అన్నాడు.

"ఎందుకమ్మా వందనను అలా అంటావు. ఏదయినా చెప్పదలచుకుంటే నిదానంగా చెప్పొచ్చు కదా! ఎప్పుడూ అలా తిట్టడం ఎందుకు?"

అతడి వైపు ఆశ్చర్యంగా చూసింది సుందరమ్మ. తర్వాత బుగ్గలు నొక్కు కొని అంది–

"పెళ్ళాం మీద ప్రేమ పుట్టుకొచ్చిం దయ్యో ఈయనకి. అయినా ఈయనగారి పెళ్లాన్ని నేను ఏమన్నాననో ఏమో! నామీద పడి ఏడుస్తున్నాడు" రాగం తీసి అంది సుందరమ్మ.

సుందరమ్మ అరుపులకు లోపలనుండి వచ్చింది జలజ.

"ఏమిటమ్మా! ఎందుకు అరుస్తు న్నావు?" అడిగింది జలజ.

"ఏముందమ్మా! ఈయనగారి పెళ్లాన్ని మనమేదో రాచి రంపాన పెడు తున్నట్టు ఈయన బాధపడిపోతున్నాడు. అందుకే అంటారమ్మా పెళ్ళామెమో బెల్లం, తల్లితండ్రి అల్లం అని. ఇటు వంటివాళ్ళని చూసే అని ఉంటారు ఆ సామెత" పెద్దగా అందామె.

"ఇప్పుడు ఆమె ఏమన్నదని ఆమెను ఆడిపోసుకుంటున్నావురా! నీకు రోజు రోజుకు బుద్ధి తగ్గిపోతోంది. కని పెంచిన తల్లి అని కూడా లేకుండా ఆమెనే తిడు తున్నావు" అంటూ అందుకుంది జలజ.

ఒక్క మాటకు వంద మాటలు వడ్డిం చడమనేదాన్ని నిజంచేసి తల్లీకూతుళ్ళు ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

లోపలినుండి ఈ మాటలన్నీ వింటోంది వందన.

తల్లిచేత ఇన్ని మాటలు అనిపించు కోవడంతో బాధ వేసింది వాసుకు. అంతే కాదు... అసహ్యంకూడా వేసింది.

మనిషితో మాట్లాడవలసివస్తే చివరి వరకూ మాట్లాడాలి. మాట్లాడుతూ తగ్గి పోతే అది ఎదుటివారికి మరింత అధి కారాన్ని ఇచ్చినట్టే. అదే జరిగిందిప్పుడు.

కొడుకు ఎప్పుడైతే తన నోటికి భయ పడ్డాడో, అప్పుడే తల్లి నోరు మరింత విచ్చలవిడిగా మారిపోయింది. కోడలిమీద పెద్దయెత్తున దండయాత్ర ప్రారంభిం చింది. అయితే ఈసారి ఆమె స్లోగన్ మారింది.

"చచ్చినదానా! ఇరవై వేలతో ఓ కుంటిదాన్ని అంటగట్టాడే మీ అబ్బ. చాతకానోడయి నా కొడుకు ఇరవై వేలకే ఒప్పుకుని చేసుకున్నాడు అప్పుడు. ఆ కట్నం మాకెట్లా సరిపోతుంది. వెళ్లి మీ అబ్బనడిగి మరో పదివేలు పట్రా" వంగదీసి పిడిగుద్దులు గుద్దటంకూడా ప్రారంభించింది.

భర్త చాతకానితనం అర్థంఅయింది వందనకు. అందుకే అత్తగారిని ఎదిరించ సాగింది.

కాని ఆధారంలేని తీగ గాలికి ఒరిగి

పోయినట్టు, భర్త ఆధారం లేనందున అత్తగారికి లొంగిపోవలసివచ్చేది. దానితో మరి కాసిన్ని ఎక్కువగా దెబ్బలు తగిలేవి.

దానితో మళ్ళీ భర్తను శరణు జొచ్చింది. అయితే అంతకుముందులా అత్తగారి గురించి ఏమీ చెప్పకుండా మాత్రం ఉండలేదు. తన భర్త తన విశాలమైన బాహుబంధంలో తననుంచు కొని అత్తగారినుండే కాదు, ఈ లోకాన్నుండే తనను రక్షించగలడనుకుంది. అందుకే అన్నీ చెప్పుకుని ఏడ్చింది.

"ఏమండీ! మీ అమ్మగారితో నేను పడలేకున్నాను. ఆమెగారి వలన నాకు బాధలెక్కువయినాయి. మీరే ఏదైనా ఆలోచించండి. నాకు మాత్రం ఈ బాధలు పడేదానికన్నా చనిపోవడమే మేలనిపిస్తోంది" అంది చివరికి.

తను ఏమయినా అంటే అమ్మ పెట్టే శాపనార్థాలు గుర్తుకువచ్చాయి వాసుకు. ఆమె నోటికి భయపడ్డాడు! అందుకే అన్నాడు–

"నేనేం చేసేది వందనా! ఇందుకు నేనేం చెయ్యగలను?"

మిన్ను విరిగి మీదపడ్డంత ఆశ్చర్యంగా అతడివైపు చూసింది వందన. భార్య బాధల్ని తీర్చేందుకు ఏమి చెయ్యాలో తెలియనంత అమాయకుడా తన భర్త? సమస్య తెలిసీ దానికి పరిష్కారం ఆలోచించలేనంత అసమర్థుడా తన భర్త??

"మీ అమ్మగారిని కాసింత మందలించండి" నోరు పెగల్చుకుని అంది వందన.

'ఆమె నోటికే భయపడుతున్నాను. ఆమెను నేనేమీ అనలేను' మనసులోనే అనుకున్నాడు. కానీ పైకి మాత్రం బింకంగా అన్నాడు.

"సారీ... ఆమెను నేను ఏమీ అనలేను వందనా!"

అతడు బింకంగా అన్నా, అతడి మనసులోని పిరికితనం ఆమె గ్రహించ గలిగింది. అందుకే మరో సూచనచేసింది.

"పోనీ మనం వేరే కాపురం పెడితే ఎలా ఉంటుంది?"

ఆమెను దగ్గరకు తీసుకున్నాడు వాసు.

"నాకు... నాకెవరున్నారు? అన్నలా తమ్ముళ్ళా? మా అమ్మకు నేనొక్కణ్ణే. నేను ఒకణ్ణే ఉండి, మా అమ్మను విడిచి వేరే కాపురంపెడితే ఈ లోకం ఏమనుకుంటుంది? నువ్వే చెప్పువందనా?"

భర్త చేతుల్ని విదిలించి కొట్టింది వందన. కోపం, నిస్సహాయత ఆమెను చుట్టుముట్టాయి. ఆ ఇంట్లో ఇక తనను కాపాడేవారు ఎవరూ లేరన్నది ఆమెకు అర్థం అయిపోయింది.

తన భర్త తల్లిని ఎదిరించి భార్యను రక్షించుకోగల సమర్థుడు కాదు అన్నది ఆమె తెల్సుకున్నది. అందుకే బాధలని మౌనంగా భరించడం నేర్చుకున్నది.

భార్యను తల్లి పెట్టే బాధలు గమనిస్తూనే ఉన్నాడు. శాపనార్థాలు పెట్టడం, మొట్టడం, ఎవరూ లేనప్పుడు కొట్టడం రూపంలో ఉండేవి సుందరమ్మ పెట్టే బాధలు. వాసు అప్పుడప్పుడు అనుకునే వాడు-తల్లి పెట్టే బాధలు పడలేక భార్య ఎక్కడ ఆత్మహత్య చేసుకుంటుందోనని.

అయితే అలాంటిదేమీ జరగలేదు.

కానీ, ఓరోజు రాత్రి భర్త దరిచేరినప్పుడు వాసుతో అందామె–

"ఏమండీ! కొద్దిరోజులు మా అమ్మగారింటికి వెళ్ళిరావాలనుంది"





కొద్ది క్షణాలు ఆలోచించాడు వాసు. ఆమె కోరిక సబబుగానే తోచింది. అలా కొద్దికాలం పుట్టింటికెడితే, ఆరోగ్యం కొద్దిగా చక్కబడుతుందనుకున్నాడు. అందుకే ఒప్పుకున్నాడు.

"అలాగేలే వందనా...వెళ్దువుగానిలే"

"రేపు...రేపు వెళ్ళాలనుకుంటున్నానండీ" చెప్పింది వందన.

"రేపా!"

"అవునండీ...రేపే వెళ్తాను"

కాసేపు ఆలోచించి అన్నాడు, "సరే.. అలాగే వెళ్ళు"

"మీ అమ్మగారు ఒప్పుకుంటారా?"

"ఎలాగో నచ్చచెబుతానులే. మరి ఎప్పుడు తిరిగొస్తావు?"

"ఓ పదిరోజులు ఉండి తిరిగొస్తాను"

"తొందరగా రావాలి"

"సరే"

"అయితే రేపు సాయంత్రం ఆఫీసు నుండి తిరిగి వచ్చిన తరువాత బస్సు ఎక్కిస్తాను...సరేనా?"

"అలాగే"

భార్యను దగ్గరకు తీసుకున్నాడు వాసు. అతడి కౌగిలిలో కరిగిపోయింది వందన.

* * *

ఉదయమే తల్లికి చెప్పాడు వాసు-వందన ఊరెళ్ళాలని అంటోందని. సుందరమ్మ వద్దని చెప్పాలని చూసింది. కానీ అందుకు అంగీకరించకుండా నచ్చ చెప్పాడు వాసు.

చివరికి ఒప్పుకోక తప్పలేదు సుందరమ్మకు. కానీ ఆమెకో అనుమానం పట్టుకుంది. వందన ఇక ఎప్పటికీ పుట్టింటి నుండి తిరిగి రాదేమోనన్నది ఆమె అనుమానం.

అందుకే ఆమె సంవత్సరం వయసున్న మనుమరాలిని దగ్గరుంచుకుంటానన్నది, అనుమానం బయటపెట్టకుండానే. కారణం మాత్రం మరొకటి చెప్పింది. ఆ పిల్ల లేకపోతే తనకు కాలక్షేపం కాదన్నది ఆమె చెప్పిన కారణం.

పిల్లదానికి ఎలాగూ పోతపాలే. తనెలాగూ వారంరోజులలో వచ్చేస్తుంది. అందుకే పిల్లదానిని తీసుకెళ్ళేందుకు వందన కూడా ఎక్కువ బలవంత పెట్టలేదు.

సాయంత్రం ఆఫీసునుండి తిరిగి వచ్చే టప్పటికి రెడీఅయివుంది వందన. ఆమెను తీసుకుని రిక్షా ఎక్కాడు వాసు.

"మళ్ళీ ఎప్పుడొస్తావు?" అడిగాడు వాసు.

"వారం పదిరోజులలో వచ్చేస్తాను"

"తొందరగా వస్తావు కదూ" ఆమె చేయిపట్టుకుని అడిగాడు వాసు.

ఎందుకో అలా అడగాలనిపిస్తోంది ఆమెకు.

భర్త చేయి గుండెలకు ఆనించుకుంది వందన. "తన భర్తకు తనమీద ఎంత ప్రేమ ?" తలచుకుంటే ఆమె మనసు పరవశమవుతోంది. కానీ భర్త తనను బాధలనుండి తప్పించలేని అసమర్థుడు అని అనుకుంటే గుండెల్లో కొద్దిగా కోపం వేస్తోంది. కానీ ఆ కోపాన్ని ప్రేమ జయిస్తోంది. ఆ ప్రేమ చివరకు జాలిగా రూపాంతరం చెందుతుంది.

"అవునులే....ఆయన మాత్రం ఏమి చేస్తాడు? తల్లిని ఎదిరించలేడు. తనను సుఖపెట్టాలని మనసులో వుంటుంది. కానీ ఏం చెయ్యగలడు? తల్లిగారి నోటికి భయపడతాడు"

పిరికివాడిమీద చివరికి భార్య కూడా

జాలిపడుతుంది.

రిక్షా బస్టాండు దగ్గర ఆగింది. బస్సు ఇంకా రాలేదు.

"వందనా! టిఫిన్ తిందాం రా!"

వందన చిత్రంగా చూసింది వాసు వంక.

ఆడవాళ్ళతో కలిసి హోటల్ లో భోంచెయ్యాలంటే సిగ్గుపడతాడు వాసు. పెళ్ళయిన మొదట్లో ఎప్పుడయినా సినిమాకెళ్ళినపుడు హోటల్‌కి వెళ్దామని బలవంతం చేసేది వందన. తనకు ఇష్టం లేదని చెప్పేవాడు వాసు. అది గుర్తుకు వచ్చింది వందనకు.

"ఇదేమిటి...ఈరోజు మీకు హోటల్ కెళ్ళాలని బుద్ధిపుట్టింది" నవ్వుతూ అందామె.

"ఏం?" అడిగాడు వాసు.

"ఆడవాళ్ళతోకలసి హోటల్‌కివెళ్ళరు కదా మీరు"

మనసులో ఏవో భావాలు కదలాడుతోంటే, ఆ భావాలకు స్పష్టమైన అర్థం తనకే తెలియకుంటే తనేమని చెబుతాడు? తన మనసు ఏమని విప్పి చెప్పుతాడు ??

"ఏమిటో వందనా! ఈరోజు నీతో కలసి టిఫిన్ తినాలనిపిస్తోంది"

"సరే...పదండి. ఇన్నాళ్ళకు మీకో మంచి బుద్ధి పుట్టింది"

ఇద్దరూ హోటల్‌కేసి నడిచారు.

టిఫిన్ తింటూ వందన వంకే చూస్తున్నాడు వాసు. అది గమనించింది వందన. ఈరోజు భర్త ప్రవర్తన ఎందుకో చిత్రంగా తోస్తూ వుందామెకు.

"ఏమిటలా చూస్తున్నారు?"

"ఏమిటో... నిన్నలాగే చూడాలనిపిస్తోంది"

"భలేవారే! అలా అయితే రేపు ఊరి నుండి వచ్చిన తర్వాత ఆఫీసు మానేసి నా ఎదురుగా కూర్చొని నా ముఖం వంకే చూస్తూ వుండండి...సరేనా"

నవ్వాడు వాసు. టిఫిన్ తినేసి ఇవతలకు వచ్చారు. అప్పటికే బస్సు వచ్చి వుంది. బస్సు దగ్గరకు నడిచారు ఇద్దరూ.

"వందనా....ఈరోజుకు వెళ్ళకపోతేనేం" ఆమె చెయ్యి పట్టుకుని అన్నాడు వాసు.

ఆమెకు కూడా అలాగే అనిపిస్తోంది- ఈరోజు ప్రయాణం మానేస్తే బావుంటుందని. కానీ ఈరోజు ప్రయాణం మానేస్తే రేపు అత్తగారు తనను అసలు పంపించరు. ఇంత దూరం వచ్చి ప్రయాణం మానుకోవడమేమిటి? పిచ్చి ఆలోచన కాకపోతే.

"ఒక్క వారం రోజులలో వచ్చేస్తానుగా!" బస్సు ఎక్కేసింది వందన.

ఎందుకో జీవితం నుండే విడిపోయినంతగా బాధవేస్తోంది వందనకు.

బస్సు కదిలింది.

బస్సు కనుమూపు దాటేంతవరకూ వుండి వెనుదిరిగాడు భారమైన మనస్సుతో. అప్పుడే సందె చీకట్లు ముసురుకుంటున్నాయి.

ఇంటికొచ్చి భోంచేసి మంచం ఎక్కాడు వాసు.

రాత్రి పది గంటలయి వుంటుంది. ఎవరో తలుపుతట్టిన చప్పుడు కావడంతో తలుపు తీశాడు వాసు. ఎదురుగా ఓ వ్యక్తి ఉన్నాడు.

"మీ పేరేనా వాసు?" అడిగాడు అతడు. తలూపాడు వాసు.

"మీరు కొద్దిగా పెద్దాస్పిటల్ వరకూ రావాలి. ఓ పేషంట్ మీ పేరు చెప్పారు"

"ఎవరు?" ఆశ్చర్యంగా అడిగాడు





వాసు.

"ఆమె పేరు వందన. ఓ బస్సు యాక్సిడెంట్ అయింది. అందర్నీ హాస్పిటల్‌లో చేర్చారు"

"ఏ వూరి బస్సు?" అడిగాడు వాసు.

చెప్పాడు అతడు.

తల్లికి చెప్పి షర్టు వేసుకుని పరు గెత్తాడు అతడు.

హాస్పిటల్ చేరేటప్పటికి పదిహేను నిమిషాలు పట్టింది.

వళ్ళంతా కట్లతో, నెత్తురు ఎక్కిస్తూ బెడ్‌మీద పడివుంది వందన. పక్కన సుమారు ఓ ఇరవై బెడ్‌లపై పేషంట్‌లు కూడా అదే స్థితిలో వున్నారు. వాళ్ళంతా బస్సు యాక్సిడెంట్‌లో గాయపడినవారే.

కాసేపటికి స్పృహలోకి వచ్చింది వందన. అది చావు ముందు వచ్చే తెలివి. కన్నులు తెరచి వాసు వంక చూసింది వందన. ఆమె నిర్జీవంగా నవ్వింది.

ఆమెను చూస్తోంటే ఏడుపు వస్తోంది అతడికి. ఆమె తలను తన చేతుల్లోకి తీసు కున్నాడు వాసు. ఆ తల అంతా కట్లే.

ఆమె అతడి వంక ఆప్యాయంగా చూసింది. ఏదో చెప్పాలని ప్రయత్ని స్తోంది ఆమె.

ఒకటి.... రెండు... మూడు.

ఆమె తల వాలిపోయింది. ఆమె ప్రాణం పరలోకాలకు ఎగిరిపోయింది.

ఆ తర్వాత జరగవలసినవన్నీ జరిగి పోయాయి.

'ఈ లోకం బాధల నుండి విముక్తి చెందిపోయింది తన భార్య! ఆమెను కాపాడుకోలేని తన పిరికితనాన్ని, తననూ అసహ్యించుకొందామె' అనే భావం అతని మనసులో మిగిలిపోయింది.

* * *

"నీకో శుభవార్త చెప్పేదా గురూ" అన్నాడు శంకరం.

"ఏమిటి?''

''మన ఎమ్మెల్యే కుమారి మాణి క్యాంబ నన్ను ప్రేమిస్తోంది గురూ"

"మన ఎమ్మెల్యే మాణిక్యాంబా!నిన్ను ప్రేమిస్తోందా?" రాబోయే నవ్వుని బల వంతంగా ఆపుకున్నాడు వాసు.

''అవునులే గురూ! నా బోటివాడు ఏది చెప్పినా నీకు నవ్వుగానే వుంటుందిలే"

"సరే...నీమాట నిజమని నమ్ముతాను. ఆమె నిన్ను ప్రేమిస్తోందని నీకెలా తెలిసింది'' ఈయనగారి ప్రేమకల్పనకు పునాది ఎక్కడో తెలుసుకుందామని అడిగాడు వాసు.

"కళాసమితికి నేను అధ్యక్షుడినని నీకు తెలుసుకదా! నిన్న మేము ఏర్పాటు చేసిన డాన్సుప్రోగ్రాంకు మన ఎమ్మెల్యే కుమారి మాణిక్యాంబను ముఖ్యఅతిథిగా ఆహ్వానించాము. ఆమె బహుమతి ప్రదానంచేసిన తర్వాత నా భుజంమీద చేయివేసింది. 'మిస్టర్ శంకరం ఈ దేశానికి మీ లాంటివాళ్లు ఎంతో అవసరం. మీలాంటివాళ్ళు ఇలాంటి కళాసమితులు ఎన్నో ఏర్పాటుచేసి దేశాభివృద్ధికి తోడ్ప డాలి' అన్నది. ఆమె అలా అన్నందుకు కాదు కానీ, నా భుజంమీద చేయివేసింది చూడూ..అది ఇపుడు నాకు ఓ ప్రశ్నగా మిగిలిపోయింది. ఓ పెళ్ళికాని ఆడది, ఓ పెళ్ళికాని మగాడి భుజంమీద చేయి వేసిందంటే, ఆమె తన ప్రేమను అంత కన్నా వివరంగా ఎలా చెప్పగలదు గురూ! సో! ఆమె నన్ను ప్రేమిస్తోంది. రోమియో, జూలియట్‌ల ప్రేమలా మాది 'లవ్ ఎట్ ఫస్ట్‌సైట్' ' ఈ అందగాడిని



తొలిచూపులోనే ప్రేమించిందామె.అందుకే తన ప్రేమను వ్యక్తంచేసేందుకే నా భుజం మీద చేయివేసింది" పొంగిపోతూ అన్నాడు శంకరం.

"ఓరి పిచ్చివాడా! రాజకీయరంగంలో వున్నవాళ్ళురా వాళ్ళు. భుజంమీద, నెత్తి మీద ఎక్కడైనా చెయ్యిపెట్టగలరు' మనసులోనే అనుకున్నాడు వాసు... అతడితో ఆ మాట ఎదురుగా అనలేక.

ఇంతకీ ఈ కొత్త ప్రియురాలిని శ్రీకృష్ణుని వర్ణం, నీలమేఘశ్యామం. నీలాకాశంలా నల్లని కురులు, తెల్లని మేఘాలలా అక్కడక్కడ కొద్దిగా తెల్ల బడ్డ జుట్టు. ఆమె మేధాసంపత్తిని తెలియ చేస్తూ ముక్కున కళ్ళద్దాలు, తమ తెల్ల దనాన్ని చూపించాలని కాస్త ముందుకు వచ్చిన ముత్యాల్లాంటి పలువరస. కాసింత లావేగానీ మాణిక్యం అందవిహీనకాదు.

ఈ జ్యోతికి అందం వుండొచ్చు. కానీ మాణిక్యంకి వున్నంత హుందాతనం వుందా! మాణిక్యం కారు దిగుతుంటే ఎంత హుందాగా దిగిందీ! ఈ జ్యోతికి అంత హుందాతనం వుందా? అందుకే ఈ జ్యోతి ముఖం ఇక చూడడు! ఆమెను గురించి ఇక అనుకోడు. ఇకనుండి మాణిక్యమే తన ప్రాణం, జీవం, సిరి, సర్వం. గుండెలమీద చేయి వేసుకుని పరవశంగా అనుకున్నాడు శంకరం లోలోపలే పొంగిపోతూ!

''పోనీ ఒక బాధ తప్పిపోయింది. ఇక నీడి నోటినుండి 'నా ప్రియురాలు జ్యోతి, నా ప్రేయసి జ్యోతి' అనే దరిద్రపు మాటలు వినపడవు" ఆనం దించాడు వాసు.

"గురూ! మాణిక్యమే నన్ను పెళ్ళి చేసుకుంటే నా స్థితే మారిపోతుంది. అప్పుడు ఈ పాడు వుద్యోగం మానే స్తాను. నా మాణిక్యంతోపాటు ఆమె కారులో సభలకు, సన్మానాలకు వెళ్తుం టాను. ఆమె శాసనసభకు వెళ్ళితే ఇంట్లో వుండి అన్నీ సర్దిపెడతాను" ఆనందంగా చెప్పుకుపోతున్నాడు శంకరం.

"గురూ! మాణిక్యాంబను ప్రేమిం చేందుకు, ఎప్పటిలాగే మీ సహకారం నాకు కావాలి" అన్నాడు చివరికి.

'అలాగే! ఇటువంటి విషయాలలో నీకెప్పుడూ నా సహకారం అందిస్తాను"

''థాంక్స్ గురూ....థాంక్స్" చేయి కుదిపేసాడు శంకరం. మరి కాసేపు అక్కడే కూర్చుని తన సీట్లోకి వెళ్ళి పోయాడు శంకరం.

రిలీఫ్‌గా ఫీలయ్యాడు వాసు.

* * *

సాయంత్రం వాసు దగ్గరకు వచ్చాడు ఆనంద్.

స్వప్న ఆడుకోను పక్క ఇంటికి వెళుతోంది. స్వప్నను దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు ఆనంద్.

"గడ్డం గుచ్చుకుంటుంది అంకుల్" అంది స్వప్న.

నవ్వి వదిలేశాడు ఆనంద్. లోనుండి వచ్చి అతడి ఎదురుగా కూర్చున్నాడు వాసు.

"వాసూ...ఆ పిల్లను తల్లిలేని పిల్లలా పెంచకపోతే, మరో పెళ్ళి చేసుకో కూడదా" అన్నాడు ఆనంద్.

వాసుకు వెంటనే జ్యోతి గుర్తుకు వచ్చింది. మౌనంగా ఉండిపోయాడు.

"నేనడిగినదానికి సమాధానంచెప్పవేం"

"ఏదో! పెళ్ళిమీద మనసుపోలేదు"

"మరి ఆ అమ్మాయి తల్లిలేని పిల్లలా పెరగాల్సిందేనా?"

"ఆ వచ్చే సవతి తల్లి చేతిలో కష్టాలు పడేకన్నా ఇలా తల్లిలేని పిల్లలా పెరగ టమే మేలులే"

"మరి నీ బతుకు! నువ్విలా ఎంత కాలం ఉండదలచుకున్నావు?"

"సాగినంతకాలం!"

"మరీ ఫూల్‌లా ఆలోచిస్తున్నావు! నీగురించి నువ్వు ప్రాక్టికల్‌గా ఆలోచించు" చెప్పాడు ఆనంద్.

నవ్వి మౌనంగా ఉండిపోయాడు వాసు.

"వాసూ...ఒంటరి బతుకుకు మించిన శాపం మరొకటిలేదు. ఒంటరితనానికి మించిన బాధలేదు. ఏ తప్పు చేశావని నువ్విలా బాధలు అనుభవిస్తున్నావో నాకు అర్థం కావడంలేదు"

జవాబు చెప్పకుండా కిటికీలోనుండి చూడసాగాడు వాసు.

"నీ మంచి కోరి గంటసేపటినుండి నీ గురించి నేను వాగుతుంటే నీపాటికి నువ్వు హాయిగా అలా పకృతినిచూసి పరవశించిపోతున్నట్టున్నావు" కోపంగా అన్నాడు ఆనంద్.

"అబ్బే...ప్రకృతినిచూసి పరవశించిపో లేదు. ఈ రాత్రికి మన ప్రోగ్రాం గురించి ఆలోచిస్తున్నాను...ఏ సినిమాకు వెళ్దామా అని''

"ఏ సినిమాకు వెళ్ళాలి అన్నదాని గురించి ఓ గంట ఆలోచించనవసరంలేదు గానీ ముందు నేనడిగినదానికి సమాధానం చెప్పు"

"ప్లీజ్ ఆనంద్! ఆ విషయం గురించి గట్టిగా అడగకు నన్ను. ఎందుకో పెళ్ళం టేనే విరక్తి కలిగింది నాకు. ఇంట్రెస్ట్ లేని ఆ విషయాన్ని గురించి తర్కించి అడిగి నన్ను బాధపెట్టకు. చాలాకాలం తర్వాత కలుసుకున్నాం మనం. ఈ కొద్దిరోజులు జాలీగా గడుపుదాం...ప్లీజ్"

"ఓకే. ఏదో స్నేహితుడివని, నీ మంచికోరి అన్నాను. అంతే తప్ప నిన్ను బాధపెట్టడం నా అభిమతం కాదు. ఓకే... లీవిట్"

వాసు ముఖం కడుక్కున్నాడు. పని మనిషిని రాత్రికి ఇంటి దగ్గరే పడుకొమ్మని చెప్పి ఇద్దరూ వీధిలోకి వచ్చారు.

ఇద్దరూ ఓ సినిమాకు వెళ్ళారు.

సినిమా వదిలిన తర్వాత ఆనంద్ అడిగాడు.

"వాసూ! డ్రింక్ అలవాటుందా?"

"బీర్ మాత్రం తీసుకుంటాను"

ఇద్దరూ బార్‌లోకి వెళ్లారు. తనకు విస్కీ, వాసుకు బీర్ ఆర్డర్ చేశాడు ఆనంద్.

"ఢిల్లీకి వెళ్ళిన తరువాత డ్రింక్ బాగా అలవాటు చేసుకున్నావా?" అడిగాడు వాసు.

"లేదు...ఎప్పుడైనా కంపెనీ కోసం తీసుకుంటాను" చెప్పాడు ఆనంద్.

డ్రింక్ పూర్తయిన తర్వాత ఇద్దరూ భోంచేసి గదికి చేరుకున్నారు. పక్కలు సర్దుకుని పడుకున్న తర్వాత, వాసు మాటల మధ్యలో అన్నాడు.

"జ్యోతి గురించి తెలుసా నీకు?"

"ఏ జ్యోతి?"

"ఇంకే జ్యోతి...ఆ జ్యోతే! మన క్లాస్‌మేట్"

"ఓ...నీ జ్యోతా! ఎక్కడుంది ఇప్పుడు?"

"ఇక్కడే వుంది. ఈ ఊళ్ళోనే"

"ఏం చేస్తోంది?"

"ఆమె ఇప్పుడు మాకు ఆఫీసర్"

"వాట్?" అదిరిపడ్డాడు ఆనంద్.




అతడి ముఖంలో ఆశ్చర్యం.

"ఆమె ఇప్పుడు మీ ఆఫీసరా?"

"యస్"

"ఆమె నిన్ను పలకరించిందా?"

"ఆ..పలకరించింది. ఆనాటి సంఘటన లన్నీ ఆమె మనసులో వున్నట్టున్నాయి. అందుకే నా మీద పగబట్టినట్టుగా ప్రవరిస్తోంది"

"అంటే ఒకనాటి ఆమె ప్రేమ, ఈనాడు పగగా మారిందన్నమాట" సాలోచనగా అన్నాడు ఆనంద్.

"మంచిగా గదిలోకి పిలుస్తుంది. 'మిమ్మల్ని ట్రాన్స్ఫర్ చేయిస్తాను. సస్పెండ్ చేస్తాను' అని బెదిరిస్తుంది. ఒకసారయితే యాంటీకరప్షన్‌వాళ్ళను నా మీదికి ఉసికొల్పింది. నేను లంచగొండిని కాదు కాబట్టి సరిపోయింది. లేకుంటే నేను శ్రీకృష్ణ జన్మస్థానంలో వుండి వుందును ఈసరికి"

"ఓహో...అంత పగతో వుందా ఆమె! ఉండదా మరి. ఆరోజు ఆమె ప్రేమను తిరస్కరించావు. ఆమె హృదయంలో ప్రేమస్థానంలో పగ పెరిగింది. అందుకే నీ మీద ప్రతీకారం తీర్చుకుంటోంది. ఆరోజు చిన్నపిల్లవాడికి చెప్పినట్టు చెప్పాను నీకు. జ్యోతిని పెళ్ళి చేసుకోరా అని. కానీ ఆనాడు కులమన్నావు, గోత్ర మన్నావు. ఆ కులం, గోత్రం ఈనాడు నీ జీవితాన్ని బాగుచేస్తున్నాయా? చెయ్యవు. అందుకే ఇప్పుడు ఏడుస్తూ కూర్చో" కోపంగా అన్నాడు ఆనంద్.

"నిజమే అనంద్! అప్పట్లో కులం గోత్రం అనుకుని మంచి ప్రేయసిని పోగొట్టుకున్నాను. కులమే కాదు అప్పట్లో మా అమ్మను గురించి కూడా భయ పడ్డాను. నేను కులాంతర వివాహం చేసు కుంటే మా అమ్మ ఏ నూతిలో పడుతుందో అని భయపడ్డాను. అప్పటి నా పిరికితనానికి ఇప్పుడు నిజంగా సిగ్గు పడుతున్నాను"

అప్పుడే ఆనంద్ మనసులో ఓ ఆలోచన కలిగింది. అప్పట్లో వాసు తన తల్లికి భయపడి కులం, గోత్రం అని జ్యోతిని పోగొట్టుకున్నాడు. ఇప్పుడు ఆ తల్లి లేదు. చనిపోయింది. మరి వారి ప్రేమకు ఇప్పుడుమటుకు అడ్డం ఏముంది? అయినా ఇంకా ఇతగాడికి ఆ కులాలపిచ్చి వుందా? అదే అడిగాడు.

"అయితే ఇప్పుడు నీకు ఆ కులాల పిచ్చి లేదంటావు?"

"మా అమ్మతోనే ఆ కులం భయం పోయింది నాకు"

'ఓ లైన్ క్లియర్' మనసులోనే ఆనందించాడు ఆనంద్. 'అంటే ఇప్పుడు వాసు కులాంతర వివాహమైనా చేసుకుంటా దన్నమాట. జ్యోతిని పెళ్ళి చేసుకునేందు కైతే ఎగిరి గంతేసి ఒప్పుకుంటాడు అవును. ఓ ఆఫీసర్‌ని పెళ్ళిచేసుకునేందుకు ఏ క్లర్క్ మాత్రం ఒప్పుకోడు. కానీ ఇప్పుడే వాసుకి ఆ ఆశ కలిగించకూడదు. ముందు ఆ వైపునుండి గ్రీన్‌సిగ్నల్ అందుకోవాలి. తనకన్నా తక్కువస్థితిలో ఉన్నవాడిని ఆమె పెళ్ళి చేసుకునేందుకు అంగీకరిస్తుందా? ఆనాటి ప్రేమ ఆమె మనసులో వుంటే తప్పక ఈ పెళ్ళికి అంగీకరిస్తుంది. ఆమె ఇంతకాలం పెళ్ళి చేసుకోలేదంటే బహుశా ఆ ప్రేమను మరచిపోలేక అలాగే వుండిపోయి వుండొచ్చు. అందుకే ఎలాగైనా ఈ జంటను కలపాలి- మనసులోనే అను కున్నాడు ఆనంద్.

ఉదయం కాఫీ తాగుతూ ఆనంద్

అన్నాడు-

"వాసూ! రాత్రి చెప్పడం మరచిపోయాను. ఈరోజు మా మరదలు పుట్టిన రోజట. ఈరోజు మా ఇంటికి భోజనానికి రావాలి నువ్వు. సాయంత్రం ఆఫీసు వదిలిన తర్వాత అక్కడికి వచ్చేసేయి. ఏమంటావు"

"అలాగే...వస్తాను" చెప్పాడు వాసు.

వెళ్ళిపోయాడు ఆనంద్. వాసు డ్రెసప్ అయి స్వప్నను తీసుకుని బయలుదేరాడు. దారిలో స్కూల్ దగ్గర స్వప్నను వదిలి ఆఫీసువేపు నడుస్తున్నాడు వాసు.

"హలో" ఓ మృదుమధుర స్వరం. తనకు పరిచిత కంఠం. తనకు ఎంతో ఇష్టమైన స్వరం.

వెనుతిరిగి చూశాడు వాసు.

అవతలి వేపునుండి నడిచివస్తోంది జ్యోతి. అతడి గుండె లయ తప్పింది. అతడి శరీరం పులకించింది.

జ్యోతి దగ్గరగా వచ్చింది.

"ఆఫీసుకు వెళ్తున్నారా?" అడిగింది జ్యోతి.

"అవునండి"

ఆమె అతడిపక్కనే నడవసాగింది.

"నేనూ ఆఫీసుకే బయలుదేరాను. అదిగో...ఆ వీధిలో నా స్నేహితురాలు ఉంటే చూసివెళ్దామని వచ్చాను. ఆఫీసుకు ఇంకా టైము వుందికదా! రండి...కాఫీ తాగుదాం" ఇన్వయిట్ చేసింది జ్యోతి.

పులకరించిపోయాడు వాసు.జ్యోతితో కలిసి కాఫీతాగే అదృష్టం ఇక ఈ జన్మకు కలుగుతుందనుకోలేదు తను.

ఓ పెద్ద హోటల్‌లోకి అడుగుపెట్టారు ఇద్దరూ. ఫ్యామిలీరూమ్‌లో కూర్చున్నారు.

బేరర్ రాగానే కావలసినవి ఆర్డర్ ఇచ్చింది జ్యోతి.

"స్వప్న బాగుందా?" అడిగింది జ్యోతి.

"ఆ....బాగుంది" చెప్పాడు వాసు.

ఆర్డర్ ఇచ్చినవి తెచ్చి టేబిల్‌మీద పెట్టాడు బేరర్. ఇద్దరూ తినసాగారు.

"నన్ను పెళ్ళిచేసుకోవాలని చాలామంది ఉత్సాహపడుతున్నారు. నిన్న ఓ బాంక్ జనరల్ మేనేజరట చెప్పి పంపాడు. నేను ఇష్టపడితే పెళ్ళిచేసుకుంటాడట"

మౌనంగా వినసాగాడు వాసు.

"వేరే ఆయన జిల్లా డి.యస్.పి.అట ఆయన. ఆయనకూడా మనిషిని పంపాడు. ఇష్టమయితే జాబు రాయమన్నారు.అలాగే ఓ ఎమ్మెల్యే కూడా తన కొడుకుకోసం కబురు పంపించాడు. ఇలా చాలామంది నన్ను పెళ్ళి చేసుకుంటామని వస్తున్నారులే!"

ప్లేట్‌లో వున్నది తినాలనిపించలేదు వాసుకు.

"నా విషయం సరే! మీ భార్య చనిపోయిందికదా...మరి మీరు రెండో పెళ్ళి ఎందుకు చేసుకోకూడదు?" అడిగింది జ్యోతి.

"ఇష్టం లేకపోయింది" విసుగ్గా అన్నాడు వాసు. ఆమె ఏది ఎత్తుకున్నా అది తనకిష్టంలేని టాపిక్ గురించే మాట్లాడుతుంది. కడుపునిండా పెట్టి కత్తితో పొడపడమంటే ఇలాగే కాబోలు.

"మీకు పెళ్ళిచేసుకునే ఉద్దేశంవుంటే నాకు చెప్పండి. నాకు తెలిసిన ఓ అమ్మాయి ఉంది. చాలా అందంగా వుంటుంది. మీ కులమేలెండి"

తనను బాధించటమే ఆమె ఉద్దేశం కాబోలు.

బేరర్ తెచ్చిన బిల్లు తను అందుకున్నాడు వాసు.




జేబులోనుండి పర్స్ తీసి డబ్బు ప్లేట్‌లో వేశాడు. జ్యోతి బిల్లు తను ఇస్తానని మాటవరసకయినా అనలేదు.

"ఆఫీసుకు టైమయినట్టుంది. నేను వస్తాను" లేచి వెళ్ళిపోయింది జ్యోతి.

జ్యోతిని కలిసినపుడు వున్నంత ఆనందం లేదు వాసులో ఇపుడు.

కాళ్ళీడ్చుకుంటూ ఆఫీసువైపు నడిచాడు వాసు.

నిస్సత్తువగా కుర్చీలో కూలబడ్డాడు.

"గురూ! ఈ నెలాఖరులో నా పెళ్ళి. ఇదిగో ఆహ్వానపత్రిక" ఓ కార్డు వాసు చేతిలో పెడుతూ అన్నాడు శంకరం.

"నీ పెళ్ళా! ఇంత హఠాత్తుగా ఎలా సెటిలయింది. పెళ్ళని నిన్న కూడా మాతో అనలేదే! ఇంతలోనే ఈ పెళ్ళి పత్రికలు" ఆశ్చర్యంగా అన్నాడు వాసు.

"నిన్న సాయంత్రం వరకూ నా పెళ్ళి గురించి తెలియదు గురూ! నిన్న సాయంత్రం వరకూ మా నాన్న నాపాలిటి యముడిలా వూరినుంచిదిగాడు. 'ఇవిగోరా! నీపెళ్ళి పత్రికలు. ఈ నెలాఖరులో నీపెళ్ళి నిశ్చయించేశాను. అమ్మాయిని కూడా చూసి వచ్చాను. అందంగానే వుంది. కాకుంటే ఓ కన్ను కొద్దిగా మెల్ల. అందుకు ఓ పదివేలు ఎక్కువగా కట్నం ఇస్తున్నారు. ఈ పత్రికలు నీ స్నేహితులకు ఇవ్వు. ముహూర్తానికి రెండురోజులు ముందుగా వచ్చెయ్యి' అని ఆర్డర్ జారీ చేసి వెళ్ళాడు గురూ!

"అదేమిటీ...నీకు కాబోయే భార్యను నువ్వింతవరకూ చూడలేదా?" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"మా నాన్న చూశాడుగదా! అది చాలట నాకు కాబోయే భార్యను నేను చూసుకోవాలిగా నాన్నా – అని అడిగితే 'ఏముందోయ్ చూసేది. ఎలాగూ తాళి కట్టేప్పుడు చూస్తావుగా! అయినా అమ్మాయిని నేనుచూసాను చాలదటోయ్! అమ్మాయి బాగాలేకపోతే నేను ఒప్పుకుంటానా? కాకపోతే కాస్త నలుపు, కొద్దిగా చాలాకొద్దిగా ఎత్తు పళ్ళు, పెద్ద లావు కాదనుకో! మన ఎమ్మెల్యే మాణిక్యాంబలేదూ అచ్చం అలా గేవుంటుం దోయ్! అయినా అందం ఏముందోయ్... ఈరోజు వుంటుంది రేపు పోతుంది. అమ్మాయి గుణవంతురాలు. వాళ్ళ తండ్రి బాగా కట్నకానుకలు ఇస్తున్నాడు. అవి చాలవటోయ్! ఇంకా ఏమిటి అమ్మాయిని చూసేది?' అన్నాడు మా నాన్న" కోపంగా అన్నాడు శంకరం.

"మరి నిన్న మాణిక్యాంబను ప్రేమిస్తున్నానని చెప్పావుగా మరి నీ ప్రేమ సంగతి మీ నాన్నకు చెప్పావా?" నవ్వుతూ అడిగాడు వాసు.

"మా నాన్నకా! మా నాన్న ప్రేమా గీమా అంటే తోలువలిచేస్తాడు. అందుకే నాప్రేమ గురించి మా నాన్నకు చెప్పలేదు. తరతరాలుగా ఈ పెద్దలందరూ ఇంతే గురూ! పిల్లల ప్రేమ గురించి తెలుసుకోరు. అలా ప్రేమను అర్థంచేసుకోక పోబట్టే చరిత్రలో రోమియో–జూలియట్, లైలా–మజ్నూ, సలీం – అనార్కలి, దేవదాసు-పార్వతిల ప్రేమకథలు అలా విషాదాంతంగా ముగిశాయి. అలాంటి ప్రేమకథలలో నాటి ఓ ప్రేమకథ..లీవిట్ మై ఫ్రెండ్. నా పెళ్ళికి నువ్వు తప్పక రావాలి"

"అలాగే తప్పక వస్తాను" అన్నాడు వాసు.

ఆరోజు సాయంత్రం ఇంటికి వెళ్ళబోయే ముందు అతడి దగ్గరకు వచ్చింది

శైలజ.

"ఏమండీ! ఈరోజు నా పుట్టిన రోజండీ. సాయంత్రం మా ఇంట్లో చిన్నపార్టీ వుంది. మీరూ రావాలి"

"సారీ శైలజగారూ! ఈరోజు నా ఫ్రెండ్ ఆనంద్ మరదలు పుట్టిన రోజని చెప్పాడు. ఈ రాత్రికి వాళ్ళింట్లో పార్టీ వుంది. నేనక్కడికి వెళ్ళాలి. ఈసారి తప్పక వస్తాను"

''మీ ఫ్రెండ్ మరదలు పుట్టినరోజా? ఎవరండీ ఆ ఫ్రెండ్?'' ఆరాగా అడిగింది.

"డిగ్రీలో నా క్లాస్‌మేట్ అండి! ఇప్పుడు ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నాడు. రెండురోజుల క్రితమే ఈ ఊరు వచ్చాడండి"

"ఎక్కడండి వాళ్ళ ఇల్లు" అడిగింది శైలజ.

చెప్పాడు వాసు.

"చూడండీ! ఇప్పటివరకూ నేను ఎప్పుడు, ఎక్కడకు పిలిచినా మీరు రాలేదు. ఈసారి మీరు తప్పకరావాలి. మీరు రాకపోతే నేను ఒప్పుకోను''

"చెప్తున్నాకదండి! నా ఫ్రెండ్ ఇంట్లో పార్టీవుందని. లేకుంటే తప్పక వచ్చేవాడిని''.

"నాకవన్నీ తెలియదండీ... మీరు ఈ పార్టీకి వస్తున్నారు"

"సారీ! నేను ఈ పార్టీకి రాలేను"

"మీరు తప్పక వస్తారు..నాకుతెలుసు" ఆమె తన సీట్లోకి వెళ్ళి కూర్చుంది.

"ఏమిటీ......ఈరోజు మీ ఇంట్లో పార్టీయా!" పక్క సీట్లో కూర్చునివున్న శైలజ వంక చూస్తూ అన్నాడు శంకరం.

"ఆ! పార్టీ! వస్తావా?" వెక్కిరింతగా అంది శైలజ.

"పిలిస్తే రాకుండా ఉంటానా" ఆమె వెక్కిరింతను అర్థం చేసుకోకుండానే అన్నాడు శంకరం.

"ముక్కు మూసుకుని ముప్పైఏళ్లు తపస్సు చెయ్యి. ఆ తరువాత పిలుస్తా పార్టీకి" విసురుగా అంది శైలజ.

తల దించుకుని వాసు దగ్గరకు వచ్చాడు శంకరం.

"శంకరం! రేపో మాపో పెళ్ళి చేసుకోబోతున్నావు. ఇంకా ఆ అమ్మాయిని ఆకర్షించాలని ప్రయత్నాలెందుకు?"

"ఏదో మగబుద్ధి కదా గురూ"

ఇద్దరూ ఆఫీసు నుండి ఇవతలకు వచ్చారు.

ఇంటికెళ్ళి స్నానం చేసి, పనిమనిషిని రాత్రికి పడుకోమని చెప్పి వీధిలోకి వచ్చాడు వాసు.

ఆనంద్ మామ కొత్తగా ఇల్లుకట్టుకుని అందులో చేరాడట. ఆనంద్ చెప్పిన అడ్రసు వెతుక్కుంటూ బయలుదేరాడు వాసు.

అదో చిన్న డాబా ఇల్లు. డోర్ నంబర్ మరోసారి సరిచూసుకుని లోనికి అడుగుపెట్టాడు వాసు.

అప్పుడే లోనుంచి ఇవతలకు వస్తూ ఉంది శైలజ. వాసుని చూసి ఆనందపడి పోయింది.

"చూశారా! ఈ పార్టీకి మీరు తప్పక వస్తారని చెప్పాను ... వచ్చారు" నవ్వుతూ అంది శైలజ. నవ్వలేక నవ్వాడు వాసు.

"మీకోసం రాలేదండీ! నా స్నేహితుడు ఆనంద్ అని ఢిల్లీలో పని చేస్తున్నాడు. అతడి ఇల్లు వెతుక్కుంటూ వస్తున్నాను. ఈ వీధి పేరే చెప్పాడు. బహుశా అడ్రసు పొరపాటు చెప్పినట్టున్నాడు. మీకు తెలిసి ఉంటే..."

అతడి ముఖం చూసి ఆమె ఫక్కున

నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నారు?" అడిగాడు వాసు.

"మీలాంటివాడెవడో గొర్రెపిల్లను చంకన పెట్టుకుని ఊరంతా వెతికాడట. అలా ఉంది మీ వాలకం. మీరు రావలసిన ఇంటికే వచ్చి, కావలసిన ఇల్లు ఎక్కడో చెప్పమంటే నేనేం చెప్పేది. నవ్వకోక ఏం చేసేది"

"అంటే ఈ ఇల్లు..." ఆగాడు అనుమానంగా.

"ఇంకా అర్థం కాలేదా? ఈ ఇల్లు మీ స్నేహితుడు ఆనంద్‌దే. ఆయన మా బావగారు. అంటే మా అక్క మొగుడు. ఆయన మరదలు శైలజను నేనే. ఇంకేమయినా విశేషాలు కావాలా!"

అప్పుడే లోపలినుండి వస్తున్నాడు ఆనంద్. వాసుని చూసి నవ్వుతూ దగ్గరకు వచ్చాడు ఆనంద్.

"ఏమిటోయ్! వాకిట్లోనే నిలబడి పోయావ్. రాలోపలికి" చేయి పట్టుకున్నాడు ఆనంద్. తరువాత శైలజ వైపు చూసి అన్నాడు—

"ఈవిడే నా మరదలు... శైలజ. ఈరోజు ఈమె పుట్టినరోజు. అందుకోసమే నిన్ను ఆహ్వానించింది. ఈమె ఇక్కడే ఏదో ఆఫీసులో టైపిస్ట్‌గా పని చేస్తోంది"

"ఏదో ఆఫీసులో కాదు బావా! వాళ్ళ ఆఫీసులోనే. అందులోనూ వాళ్ళ సెక్షన్ లోనే" నవ్వుతూ అంది శైలజ.

"ఓహో.... అలాగా! అయితే మీకు ఇంతకు ముందే పరిచయం ఉందన్న మాట"

"పరిచయమేకాదు...మంచి స్నేహం కూడా ఉంది" పూరించింది శైలజ.

ముగ్గురూ లోపలికి వెళ్లారు.

ఆనంద్ భార్య నీరజ పలకరించింది వాసును. ఆమెతో కాసేపు మాట్లాడాడు వాసు. వాసు భార్య చనిపోయినందుకు బాధపడిందామె.

ఆ పుట్టినరోజు పండుగకు వాళ్ళ బంధువులు పదిమంది వచ్చారు. వాసు ఒక్కడే ఆ కుటుంబానికి స్నేహితుడుగా వచ్చింది. విందు భోజనం మొదలయింది.

శైలజ వాసుకు ప్రత్యేకంగా వడ్డించింది.భోజనాలు పూర్తయిన తర్వాత వచ్చిన అతిథులందరూ ఒక్కొక్కరు వెళ్ళిపోతున్నారు.

వాసు, ఆనంద్ ఇద్దరూ మిద్దెమీదకు వెళ్లారు.

"ఆ నం ద్! నా కో అ ను మా నం వచ్చింది. నీరజ అప్పుడిలాగే ఇప్పుడూ నవలల కోసం నిన్ను తిప్పడం లేదు కదా!"

ఆనంద్ బిగ్గరగా నవ్వేశాడు.

"అంటే ఇప్పుడుకూడా నేను నవలల కోసం షాపు షాపు తిరుగుతున్నానను కుంటున్నావా! అలాంటిదేమీలేదు. ఆడది పెళ్ళికాకముందే మగాడిని ఏడిపిస్తుంది. పెళ్ళయిన తర్వాత సంసారబాధ్యతలతో కట్టుబడిపోతుంది"

తలూపాడు వాసు.

"అది సరే! ఇంతకీ నీ జ్యోతి గురించి ఏమయినా చెప్పు..వింటాను"

"ఏముంది చెప్పేందుకు! ఈరోజు దారిలో కనిపించి హోటల్‌కు తీసు కెళ్ళింది. 'ఆహా...ఏమి నా భాగ్యము' అని అనుకుంటూ ఆమె వెనుకే వెళ్లాను. లోపలికి తీసుకెళ్ళి, 'నన్ను ఆ డి.యస్.పి. పెళ్ళిచేసుకుంటానన్నాడు, ఈ బాంక్ జనరల్ మేనేజర్ పెళ్ళిచేసుకుంటా

నన్నాడు' అని తన సొంత డబ్బా కొట్టుకోసాగింది. నన్ను బాధపెట్టడమే ఆమెకు సంతోషంలా ఉంది"

"అలాగా" అన్నాడు ఆనంద్.

'అయితే రేపే ఆమెను కలుసుకోవాలి' మనసులోనే అనుకున్నాడు ఆనంద్.



"ఆనంద్! దయచేసి ఈ విషయాన్ని శైలజకు చెప్పకు. జ్యోతి, నేనూ ప్రేమించుకున్న విషయం ఆమె చెవిన చేరిందంటే ఇక ఆఫీసులో అందరికీ తెలిసిపోతుంది. అలా తెలియడం నాకిష్టంలేదు"

"అలాగేలే వాసూ! జ్యోతి విషయం శైలజకు తెలియనివ్వను" చెప్పాడు ఆనంద్.

అప్పుడే శైలజ అక్కడికి వచ్చింది.

"పాత స్నేహితులిద్దరూ ఇక్కడ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారా!" పక్కనే కూర్చుంటూ అన్నది.

ఆ తర్వాత కొద్దిసేపటికి సీరజ అక్కడికి వచ్చింది. నలుగురూ చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.

పదిగంటలయింది. వాసు లేచాడు.

"నేను వెళ్ళొస్తారా ఆనంద్!" చెప్పాడు వాసు.

"ఈ రాత్రికి ఇక్కడే పడుకోకూడదా" అన్నాడు ఆనంద్. శైలజ, సీరజ ఇద్దరూ అదేమాట అన్నారు.

"లేదు ఆనంద్! ఇంటిదగ్గర స్వప్న ఒక్కతే పనిమనిషితో ఉంది. రాత్రిళ్ళు లేచి ఏడుస్తుంది. అందుకే నేను వెళ్ళాలి"

"సరే..నీ ఇష్టం" అన్నాడు ఆనంద్.

ఆడవాళ్ళిద్దరకూ చెప్పి కిందకు దిగాడు వాసు. అతడి వెనుకే గేటు వరకూ వచ్చాడు ఆనంద్.

"ఆనంద్..మళ్ళీ ఎప్పుడు కలుస్తావు నన్ను" అడిగాడు వాసు.

"రేపు సాయంత్రం" చెప్పాడు.

"మరి నేను చెప్పిన విషయం గుర్తుంది కదా!"



"ఏ విషయం?'' అన్నాడు ఆనంద్.

శైలజకు నా గురించి, జ్యోతి గురించి చెప్పవద్దన్నాను గుర్తుందికదా!'' అన్నాడు వాసు.

''ఆ..గుర్తుంది.మీ విషయం వాళ్ళకు తెలియనివ్వనులే" చెప్పాడు ఆనంద్.

"రేపు తప్పక రావాలి నువ్వు"

"అలాగే'' అన్నాడు ఆనంద్"

వాసు రోడ్డెక్కాడు.

అప్పటికి టైము పదిన్నర అయింది.



7

సోఫాలో కూర్చుని ఆరోజు పేపరు చూస్తూ ఉంది జ్యోతి.

"అమ్మగారూ! మీకు ఫోన్" పని మనిషి వచ్చి చెప్పింది.

పేపర్ పక్కన పడేసి ఫోన్ దగ్గరకు వెళ్ళి రిసీవర్ ఎత్తుకుంది.

"హలో! జ్యోతి స్పీకింగ్"

"హలో జ్యోతిగారూ!గుడ్‌మార్నింగ్. నాపేరు ఆనంద్.డిగ్రీలో మీ క్లాస్‌మేట్‌ని. వాసు స్నేహితుడిని"

ఆమెకు వెంటనే ఆనంద్ గుర్తుకు వచ్చాడు. రౌడీలా, అల్లరి చిల్లరిగా తిరిగిన ఆనంద్ గుర్తుకువచ్చాడు.

"అలాగా! మీరు గుర్తున్నారులేండి నాకు. ఇంతకీ మీరు ఫోన్ చేసిన విషయ మేమిటో తెలుసుకోవచ్చా?'' అడిగింది జ్యోతి.

"మీతో ఓ అరగంటసేపు మాట్లాడా లండి! మీకు వీలయితే, ఓ అరగంట నా కోసం స్పేర్ చేయగలిగితే..."

"నాతో మాట్లాడాలా! ఏం మాట్లా డాలి?" ఆశ్చర్యంగా అడిగింది జ్యోతి.

''అది... నా ఫ్రెండ్ వాసు గురించి"

''అలాగా. సరే... అలాగే రండి" చెప్పింది జ్యోతి- అతడు చెప్పేదేమిటో విందామనే ఆసక్తితో.

"మరి ఎప్పుడు రమ్మంటారు?'' అడిగాడు అవతలి వ్యక్తి.

''ఇప్పుడు నేను లీరికే. ఆఫీసుకు పది గంటలకు వెళ్తాను. ఈలోపు ఎప్పుడు వచ్చినా మీతో మాట్లాడగలను" చెప్పింది జ్యోతి.

"అలా అయితే మరో గంటలో అక్కడికి రాగలను''

''సరే అలాగే రండి'' చెప్పింది జ్యోతి.

''థాంక్యూ'' అవతల ఫోన్ పెట్టే సిన శబ్దం అయింది. తనూ ఫోన్ పెట్టేసింది.

ఉషారుగా లేచి స్నానం చేసింది. టిఫిన్ తిని, డ్రాయింగ్‌రూంలో అతడి కోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

ఎనిమిది గంటలకు వచ్చాడు ఆనంద్. ఆమెను చూసి విష్ చేశాడు.

"రండి...కూర్చోండి'' ఎదురుగావున్న సోఫా చూపిస్తూ అన్నది. కూర్చున్నాడు.

''ఏం చేస్తున్నారిప్పుడు?" అతడి గురించి అడిగింది జ్యోతి. చెప్పాడు అతడు.

"మీ ఫ్రెండ్ గురించి నాతో ఏదో విషయం మాట్లాడాలని అన్నారు"

''అవునండీ! మీకు, వాసుకు మధ్య ఉన్న అగాథాన్ని పూడుద్దామని

 

వచ్చాను'' అన్నాడు ఆనంద్.

''ఓహో... వాసుగారు పంపారా!'' వ్యంగ్యంగా అంది జ్యోతి.

"పొరపాటుపడ్డారు! అతడు నన్ను పంపలేదు. అసలు నేనిక్కడకు వచ్చేది కూడా అతనికి తెలియదు. నా స్నేహితుడి మేలుకోరి నేనే వచ్చాను. మీరు నమ్మినా, నమ్మకపోయినా ఇది నిజం"

"అలా అయితే, మా మధ్య రాజీ కోసం మీకై మీరే వచ్చారన్న మాట" నవ్వుతూ అన్నది. "నేనింకా అతడు నా గురించి భయపడి మిమ్మల్ని రాజీ కోసం పంపారనుకున్నాను" ఆవాక్యాన్ని పూర్తిచేసింది.

"నా మిత్రుడు ఒకప్పుడు పిరికివాడు అయి ఉండొచ్చు. కానీ అతడిప్పుడు అంతటి భయస్థుడు కాడు. మీ గురించి అతడికి ఎలాంటి భయమూలేదు. కాకుంటే అతడు బాధపడుతున్నాడు. అదీ మీ గురించే'' ఆమె మాట ఆమెకే అప్పగించి నట్టుగా అన్నాడు.

''నా గురించి బాధ పడుతున్నారా? వాటే సిల్లీ. అతడు బాధపడేంత హీనమైనస్థితిలో లేనే నేను. మంచి హోదా ఉన్న ఉద్యోగం, సంఘంలో మంచి స్టేటస్ అన్నీ ఉన్నాయి. నాకేం హాయిగా ఉన్నాను"

"హోదా ఉండొచ్చు, స్టేటస్ ఉండొచ్చు. కానీ అవన్నీ మనిషికి గొప్పతనము కలిగిస్తాయే కాని, మానసిక తృప్తిని కలిగించవు. మీ మనసులోకి మీరోసారి తొంగి చూసుకొని నిజం చెప్పండి... మీరు మానసిక తృప్తిని అనుభవిస్తున్నారా. ఆలోచించుకోండి''

ఆమె ఓ క్షణం మౌనంగా ఉండి పోయింది– ఆ నిజాన్ని కాదనలేనట్టు.

కొద్దిక్షణాల తర్వాత ఆమే అంది–

"మరి మీరు ఏంచెప్పదలచుకొని వచ్చారో చెప్పండి?"

"మీరు ఏమీ అనుకోనంటే... మీరు బాధపడనని మాట ఇస్తే చెప్పగలను"

"అలాగే బాధపడనులేండి...చెప్పండి" నవ్వుతూ అందామె.

అతడు గొంతు సవరించుకుని, చెప్పడం మొదలుపెట్టాడు.

"ఒకప్పుడు వాసు తప్పు చేశాడు. తన పిరికితనంతో మిమ్మల్ని దూరంచేసు కున్నాడు. అందుకు అతడు ప్రతిదినం బాధపడుతూనే ఉన్నాడు. మిమ్మల్ని పోగొట్టుకున్నందుకు ఆ క్షణంనుండి అనుక్షణం కుమిలిపోతూనే ఉన్నాడు. తల్లిపోరుతో ఆ వివాహం చేసుకోవలసి వచ్చింది. తల్లిని కాదనలేని అశక్తతతో ఆ పెళ్ళి చేసుకున్నాడు. కానీ విధి క్రూరంగా దెబ్బతీసింది. అతడి భార్య యాక్సిడెంట్‌లో మరణించింది. అతడి తల్లి కూడా మరి కొద్దిరోజులకు మరణిం చింది. ఇది జరిగి మూడేళ్ళయింది. అప్పటినుండి అతడి బంధువులు అతడిని మళ్ళీ పెళ్ళిచేసుకోమని చెప్పినా, అతడు మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. అతడు నిన్ను మరచిపోలేకున్నాడు. అందుకే ఇంతకాలం అతడు మళ్ళీపెళ్ళి తలపెట్టలేదు.

"అటువంటి పరిస్థితులలో మీరు అతడికి కనిపించారు. మిమ్మల్ని చూసి అతడెంతో ఆనందపడిపోయాడు. కానీ మీరు అతడిని బాధించడమే ప్రధానంగా పెట్టుకున్నారు. అతడిని బెదిరించసాగారు. మీ బెదిరింపులకు అతడు భయపడలేదు. కానీ బాధపడుతున్నాడు.

"అలాగే మీరుకూడా అతడిని బాధ

పెడుతూ, మీరూ బాధపడుతున్నారు. మీరు ఇలా ఎంతకాలం ఒకరినొకరు బాధలు పెట్టుకుంటూ, బాధపడుతూ ఉంటారు. మీ ఇద్దరకూ ఒకరిమీద ఒకరికి ప్రేమ, అభిమానం ఇప్పటికీ ఉన్నాయి. అందుకే ఒకనాడు పోగొట్టుకున్న అవకాశాన్ని, ఈనాడు సద్వినియోగం చేసుకోండి. మీరిద్దరూ ఒకటయితే..."

"ఆనంద్‌గారూ...!" ఆశ్చర్యంగా అతడి వైపు చూసింది జ్యోతి.

"మీరూ ఆలోచించగలరు. ఆలోచించి ఒక నిర్ణయం తీసుకోండి"

జ్యోతి ఆలోచించింది. అయితే అతడు చెప్పిన విషయం గురించికాదు – వాసు గురించి. వాసు ఇంత హీనమైన వ్యక్తిత్వం కలిగినవాడా? తనకన్నా గొప్పస్థితిలో వున్న ఆడదానిని పెళ్ళిచేసుకుంటానని వ్యక్తిత్వం వున్న ఏ వ్యక్తీ చెప్పి పంపడు. ఒకనాటి ప్రేమను ఆధారం చేసుకుని ఈనాడు తనను పెళ్ళిచేసుకుని తన హోదాను పెంచుకోవాలనేంత నీచమైన ఆలోచన కలిగివున్నాడా వాసు?

తన పాత ప్రేమను గురించి నలుగురికీ చెప్పి వారి సానుభూతికోసం ప్రయత్నించకుండా, తన ప్రేమను మనసులోనే దాచుకున్నాడని అతడిమీద ఓ ఉన్నత అభిప్రాయం కలిగివున్నది తనింతవరకూ. కానీ ఇలా...?

అయినా ఆనంద్ ఇక్కడికి వచ్చే విషయం, వాసుకు తెలియదని ఆనంద్ చెప్పాడుకదా! అదీ కనుక్కుంటే...?

"అయితే మిమ్మల్ని జంట కలపాలని మీరు ఇక్కడికి రాబోయేముందు ఆ విషయమై మీ మిత్రుడి అభిప్రాయం తెలుసుకున్నారా? అందుకు మీ మిత్రుడు ఒప్పుకుంటాడా??"

"అతడి అభిప్రాయం కనుక్కోలేదు నేను. కానీ ఈ పరిస్థితులలో మిమ్మల్ని పెళ్ళిచేసుకోవడం తన అదృష్టంగా భావిస్తాడు"

"ఏమో! ఒకవేళ నన్ను పెళ్ళిచేసుకునేందుకు ఒప్పుకోడేమో?"

"అలా ఎందుకనుకుంటున్నారు మీరు! మీకు ఏం తక్కువని అతడు మిమ్మల్ని తిరస్కరిస్తాడు.మంచి హోదాలోవున్నారు, మంచి స్టేటస్‌లో ఉన్నారు"

'అదే...ఆ హోదాను చూసి పెళ్ళిచేసుకునేవాళ్ళంటేనే నాకు నచ్చనిది' మనసులోనే అనుకున్నది జ్యోతి.

"మరి కులాలు వేరని భయపడతాడేమో మిత్రుడు"

"అదీ అడిగాను! ఆనాడు తన తల్లికి భయపడి మిమ్మల్ని వదులుకున్నందుకు అతడు సిగ్గుపడుతున్నాడు. ఈనాడు అలాంటివాటి గురించి భయపడదలచుకోలేదు" చెప్పాడు ఆనంద్.

ఆమె కొద్దిక్షణాలు ఆలోచించి అన్నది–

"మిష్టర్ ఆనంద్! ముందుగా మీ స్నేహితుడి అభిప్రాయం కనుక్కుని రండి. తర్వాత నా అభిప్రాయం చెబుతాను" అన్నది జ్యోతి.

"ఓకే...మీ మాట ప్రకారమే చేస్తాను. కానీ ఇది వాసు తన అదృష్టంగానే భావిస్తాడని ఖచ్చితంగా చెప్పగలను" అన్నాడు ఆనంద్.

'అలా జరగకూడదు' మనసులోనే అనుకుంది జ్యోతి.

"మీ మిత్రుడి అభిప్రాయం కనుక్కుని ఎప్పుడు చెబుతారు?"

"వీలయినంత త్వరలో చెబుతాను. బహుశా రేపు ఉదయమే వచ్చి చెబుతాను"




"అలాగే! కానీ ఒక్క విషయం. ఏ విషయం నాకు ఫోన్ ద్వారా మాత్రం చెప్పకండి. ఇక్కడికి వచ్చి నా ఎదురుగా చెప్పండి"

"అలాగే" పైకి లేచాడు ఆనంద్.

ఆనంద్‌కి ఆనందంగా వుంది. జ్యోతి వాసుని పెళ్ళి చేసుకునేందుకు అంగీకరించినట్టుగానే భావిస్తున్నాడు అతడు. వాసు కూడా ఆనందంగా ఒప్పుకుంటాడు. ఏనాడో విడిపోయిన ప్రేమ బంధం తిరిగి ఈనాడు అల్లుకోబోతోంది. తన స్నేహితుడు మంచి హోదాలోకి రాబోతున్నాడు. అదీ అతడి ఆనందం.

వెళ్ళిపోయాడు ఆనంద్.

పైకి లేచి కిటికీవైపు నడిచింది జ్యోతి. ఆమె మనస్సులో ఎంతో సంఘర్షణ.

తనను ప్రేమించిన వాసు ఇంత వ్యక్తిత్వం లేనివాడా! తనకన్నా గొప్ప స్థితిలో వున్న ఆడదానిని పెళ్ళి చేసుకొని తద్వారా వచ్చే గౌరవం కోసం ఇంతగా ఉవ్విళ్లూరుతున్నాడా! అతడు పిరికివాడే కాదు...వ్యక్తిత్వం కూడా లేనివాడా?

పిరికివాడని తెలిసి కూడా తన మనసులో ఇంతవరకూ వాసు పట్ల ప్రేమ వుంది. కానీ అతడు వ్యక్తిత్వం కూడా లేనివాడని తెలిస్తే ఆ ప్రేమ స్థానంలో అసహ్యం చోటుచేసుకుంటుంది తనలో.

తను ఇక్కడికి వచ్చేది వాసుకు తెలియదని చెప్పాడు ఆనంద్. అందుకే వాసు నిర్ణయం కనుక్కురమ్మని పంపింది తను. తనను పెళ్ళి చేసుకునేందుకు వాసు ఒప్పుకుంటే ఎంత హీనమనస్కుడో అర్థం అయిపోతుంది తనకు.

ఎంతోకాలం నుండి పెళ్ళి చేసుకోకుండా ఆగింది తను. ఇప్పుడు తొందరపడి ప్రేమకోసం ఓ వ్యక్తిత్వం లేనివాడిని పెళ్ళాడకూడదు. మరోసారి మోసపోకూడదు.

ఓ వ్యక్తిత్వం లేనివాడి భార్యగా బతకడం తనకు ఇష్టంలేదు.

అందుకే ఆమె ఓ నిశ్చయానికి వచ్చింది వెంటనే.

టేబిల్ దగ్గరకు నడిచి ఓ కాగితం మీద తన నిర్ణయం రాసింది. దాన్ని ఓ కవరులో పెట్టి అతికించింది. కవరుని టేబిల్ సొరుగులో పడేసింది.

ఇప్పుడామె మనసుకు తృప్తిగా ఉంది.

టైము చూసుకుంది జ్యోతి. తొమ్మిది న్నర అయింది.

తల్లికి చెప్పి ఇల్లు దాటి ఇవతలకు వచ్చింది.

ఓ ఆటో ఎక్కి ఆఫీసుకు బయలు దేరింది.

* * *

సాయంత్రం వాసు ఇంటికి వచ్చాడు ఆనంద్. పుస్తకం చదువుకుంటూ వున్నాడు వాసు. అతడి ఎదురుగా కూర్చున్నాడు ఆనంద్.

"ముందు నాకు స్వీటు తినిపించవోయ్! నీకో స్వీటయిన మాట చెప్పబోతున్నాను"

''ఏమిటది?'' ఆసక్తిగా అడిగాడు వాసు.

"ఈరోజు ఉదయమే జ్యోతిని కలుసుకున్నాను"

"జ్యోతిని కలుసుకున్నావా!ఎందుకు?" ఆశ్చర్యపోయాడు వాసు.

"మీ ఇద్దర్నీ ఒకటి చెయ్యాలని నా వుద్దేశం. అందుకోసమే ఆమె దగ్గరికి వెళ్ళాను''

వాసు భయంగా ఆనంద్ వంక చూశాడు.

"ఆనంద్! నీకు తెలివివుండే మాట్లాడు తున్నావా? ఆమె, నేను ఒకటి కావడమా? ఇది జరిగే పనేనా? ఆమె ఇంకా మన క్లాస్‌మేట్ జ్యోతిగానో లేదా నన్ను ప్రేమించిన జ్యోతిగానో భావించుకుని వెళ్ళావేమో! ఆమె ఇప్పుడు ఓ ఆఫీసర్ అని నీకు తెలుసుకదా"

"తెలుసు. అందుకే ముందుగా ఆమె నుండి గ్రీన్‌సిగ్నల్ తీసుకుందామను కున్నాను. నువ్వెలాగూ ఒప్పుకుంటావని నాకు తెలుసు"

"మరి ఏమందామె?" ఆతృతగా అడిగాడు వాసు.

"ముందు నీ నిర్ణయం తెలుసుకో మంది. ఆమె ఒకవిధంగా ఒప్పుకున్నట్టే"

ఊపిరి తీసుకున్నాడు వాసు. అయితే జ్యోతి తనను పెళ్ళి చేసుకునేందుకు అంగీకరించిందన్నమాట. కానీ తను ఆమెను వివాహం చేసుకోగలడా? నో... అది తన వల్లకాదు.

"ఆనంద్! నువ్వు ఆమె దగ్గరకు వెళ్ళబోయేముందు నాతో ఒక మాట అని వుండాల్సింది. నాకు చెప్పకుండా వెళ్ళి చాలా పెద్ద తప్పుచేశావు" మెల్లగా అన్నాడు వాసు.

"వెళ్ళడంలో తప్పేముంది? అడిగాను ఒప్పుకుంది"

"ఆమెఒప్పుకోగానే నేను ఒప్పుకుంటా నని ఎలా అనుకున్నావు" బాధగా అన్నాడు వాసు.

"జోక్ చేస్తున్నావా?" అనుమానంగా అడిగాడు ఆనంద్.

"లేదు. నేను సీరియస్‌గానే మాట్లాడు తున్నాను'' అన్నాడు వాసు.

"అంటే జ్యోతిని పెళ్ళిచేసుకోవడం నీకిష్టంలేదా?"

"నాకిష్టంలేదు"

"ఏం...మీ కులం కాదనా?" అడిగాడు ఆనంద్.

"కులం గురించి ఆలోచించడంలేదు నేను"

"అయితే ఇక ఈ పెళ్ళి చేసుకునేం దుకు నీ అభ్యంతరం ఏమిటి?"

"ఆనంద్! నువ్వు ఆ వైపునుండే ఆలోచిస్తున్నావు. కానీ నా వైపునుండి ఆలోచించటంలేదు. ఒకనాడు ఆమెను పెళ్ళిచేసుకోకుండా తిరస్కరించాను. అప్పట్లో నా పిరికితనంతోనే నేను ఆమెను పోగొట్టుకున్నాను. కానీ ఇప్పుడు ఆమెను పెళ్ళి చేసుకునేందుకు నాకు ఏ అడ్డంకులూ లేవు. ఆమెను పెళ్ళి చేసుకోవచ్చు. కానీ ఈనాడు ఆమెను పెళ్ళి చేసుకోవడంవల్ల నా వ్యక్తిత్వానికి భంగం కలుగుతుంది. ఒకప్పుడు ఏ ఉద్దేశంతోనో ఆమెను కాదన్న వ్యక్తి ఈనాడు ఆమెను పెళ్ళి చేసుకోబోతున్నాడంటే, అది ఆమె హోదాను చూసేనని ఈ లోకం అను కుంటుంది, ఆ భావమే ఆమెలోనూ స్థిర పడుతుంది. ఆమె నా వ్యక్తిత్వాన్ని శంకిస్తుంది. ఆమెమీద ప్రేమతో కాక ఆమె హోదాను చూసే ఈ పెళ్ళికి అంగీక రించానని ఆమె అనుకుంటుంది. అందుకే ఈ పెళ్ళి నాకిష్టంలేదు" చెప్పాడు వాసు.

ఆనంద్ ముఖం వెలవెలపోయింది. తేరుకుని కోపంగా అన్నాడు–

"ఒకనాడు కూడా ఇలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు చేసే అప్పుడు ఓసారి జ్యోతిని చేజేతులా పోగొట్టుకున్నావు. ఈనాడు కూడా ఇలాంటి ముచ్చు ఆలోచనలే చేస్తున్నావా?''

మౌనంగా వుండిపోయాడు వాసు.

ఆనంద్ కోపం తగ్గించుకున్నాడు.

అతడికి నచ్చజెప్పాలనే ప్రయత్నం చేశాడు.

"వాసూ! నువ్వు వ్యక్తిత్వంలేని మగాడివని తోచివుంటే ఆమె నిన్ను పెళ్ళి చేసుకునేందుకు ఎలా ఒప్పుకుంటుంది చెప్పు"

"ఆమె నామీది ప్రేమతో పెళ్ళిచేసుకోవటమే ప్రధానంగా భావించి ఈ పెళ్ళికి అంగీకరించి ఉండొచ్చు. పెళ్ళికి ముందు ఆడదానికి ఇలాంటివి లోపంగా అనిపించకపోయినా పెళ్ళి అయిన తర్వాత అదే పెద్ద లోపంగా భావించి వాళ్ళు బాధపడుతూ, భర్తలను బాధ పెడుతూ ఉంటారు"

''చూడు బ్రదర్! ఈ వెధవ ఆలోచనలతో బంగారం లాంటి ఈ అవకాశాన్ని పోగొట్టుకోకు. ఓ ఆఫీసర్ భర్తగా ఈ సమాజంలో నీకు ఉండే గౌరవం వూహించుకో"

"అదే నేను బాధపడేది. ఈ సమాజంలో అందరూ నన్ను వాసుగానే గుర్తించాలనుకుంటున్నాను. అంతేకాని ఓ ఆఫీసర్ భర్తగాకాదు. నా భార్య హోదావలన పెరిగే గౌరవం నాకు అక్కరలేదు. అలాంటి గౌరవం కోసం పాకులాడితే నా వ్యక్తిత్వం చచ్చిపోతుంది. నా వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలనే ఉద్దేశంతోనే నేను ఈ పెళ్ళికి ఒప్పుకోవడంలేదు" చెప్పాడు వాసు.

ఆనంద్ ఎన్నో విధాల చెప్పిచూశాడు. కానీ వాసు ఒప్పుకోలేదు. తను ఈ పెళ్ళి చేసుకోలేనని గట్టిగా చెప్పేశాడు.

"నువ్వు ఒప్పుకుంటావన్న ఆశతో జ్యోతిలో లేని ఆశలు కలిపించి వచ్చాను. ఇప్పుడు ఆమెకు నేనేం చెప్పేది?" బాధగా అన్నాడు ఆనంద్.

"నాకు చెప్పకుండా వెళ్ళి తప్పు చేశావని అందుకే అన్నాను నేను"

"ఛీ! నీలాంటివాడిని నమ్ముకుంటే నట్టేట్లో మునిగినట్లే. ఇప్పుడు ఆమెకు ఏం చెప్పాలో తెలియక అల్లాడుతున్నాను నేను" పిడికిలి బిగించి కుర్చీని కొడుతూ అన్నాడు ఆనంద్.

దూరంగా కూర్చుని చదువుకుంటున్న స్వప్న వింతగా చూస్తుంది అక్కడి పరిస్థితి.

''ఆఖరిసారిగా అడుగుతున్నాను. సరిగా ఆలోచించి చెప్పు. ఏమిటి నీ నిర్ణయం?" అడిగాడు ఆనంద్.

"చెప్పానుగా! నాది ఒకటే నిర్ణయం" చెప్పాడు వాసు.

''అందుకే అంటారు ... అదృష్టవంతుణ్ని చెడిపేవారు లేరు, దురదృష్టవంతుణ్ని కాపాడేవారు లేరని. నీలాంటి దురదృష్టవంతుణ్ని ఎవరూ కాపాడలేరు. నీ బతుకింతే" అక్కడున్న కుర్చీని గట్టిగా తన్ని లేచి నిలబడి అన్నాడు.

''చూడు వాసూ! ఇక ఎప్పటికీ నీ ముఖం చూడను. జ్యోతిని పెళ్ళిచేసుకునే ఉద్దేశం నీక్కలిగితే మా ఇంటికిరా. అప్పుడే నీ ముఖం చూస్తాను. నేను ఢిల్లీ వెళ్ళేలోపు నీ ఉద్దేశం మార్చుకునివస్తే అప్పుడయినా జ్యోతిని వెళ్ళి బతిమలాడుతాను. లేకుంటే ఈ జన్మకు నీకు నాకు ఇంతే".

''ఆనంద్! ఇక ఎప్పటికీ నా నిర్ణయం మారదు'' అరిచి చెప్పాడు వాసు.

విసురుగా వెళ్ళిపోయాడు ఆనంద్.

అప్పటివరకూ వాళ్లిద్దరివైపు వింతగా చూస్తున్న స్వప్న వాసు దగ్గరకు వచ్చింది.

''ఏమిటి డాడీ! ఆ అంకుల్ అంత

కోపంగా వెళ్ళిపోతున్నారు?"

"ఆయనకు అమావాస్యకు, పౌర్ణమికి పిచ్చిపడుతుందిలే! ఆ పిచ్చి పట్టినపుడు ఇలా చేస్తుంటాడు. ఈరోజు అమావాస్య కదా అందుకనే ఇలా" కూతుర్ని దగ్గరకు తీసుకుని చెప్పాడు వాసు.

అతడి ఆలోచనలలోకి జ్యోతిని గురించిన ఊహలు రాసాగాయి.

'జ్యోతి ఇంకా తనను ప్రేమిస్తోందా!



ఆమెకు తనపై ప్రేమ లేకుంటే తనను పెళ్ళి చేసుకునేందుకు ఎలా అంగీకరి స్తుంది? ఇంతకాలం తనమీద ప్రేమను చంపుకోలేకనే పెళ్లిచేసుకోకుండా ఆగిందా' అతడి గుండె తియ్యటి బాధతో నిండింది.

ప్రేమ ఎంతటి తియ్యని అనుభూతి నిస్తుంది. ప్రేమలోని తియ్యదనం జీవిత మంతా గుండెల్లోనే ఉంటుంది.

అంతేకాదు! ప్రేమ చిత్రహింసలు కూడా పెడుతుంది. ప్రేమపెట్టే బాధ ముందు ఏ బాధా నిలవదేమో!

ఈ స్థితిలో జ్యోతిని కలుసుకోవడం ఆనంద్‌కు ఇష్టంలేదు. కానీ, తన జవాబు కోసం ఎదురుచూస్తూ ఉంటుందనీ, తను చెప్పబోయే విషయంమీద ఆశపెట్టుకుని ఉంటుందనీ చెప్పటం తన ధర్మంగా భావించి వచ్చాడు అతడు.

గేటు తీసుకుని లోపలికి అడుగు పెట్టాడు.

"రండి...కూర్చోండి" అతడిని చూసిన ఆనందం ఆమె ముఖంలో కనిపించింది.

కూర్చున్నాడు ఆనంద్.

ఆమె లోనికి వెళ్ళి రెండు కప్పులతో



కాఫీ పట్టుకు వచ్చింది. కాఫీతోపాటు ఓ కవరు కూడా తీసుకువచ్చింది.

కాఫీ తాగాడు అతడు. తను చెప్ప బోయే విషయం ఎలా మొదలుపెట్టాలో అర్థంకాలేదు అతనికి. తను చెప్పబోయే విషయం ఆమెను డిసప్పాయింట్ చేస్తుందని అతడు భావిస్తూ వున్నాడు.

"జ్యోతిగారూ! నేను...నేను వాసుని కలిశాను" చెప్పలేక ఆగాడు ఆనంద్.

"మీరు అతడి నిర్ణయం చెప్పబోయే ముందు ఈ కవరు మీదగ్గర వుంచుకోండి ముందు! వాసు నిర్ణయం చెప్పిన ఆ తర్వాత అందులో నా నిర్ణయం వుంది... చదువుకోండి" అంది జ్యోతి.

ఆ కవరు వంక వింతగా చూశాడు ఆనంద్.

"మీ అభిప్రాయం మొన్ననే చెప్పారు కదా! మరి ఇది...'' ఏమిటో అర్థంగాక అడిగాడు ఆనంద్.

''ఆ కవరులోని విషయం మీరు చదివితే ఆ విషయం మీకు అర్థం అవు తుంది. ముందు వాసు నిర్ణయం గురించి చెప్పండి" అడిగింది జ్యోతి.

"అయామ్ సారీ జ్యోతిగారూ! మీ మనసులో ఆశలు రగిలించి ఆ తర్వాత మీరు కట్టుకున్న ఆశాసౌధాలను కూల దోస్తున్నాను"

ఆమె మనసులో ఓ ఆనందతరంగం.

"వాడొట్టి పిరికివాడు. అందుకే ఈనాడు కూడా మిమ్మల్ని పోగొట్టు కున్నాడు. మీది తనకన్నా పెద్ద హోదా నట. మగాడు తనకన్నా పెద్ద హోదాలో వున్న ఆడదానిని పెళ్లి చేసుకోవడంవలన అతడి వ్యక్తిత్వం దెబ్బతింటుందట. అతడికి మీమీద ప్రేమవుందట. కానీ మిమ్మల్ని పెళ్ళి చేసుకోలేదట. వాడొట్టి స్టుపిడ్. ఫూల్" తల పట్టుకుని అన్నాడు ఆనంద్.

ఆమె ఆనందంగా చప్పట్లు కొట్టింది. ''శభాష్ వాసూ! మెచ్చుకున్నాను నిన్ను"

ఆనంద్ ఆమెవంక అయోలా చూశాడు.

"వాసు నా అంచనా ప్రకారమే ఉన్నతంగా మాట్లాడాడు. ఇప్పుడు నాకు నిజంగా ఆనందంగా వుంది" మెరుస్తున్న కళ్ళతో అందామె.

"ఇంత బాధ కలిగించే విషయం విని కూడా మీరు ఆనందంగావున్నారా"

"ఓ...నా ఆనందానికి కారణం మీకు తెలియదుకదూ! ముందు ఆ కవరు చించి అందులోని విషయం చదువుకోండి... అప్పుడు అర్థం అవుతుంది"

ఆశ్చర్యంగా కవరు చించి, అందులోని కాగితం తీసి చదువుకున్నాడు ఆనంద్. అతడి ముఖం వెలవెలాపోయింది.

"ఇది...ఇందులో రాసిన విషయం?" ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద్.

"నిజమే ... వాసు వ్యక్తిత్వం గురించి తెలుసుకునేందుకే మీతో అలా మాట్లా డాను. వాసు ఈ పరిస్థితులలో నన్ను పెళ్ళిచేసుకునేందుకు అంగీకరించివుంటే, అది నా హోదాను చూసేనని నేను భావించి వుండేదాన్ని. నా హోదాను చూసి నన్ను పెళ్ళిచేసుకోడానికి వచ్చేవాళ్ళు నా దృష్టిలో వ్యక్తిత్వంలేనివాళ్ళే!

"ఓ అంగవికలుడినైనా ప్రేమిం చొచ్చు కానీ ఓ పిరికివాడిని ప్రేమించ కూడదు. ఎందుకో తెలుసా...? ప్రేమకు తెగింపు, చొరవ, ఎదిరించగల గుండె నిబ్బరం కావాలి. అవసరమైతే తనవాళ్లను వదులుకోగల తెగింపు, ఎలాగయినా ప్రియురాలిని పోషించుకోగల చొరవ, ఈ సమాజాన్ని ఎదిరించగల గుండె




ధైర్యం కావాలి. పిరికివాడిలో అవేవీ వుండవు. అందుకే పిరికివాడి ప్రేమ విజయంకాదు. ప్రేమించి కూడా వృధా భారమే.

"అలాగే పెళ్ళాడేప్పుడు ఒక పిరికి వాడినయినా పెళ్లాడొచ్చు. కానీ ఓ వ్యక్తిత్వంలేనివాడిని పెళ్లాడకూడదు.

"ఎలాగంటే, పెళ్ళయిన తర్వాత తన సాహచర్యంలో మగాడిలోని పిరికితనాన్ని పోగొట్టుకోగలదు స్త్రీ. అతడిని ఓవున్నతుడిగా తీర్చిదిద్దుకోగలదు. కానీ అసలు వ్యక్తిత్వమే లేనివాడిని తీర్చిదిద్దుకోవడం కష్టం. వ్యక్తిత్వమే లేనివాడయితే ఆడదాని సంపాదన తిని కూర్చుసేందుకు కూడా సిద్ధపడతాడు.

"సో! ఒకనాడు నేను ఓ పిరికివాడిని ప్రేమించి మోసపోయాను. అందుకే ఈనాడు ఓ వ్యక్తిత్వంలేనివాడిని పెళ్ళాడి బాధపడదలచుకోలేదు.

"నిజానికి నాకు పెళ్ళి గురించిన ఆలోచనేలేదు. కాకపోతే ఓసారి వాసుని బాధపెట్టేందుకు – నాకు పెళ్ళి చూపులు జరుగుతున్నాయని చెప్పాను. అంతే తప్ప పెళ్ళిచేసుకోవాలనేంలేదు నాకు.

"అటువంటి పరిస్థితుల్లో నిన్న మీరు వచ్చి అతడిని పెళ్ళిచేసుకోమని అడిగారు. అప్పుడే నాకీ ఆలోచన వచ్చింది. నేను ఒకనాడు ప్రేమించిన వ్యక్తి పిరికివాడేనా లేక వ్యక్తిత్వం కూడా లేనివాడా అని తెలుసుకోవాలనుకున్నాను .... తెలుసుకున్నాను" ఆగింది జ్యోతి.

షాక్ తిన్నట్టుగా అయ్యాడు ఆనంద్.

"అంటే వాసు ఎలాంటివాడో తెలుసుకునేందుకు నన్ను పావులా ఉపయోగించుకున్నారా!"

"సారీ!నన్ను మీరలా అపార్థం చేసుకోవద్దని కోరుతున్నాను. వాసు మనస్సు గురించి తెలుసుకునేందుకు మీరు నాకు తోడ్పడ్డట్టు భావించుకోకండి"

"వాసు మనసు గురించి తెలుసుకుని మీరేం చెయ్యదలచుకున్నారు?"

"చెయ్యదలచుకున్నది మనసులో ఉంది. అది అమలుచేసేందుకు కొద్ది రోజులు పడుతుంది"

"ఏమిటి మీ మనసులో ఉందేది?"

"అది చేసి చూపిస్తాను"

"చెప్పకూడదా?"

"సారీ!"

కొద్దిక్షణాలు మౌనంగా ఉన్నతర్వాత ఆనంద్ అడిగాడు–

"పోనీ ఒక విషయం చెబుతారా?"

"ఏమిటో అడగండి"

"మీరింకా వాసుని ప్రేమిస్తూనే ఉన్నారా?"

ఒకక్షణం ఆలోచనగా కళ్లు మూసుకుంది ఆమె. ఇన్నిరోజులుగా గుండెల్లోని బాధ దించుకోవాలనిపించింది.ఆ క్షణంలో ఆనంద్ ఓ ఆప్తుడిలా కనిపించాడు. ఆమె తన హోదాను కూడా మరిచి, ఓ చిన్న పిల్లలా మారిపోయింది.తన గురించి తాను పూర్తిగా చెప్పుకుంది...

"ప్రేమను అంత తేలికగా మరిచిపోలేము ఆనంద్‌గారూ! ఆ ప్రేమ మనస్సులో ఓ మూల, గుండెగూడులో చిరుదివ్వెలా వెలుగుతూనే ఉంటుంది"

"అతడిని మీరు ప్రేమిస్తూ ఉంటే అతడిమీద కక్షసాధింపు చర్యలు ఎందుకు సాగించారు? అతడిని ట్రాన్స్‌ఫర్ చేస్తాననడం, సస్పెండ్ చేస్తాననడం, యాంటీ కరప్షన్‌వాళ్ళకు పట్టించాలనుకోవడం .... అవన్నీ ఎందుకు చేశారు?"

మెల్లగా నవ్వింది జ్యోతి.

"అవన్నీ నేను కక్షసాధింపుచర్యల్లా చేయలేదు. నన్ను నేను రక్షించుకోవాలనే ఉద్దేశంతోనూ, నన్ను బాధపెట్టినందుకు అతడినికూడా బాధపెట్టాలి అనే భావంతోనూ అలా చేశాను.

"ఆఫీసులో తొలిసారిగా వాసుని చూసినపుడు నేను భయపడ్డాను. వాసు స్టాఫ్‌తోనూ, తనకు తెలిసినవారితోనూ మా పాతకథ చెప్పి నన్ను ఎక్కడ చులకన చేయిస్తాడోనని అనుమానపడ్డాను. అందుకే అతనిని భయపెట్టడానికి అలా బెదిరించాను".

"బెదిరించడమే మీ ఉద్దేశ్యమయితే యాంటీ – కరప్షన్‌వాళ్ళకు పట్టించాలని ఎందుకు ప్రయత్నించారు? వాళ్ళకు వాసు చిక్కివుంటే అతని ఉద్యోగమే పోయి ఉండేది కదా!"

"వాళ్లు యాంటీకరప్షన్ వాళ్ళయితేగా ఉద్యోగం పోయేందుకు? వాళ్లు నాకు తెలిసినవాళ్లు. జస్ట్...వాసు ఎలాంటివాడో చెక్ చేయమని పంపాను. అంతే తప్ప మరేమీ కాదు. లంచం తీసుకుని ఉంటే అలాంటివాడని మనసులో సరిపెట్టుకుని ఉండేదాన్ని. కానీ వాసు నా అంచనాలకు మించి ఉన్నత ఆశయాలు కలవాడినని నిరూపించుకున్నాడు. తమ ఆఫీసర్ తనను ఒకప్పుడు ప్రేమించిందన్న నిజాన్ని పదిమందికి చెప్పివాళ్ళ సానుభూతి గౌరవం పొందాలని ప్రయత్నించలేదు అతడు. అవినీతిపరుడు కాడని కూడా ఋజువు చేసుకున్నాడు. అందుకే అతడిమీద నా ప్రేమ మరింత జ్వలించింది" ఆమె కంఠంలో బాధ తొంగిచూసింది.

రెండు నిముషాలు ఇద్దరూ మాట్లాడుకోలేదు.





ఆనంద్ అన్నాడు–

"మీ జీవితం నాకు వింతగా తోస్తోంది. ఒకప్పుడు వాసు మిమ్మల్ని ప్రేమించి కూడా మీ కులం వేరని, మిమ్మల్ని పెళ్లి చేసుకుంటే తల్లిని, బంధువుల్ని వదులుకోవలసి వస్తుందని, లోకం దృష్టిలో చిన్నచూపు చూడబడతాడని ఆరోజు మిమ్మల్ని దూరం చేసుకున్నాడు. ఈనాడు మీరు ఓ గొప్ప స్థితికి రాగలిగారు. వాసు కులమనే నీచ భావాన్ని వదిలి తనను తాను సంస్కరించుకున్నాడు. కానీ మిమ్మల్ని పెళ్లి చేసుకోలేకపోతున్నాడు. కారణం – తన వ్యక్తిత్వం దెబ్బతింటుందని. ఇక మీ జీవితాలు ఇంతేనా!"

"లేదు. మా ప్రేమకు మరో ముగింపు ఉంది"

"ఇంతకు ముందు కూడా అన్నారు. మీ మనసులో ఏదో ఉన్నట్టుంది...చెప్పకూడదా!" అడిగాడు ఆనంద్.

"మీరు వెళ్ళేలోపే నా నిర్ణయం మీకు తెలుస్తుంది"

"ఓకే...అప్పుడయినా తెలుస్తుందిగా. సరే...ఏం చేద్దాం. మొత్తానికి నన్ను సస్పెన్స్‌లో పడేశారు"

నవ్విందామె.

లేచాడు అతడు. శలవు తీసుకుని ఇవతలకు వచ్చేశాడు.

వాసుని కలుసుకుని జరిగింది చెప్పాలనిపించి వాసు ఇంటివైపు కదిలాడు ఆనంద్.

అప్పుడే ఆఫీసుకు రెడీ అవుతున్నాడు వాసు. రాత్రి కోపగించుకుని వెళ్ళిన ఆనంద్ మళ్ళీ తిరిగిరావడం చూసి ఆశ్చర్యపోయాడు వాసు. పక్కనే కూర్చున్నాడు ఆనంద్.

"ఇక నీ ఇంటికి రాకూడదనుకున్నాను.

కానీ రావలసి వచ్చింది. నువ్వే గెలిచావు" అన్నాడు ఆనంద్.

"ఛీ! అలా ఎందుకు మాట్లాడతావు. మన మధ్య గెలుపు ఓటముల ప్రసక్తి ఎందుకు తీసుకువస్తావు. ఆఫీసుకు వెళ్ళబోయే ముందే మీ ఇంటికి రావాలనుకుంటున్నాను'' నొచ్చుకుంటున్నట్లు అన్నాడు వాసు.

"ఈ విషయమే కాదు వాసూ...జ్యోతి విషయంలో కూడా నువ్వే గెలిచావు. జ్యోతి మెచ్చుకునే అభిప్రాయం వ్యక్తం చేశావు నువ్వు. నా అభిప్రాయమే తప్పు. నేనే ఓడిపోయాను"

"ఏం జరిగింది?" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

అంతకు ముందే తను జ్యోతిని కలుసుకోవడం, ఆమె వ్యక్తం చేసిన అభిప్రాయాలు-అన్నీ వివరంగా చెప్పాడు ఆనంద్. ఆశ్చర్యంగా విన్నాడు వాసు.

"అంతే...కాదు. ఆమెకు నీ మీద ఎలాంటి ద్వేషం లేదు. ఉందేదంతా ప్రేమే. నువ్వు ఆమెను అపార్థం చేసుకున్నావు" అన్నాడు ఆనంద్.

"అంటే" అడిగాడు వాసు.

యాంటీ - కరప్షన్ మొదలైన విషయాలను గురించి తెలియ చెప్పాడు ఆనంద్. ఈసారి మరింత ఆశ్చర్యపోయాడు వాసు. అతడు చెప్పిన విషయం గురించి అంతకు ముందు అతడి ఊహలోనికి కూడా రాలేదు.

"వాసూ! జ్యోతి ఇప్పటికీ నిన్ను ప్రేమిస్తూనే ఉందని నాకు అనిపిస్తోంది ఆమె మనసులో ఏదో ఉంది. అప్పటికీ నేను అడిగాను. మీ మనసులోని ఉద్దేశం ఏమిటో చెప్పండి అన్నాను. నేను ఢిల్లీ వెళ్లేలోపున తెలుస్తుందని చెప్పింది తప్ప ఆమె ఉద్దేశం తెలుపలేదు"

"అలాగా" ఆలోచిస్తున్నట్టు అన్నాడు వాసు.

''ఓకే...సాయంత్రం వస్తాను" చెప్పి వెళ్ళిపోయాడు ఆనంద్.

కాసేపు ఆ విషయమే ఆలోచించి, టైము కావడంతో ఆఫీసుకు బయలుదేరాడు వాసు.

ఆఫీసుకు చేరిన తర్వాత తెలిసింది- ఆరోజు జ్యోతి శెలవు పెట్టిందని.




ఆనంద్ వెళ్ళిపోయాక జ్యోతి అలాగే కుర్చీలో ఉండిపోయింది చాలా సేపు.

ఆనంద్ చెప్పిన విషయం ఆనందం కలిగిస్తూనే ఉంది. వాసు తనను కాదన్నందుకు ఆమెకు బాధగా లేదు. పైగా ఆనందం వేస్తోంది. ఒకనాడు తను ప్రేమించిన వ్యక్తి ఒట్టి పిరికివాడు. అంతేకాని వ్యక్తిత్వం లేనివాడు మాత్రం కాదు. అదీ తనకు ఆనందం.

ఓ వ్యక్తిత్వం గలవాడిని తన భర్తగా చేసుకోవాలని తన ఆశ. తను ప్రేమించినవాడు వ్యక్తిత్వం కలవాడు. అందుకే అలాంటివాడిని తనవాడిగా చేసుకోవాలి.

మరి తనకన్నా గొప్ప హోదాగల ఆడదాన్ని పెళ్ళి చేసుకోనని వాసు ఖచ్చితంగా చెప్పాడు. మరెలా సాధ్యమవుతుంది తమ కలయిక.

అందుకు ఆమె ముందుగానే ఆలోచించి ఉంది.

ఆ ఆలోచనను అమలుచేయాలనుకుంది.

ఆ మధ్యాహ్నం భోజనాల సమయంలో తల్లితో అంది.

"అమ్మా ! నువ్వు రోజూ నన్ను 'పెళ్ళిచేసుకో...పెళ్లిచేసుకో' అని పోరుతుంటావుగా! ఇప్పుడు నేను పెళ్ళిచేసుకోబోతున్నాను"

"నిజంగానా" ఆనందంగా అడిగింది సరస్వతమ్మ.

"నిజమే! కానీ మన కులంలోని వ్యక్తి కాదు...మరో కులం"

ఆమె ముఖం ఓ క్షణం వెలవెలబోయింది.

"ఆ బుద్ధి ఎందుకు పుట్టిందమ్మా నీకు. మీ నాయన ఆదర్శాలే ఆచరణలో పెట్టాలనుకున్నావా!" బాధగా అందామె.

"అవునమ్మా...చనిపోయిన నాన్న కూడా అప్పట్లో నా కోరికను కాదనలేదమ్మా! ఈరోజు నీవు నా కోరికను కాదనకు"

కాదన్నా ఆమె ఆగదని తెలుసు. అందుకే అడిగింది–

"ఆ అబ్బాయి ఏం పని చేస్తాడు?" అడిగింది సరస్వతమ్మ.

"ఒకప్పుడు మా క్లాస్‌మేట్. అప్పట్లోనే మేము పెళ్ళి చేసుకోవాలనుకున్నాము. అప్పట్లో నాన్నకు కూడా చెప్పాను. ఆయన అంగీకరించారు. కానీ కొన్ని కారణాల వలన మేము విడిపోయాము. ఇప్పుడు ఆయన మా ఆఫీసులోనే క్లర్క్‌గా పని చేస్తున్నారు"

"క్లర్కా! ఓ ఆఫీసర్‌గా ఇంత హోదాగల ఉద్యోగం చేస్తూ, చివరికి ఓ క్లర్క్‌ని పెళ్ళాడతావా? అదే జరిగితే ఈ లోకం ఏమనుకుంటుంది చెప్పు" బాధగా అడిగింది సరస్వతమ్మ.

"అందుకే నేనో నిశ్చయానికి వచ్చేశానమ్మా! ఈ ఉద్యోగం మానేద్దామని అనుకుంటున్నాను. ఆయనకు నేనీ ఉద్యోగం చేయడం కూడా ఇష్టంలేదు"

"ఇంత పెద్ద హోదా గల ఉద్యోగం వదులుకుంటావా" ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

"ఆయనను పెళ్ళి చేసుకోవాలంటే అలా చేయక తప్పదమ్మా" చెప్పింది జ్యోతి.

"ఈ పెళ్ళి నాకు ఇష్టం లేదు" చెప్పింది ఆమె.

"పోనీ ఒకటి చెప్పమ్మా! నీ కూతురు పెళ్ళి కాకుండా ఇలాగే జీవితాంతంవరకూ గడపడం కావాలా, లేక ఈ ఉద్యోగం వదిలి పెళ్ళి చేసుకోవడం ఇష్టపడతావా? నీకేది ఇష్టమో చెప్పమ్మా ... అలాగే చేస్తాను"

జ్యోతి ఒకసారి ఓ మాట అంటే ఆ మాటకు తిరుగు ఉండదని ఆమెకు తెలుసు. చిన్నప్పటినుండి జ్యోతి మనస్తత్వం ఎరిగినదామె. అందుకే మౌనంగా లోపలికి వెళ్ళింది.

మౌనం అర్ధాంగీకారం.

జ్యోతి నవ్వుకుంది. తల్లి సగం ఒప్పుకుంది. ఇక తను ఒప్పించవలసిన వాళ్లు ఎవరూ లేరు. తను అనుకున్నది అనుకున్నట్టు అవుతుంది.

జ్యోతి ఆనందంగా లోపలికి వెళ్ళింది.

* * *

సాయంత్రం ఏడు గంటల ప్రాంతంలో వచ్చాడు ఆనంద్.

వాసూ కూడా రెడీ అయి ఉండ

దంతో ఇద్దరూ పార్కు వైపు కదిలారు. పార్కులో ఓ చోట కూర్చున్నారు ఇద్దరూ.

"వాసూ! నీమీద శైలజ ఏవో ఆశలు పెంచుకుంటున్నట్టు ఉంది"

"అని నీతో చెప్పిందా!"

"లేదు! ఆమె తననోటి నుండి ఏమీ చెప్పలేదు. కానీ ఆమె నీ గురించి చూపించే ఉత్సుకత, నీమీద అభిమానంగా మాటలు చెప్పడం చూస్తోంటే నాకు అనుమానం వచ్చింది. ఈరోజు సాయంత్రం టీ తాగేప్పుడు నీ గురించి అడిగింది. 'మీ స్నేహితుడు వాసు ఎలాంటివాడు? కాలేజీలో ఎలా ఉండేవాడు??' అని ఆరాగా అడిగింది. దాంతో నాకు అనుమానం వేసింది. నీ గురించి చెబుతూ ఆమె మోము పరిశీలనగా చూశాను. ఆమె మోములోని సిగ్గు, ఆమె కనులలో ఆరాధన, నీగురించి ఆమె చూపించే ఉత్సుకత నా అనుమానాన్ని బలపరిచింది'' చెప్పాడు ఆనంద్.

"ఆఫీసులో ఆమె ప్రవర్తన నాకు ఆ అనుమానాన్ని కలిగించింది. అనుమానమే కాదు–నిజమని కూడా అర్థమయింది. కానీ ఏం చెయ్యాలో నాకు అర్థం కాలేదు. అందుకే ఆమెను తప్పించుకొని తిరగడం మొదలుపెట్టాను నిట్టూర్చాడు వాసు."

"పోనీ నీ మనసులో జ్యోతిని గురించి మరే విధమైన అభిప్రాయం లేక పోతే శైలజను గురించి కాస్త ఆలోచించు"

ఆనంద్ వైపు పరిశీలనగా చూశాడు వాసు.

"నీకు ఇష్టంలేని పని చెయ్యమని మాత్రం చెప్పను. మరెవరినైనా నీ జీవితంలోనికి ఆహ్వానించే ఉద్దేశం ఉంటే ఆ అవకాశం శైలజకే ఇవ్వమని చెబుతున్నాను"

"ఆనంద్ ! నా మనసు గురించి నీకు పూరిగా అర్థం కాలేదు. నిజం చెప్పాలంటే జ్యోతిని నేను మరచిపోలేకున్నాను. ఆ కారణంచేతే ఈ మూడు సంవత్సరాలనుండి నేను పెళ్ళి గురించి ఆలోచించలేదు''

"ఓకే...నీకేదైనా అలాంటి ఉద్దేశం కలిగితే ఆవిషయం నాకు ఢిల్లీకి రాయి" చెప్పాడు ఆనంద్.

"అలాంటి ఉద్దేశమే నాకు కలిగితే, తప్పక నీకు లెటర్ రాస్తాను"

వాచ్ చూసుకున్నాడు ఆనంద్. ఎనిమిది గంటలయింది.

"బార్ కెళ్దామా?" అడిగాడు ఆనంద్.

"పద" లేచాడు వాసు.

ఇద్దరూ డ్రింక్ చేశారు. భోంచేసిన తర్వాత ఇంటిదారి పట్టారు. ఆనంద్ తన ఇంటివైపు కదిలాడు. వాసు ఇంటికి చేరుకున్నాడు. మంచంమీద పడుకుని ఆలోచించసాగాడు–శైలజ గురించి. ఆమె తనను ప్రేమిస్తోందా? తనలో ఏమి ఆకర్షణ ఉందని ఆమె తనను ప్రేమిస్తోంది? ఏమిటో తనకేమీ అర్థం కావటం లేదు.

ఎంతసేపటికి నిద్రపట్టలేదు అతడికి.

* * *

రాత్రి పదిగంటలయింది.

తన బెడ్‌రూమ్‌లో అటూ ఇటూ తిరుగుతూ ఉంది జ్యోతి.

కిటికీ దగ్గర ఉన్న నైట్‌క్వీన్ పరిమళం ఆ గదిలో జొరబడి ఆమె గదిని పరిమళభరితం చేస్తోంది.

చేతిలో పుస్తకం బెడ్‌మీద పడేసి ఆమె ఆలోచనలలో పడింది.

తన ప్రేమ ఫలించబోతోంది.

ఆనంద్ చెప్పిన విషయం తనకు





బాధ కలిగించలేదు. తనకు ఆనందమే కలిగించింది.

వాసు తనకన్నా గొప్ప హోదాగల ఆడదానిని పెళ్ళిచేసుకోనని ఖచ్చితంగా చెప్పాడు.

మరి తమ కలయిక ఎలా సాధ్యం?

అందుకే తను అతడి స్థాయికి దిగి రాబోతోంది. ఉద్యోగానికి రాజీనామా చేయబోతోంది.

అది ఆమె ఎప్పుడో తీసుకున్న నిర్ణయం.

ఆమెకు నవ్వు వచ్చింది. వాసు ఓ స్థిర బిందువు అయితే తను ఓ చలన బిందువు. ఒకప్పుడు తన స్థాయి దిగువస్థాయి అని తనను అందుకోలేకపోయాడు వాసు. ఇప్పుడు తను అతడికన్నా పైకి ఎగబాకింది. అందుకే ఇప్పుడు తనకన్నా ఎగువస్థానంలోవున్న తనను చూసి భయపడుతున్నాడు. అందుకే తను అతడి స్థాయికి దిగి రాబోతోంది.

ఆమె కుర్చీలో కూర్చుని, టేబిల్‌లో నుండి ఓ కాగితం తీసుకుంది. పెన్ తీసుకుని లెటర్ రాయసాగింది.

అది రిజిగ్నేషన్ లెటర్.

రాసి పూర్తిచేసి, మరోసారి చదువుకుంది. కాగితం కవరులో పెట్టి టేబిల్ సొరుగులో పడేసింది.

ఆమెకు ఇప్పుడు తృప్తిగా వుంది.

ప్రేమించిన ప్రియుడి గుండెల్లో తల దాచుకున్నప్పుడు కలిగే ఆనందం ఈ హోదాలవలన వస్తుందా! – మనసులోనే అనుకుంది జ్యోతి.

రేపు ఈ లెటర్ తనపై అధికారులకు పంపాలి. వాళ్ళనుండి అనుమతి తీసు

కునేందుకు మరికొంతకాలం పడుతుంది.

ఈలోపు ఈ విషయం గురించి బయట వారికి ఎవ్వరికీ తెలుపకూడదు. మనసులోనే ఉంచుకోవాలి.

ఒకేసారి వాసుని ఆశ్చర్యపరచాలి. మనసులోనే అనుకుంది జ్యోతి.

జ్యోతి లేచి కిటికీ దగ్గరగా నడిచింది.

ఆకాశంలో చంద్రుడు తార కోసం పరుగెడుతున్నాడు.

ప్రేమికుల గుండెల్లో విరహాగ్ని పెంచే వెన్నెలరేడు ఆమె గుండెల్లోనూ అలజడి రేపాడు.

మరెంతకాలం... మరో వారంరోజులు. ఆ తర్వాత ప్రేమించిన ప్రియుడి గుండెల్లో తల దాచుకుని, ఈ వెన్నెలలోని చల్లదనాన్ని అనుభవిస్తూ, ఆ నెలరాజునే వెక్కిరిస్తాను. మనసులోనే అనుకుంది జ్యోతి.

అక్కడినుండి కదిలి వెళ్ళి బెడ్‌మీద పడుకుంది.

ఆమెకు ఏవేవో ఆలోచనలు, ఏవేవో తీపి ఊహలు. ఆ రాత్రి ఆమెకు నిద్ర పట్టలేదు.

బెడ్‌మీద అటూ ఇటూ పొర్లాడి ఏ అర్ధరాత్రి సమయంలోనో నిద్ర పోయింది జ్యోతి.

* * *

ఆరోజు శంకరం పెళ్లి. తను ఖచ్చితంగా రావాలి అని అనడంతో వాసుకు వెళ్ళక తప్పలేదు ఆరోజు.

ముందురోజు సాయంత్రం శంకరం గ్రామానికి ప్రయాణమయ్యాడు వాసు. పనిమనిషికి స్వప్నను అప్పగించి, ఆ సాయంత్రం బస్సులో గ్రామానికి చేరుకున్నాడు. మర్నాడు ఉదయం ఏడు గంటలకు పెళ్లికూతురు ఇంట్లో పెళ్ళి. ఆరోజు రాత్రి భోజనాలు అయిన తర్వాత ఓ కునుకు తీసిన పిదప అక్కడి నుండి బస్సు పెళ్ళికూతురు ఇంటికి బయలు దేరుతుంది.

ఆ రాత్రి భోజనాల సమయంలో శంకరం చెప్పాడు – "గురూ! ఎవరితోనైనా, ఎంతసేపైనా మాట్లాడు. ఎవరి పక్కనైనా కూర్చో. కానీ మా నాన్నతో మాట్లాడకు, మా నాన్న పక్కన కూర్చోకు"

"ఏం? మీ నాన్న ఏమైనా మెంటల్ కేసా?" అనుమానంగా అడిగాడు వాసు.

"కాదు గురూ! ఆయన పెళ్లిళ్ల పేరయ్య. ఆయనకు మనలాంటి కుర్రాళ్ళు కనిపించారనుకో, మన పెళ్ళి అయిందా లేదా అన్న వివరాలన్నీ అడుగుతాడు. చెప్పావనుకో. తర్వాత నీ అడ్రసు రాసుకుంటాడు. ఆ తర్వాత వారానికి ఓ రోజు నీ ఇంటికి వస్తాడు. ఆ రోజంతా విఘ్నేశ్వరుడిలా ఆరగిస్తాడు. అమ్మాయిని చూసేందుకు ఏదో ఊరు వెళ్తున్నానని దారికి డబ్బులు ఇవ్వవోయ్ అంటూ పది రూపాయలు గుంజుకుంటాడు"

"ఇలాంటి మోసం కూడానా?"

"పూర్తి మోసం కాదులే గురూ! నీకు అమ్మాయిని చూస్తాడు. కానీ ఈలోపే నీకు పెళ్లంటేనే విరక్తి కలిగేట్టు చేస్తాడు"

"అలాగా" అన్నాడు వాసు.

"కాస్త జాగ్రత్తగా ఉండు గురూ! పిలయినంతవరకూ ఆయన పక్కన కూర్చోకు" చెప్పాడు శంకరం.

"అలాగే" చెప్పాడు వాసు.

భోజనాలు అయిన తర్వాత ఓ కునుకు తీసిలేచారు అందరూ. లేచి ముఖం కడుక్కున్నారు.

అప్పటికే సిద్ధంగా ఉన్న బస్సు

ఎక్కుతున్నారు అందరూ.

అందరూ ఎక్కిన తర్వాత, తనూ ఎక్కి ఓ సీట్లో కూర్చున్నాడు వాసు. ఆ తర్వాత ఎక్కాడు శంకరం తండ్రి రామాంజనేయులు. అటూ ఇటూ చూసి వాసు ఉన్న సీట్లో అతడి పక్కనే కూర్చున్నాడు. గతుక్కుమన్నాడువాసు.

బస్సు బయలుదేరింది. ఆయన మాటలు మొదలుపెట్టాడు.

"మావాడి ఆఫీసులోనే కదోయ్ ... నువ్వు పనిచేసేది"

"అవునండి"

"నీ పేరేమిటి?"

"వాసు"

"పెళ్లయిందా?"

"అయిందండి"

"పోనీ పెళ్లి కెదిగిన పిల్లలున్నారా?"

"నా వయస్సు ఇరవై ఏడేళ్ళేనండి"

"ఓ! ఇరవై ఏడేళ్ళకే పెళ్లి కెదిగిన పిల్లలు ఉండరుకదూ! అయితే భార్యా బిడ్డలు క్షేమమే కదూ!"

"భార్య చనిపోయిందండి" చెప్పిన తర్వాత ఎందుకు చెప్పానా అని బాధ పడ్డాడు వాసు.

"భార్య చనిపోయిందా? ఎలా చని పోయింది?" అతడి కంఠంలో ఆనందం.

"యాక్సిడెంట్ లో చనిపోయింది. బస్సు యాక్సిడెంట్"

"చనిపోయి ఎన్నేళ్లు అయిందోయ్?"

"మూడేళ్ళు అయింది" వివరాలు చెప్పకూడదని ఉన్నా, స్నేహితుడి తండ్రని విసుక్కోవడం బాగుండదని మాట్లాడుతూ ఉన్నాడు వాసు.

"మరి మూడేళ్ళనుండి పెళ్ళి ఎందుకు చేసుకోలేదోయ్? ఎక్కడబడితే అక్కడ పాలు దొరుకుతుంటే ఆవుని కొనుక్కొచ్చి ఇంట్లో కట్టేసుకోవడం ఎందుకు? అని ఓ పెద్దమనిషి అన్నాడట. అలాగే ఉందా నీ పరిస్థితి?''

"అదేమీ కాదండి! కాకపోతే పెళ్ళి చేసుకోవడం ఇంట్రెస్ట్‌లేదు"

"ఇంట్రెస్ట్ ఉండి అన్నం తింటు న్నామటోయ్? ఇదీ అంతే. పెళ్ళికూడా ఓ తప్పనిసరి అవసరమోయ్! ఈరోజు పెళ్ళి చేసుకోకపోతే రేపు నీ ముసలి తనంలో నిన్ను ఎవరు చూస్తారోయ్? ఎవరూ చూడరు. ఈ పిల్లలు మనల్ని చూడరయ్యా! వాళ్ళ ఉద్యోగాలు చూసుకుని వాళ్ళు వెళ్ళిపోతారు. అందుకే మన జీవితాంతం మనకు తోడు ఉండేది మన ధర్మపత్నేనోయ్...''

ఆయన ఏదేదో చెప్పుకుపోతున్నాడు. విధిలేనట్టు అక్కడే కూర్చుని మనసు మరో వైపు మళ్ళించాడు. ఎంతసేపటికీ ఆయన వాక్ప్రవాహం ఆగలేదు. భరించ లేకపోయాడు వాసు.

"ఏమండీ! నాకు నిద్రొస్తోంది. కాసేపు నిద్రపోతాను"

"నిద్రా! మీలాంటి కుర్రాళ్ళు ఎనిమిది గంటలకన్నా ఎక్కువ నిద్రపోకూడ దోయ్! మనిషి తన జీవితంలో అర్థ భాగం నిద్రలోనే గడిపేస్తున్నాడోయ్. ఓ మనిషి ఎనిమిదిగంటలు నిద్రపోతా డనుకుంటే మూడింట ఒకవంతు కాలాన్ని నిద్రలోనే గడుపుతున్నట్టు. ఒక్కొక్క రయితే రోజుకు పన్నెండు గంటలుకూడా నిద్రపోతారోయ్. నామటుకు నేను రోజుకు నాలుగు గంటలు మాత్రమే నిద్రపోతా నోయ్..."

ముందుసీట్లో నుండి శంకరం జాలిగా చూశాడు వాసువైపు. విధిలేక బడిపంతులు ముందు కూర్చుని తలవూపే విద్యార్థి

గుర్తుకు వచ్చాడు శంకరంకు.

"కాబట్టి నేను చెప్పేదేమిటంటే ... మనిషికి పెళ్ళి ఎంతో ముఖ్యమైనది. నీకు ఓ మంచి అమ్మాయిని చూసి పెడతాను. నీ అడ్రసు చెప్పవోయ్" జేబులోనుండి ఓ పుస్తకం తీశాడు రామాంజనేయులు.

అందులో ఎన్నో అడ్రసులు ఉండడం చూశాడు వాసు. వీళ్ళంతా రామాంజనేయ బాధిత బ్రహ్మచారులు కాబోలు మనసులోనే అనుకున్నాడు వాసు.

ఇక విధిలేక చెప్పాడు వాసు. రాసుకున్నాడు రామాంజనేయులు. ఆ బాధ అంతటితో పోయిందనుకుని సంతోషించాడు వాసు. కానీ అంతటితో ఆగలేదు ఆయన. తను చేసిన పెళ్ళిళ్ళ గురించి, సొంతడబ్బా కొట్టుకోసాగాడు. ఆ ప్రయాణం ఓ పీడకలగా మారింది వాసుకు.

బస్సు దిగగానే శంకరం అన్నాడు –

"గురూ! ఈ ఏటి అత్యుత్తమ రామాంజనేయ బాధితుడి అవార్డు నీకు ఇచ్చెయ్యొచ్చు"

"ఏం?" నీరసంగా అన్నాడు వాసు.

"మా నాన్న పక్కన కూర్చుని ఆయన చెప్పినదంతా ఇంత సేపు విన్న మొట్టమొదటి వ్యక్తివి నీవే గురూ"

అందరూ పెళ్ళికూతురువాళ్లు ఏర్పాటు చేసిన విడిదిలోకి వెళ్ళారు.

పెళ్ళి మొదలు అయింది. మేళతాళాలు మోగుతున్నాయి.

శంకరం చెప్పినట్టు పెళ్ళికూతురు కాస అనాకారే. శంకరంకు సరయిన జోడీ మాత్రం కాదు – మనసులోనే అనుకున్నాడు వాసు.

ఆ పెళ్ళిలో తన నీచపుబుద్ధి చూపించాడు రామాంజనేయులు.

పెళ్ళితంతు మంత్రాలు జరుగుతున్నాయి. శంకరం ముఖం కళకళలాడుతూ ఉంది పెళ్ళి కళతో.

అప్పుడే లోపలి నుండి కోపంగా వచ్చాడు రామాంజనేయులు.

"రేయ్ శంకరం! ఆ దండ ఆ పిల్ల మొహాన విసిరి లేచిరారా!"

"ఏం జరిగింది నాన్నా?" పెళ్ళిపీటల మీద నుండి అడిగాడు శంకరం.

"అప్పుడు చెప్పిన కట్నం, చెప్పిన కట్నం డబ్బులో పదివేలు తర్వాత ఇస్తారట. పూర్తి డబ్బులు ఇచ్చిన తర్వాతే తాళి కడదాం. లేచిరా... పోదాం" బిగ్గరగా అనసాగాడు రామాంజనేయులు.

శంకరం లేచాడు.

రామాంజనేయుల్ని అతని వియ్యంకుడు బతిమలాడుతూ వున్నాడు. ససేమిరా అంటూ ఒప్పుకోవడంలేదు రామాంజనేయులు. అంతలో అదే ఊళ్లో ఉన్న పెళ్ళికూతురి తరపు బంధువు ఒకాయన ఇంటికెళ్ళి అవసరం కోసం ఉంచుకున్న పదివేలు తెచ్చి ఇవ్వడంతో సంతోషించాడు రామాంజనేయులు.

"రేయ్ శంకరం! వెళ్ళి పెళ్ళిపీటల మీద కూర్చో"

చెప్పినట్టే చేశాడు శంకరం.

వాసు శంకరం వంక అసహ్యంగా చూడసాగాడు. ఇతగాడు ఇంత వ్యక్తిత్వం లేనివాడా! పాతికేళ్ళు ఉన్న ఈ యువకుడు తండ్రి ఎలా చెబితే అలా నడుచుకునే కీలుబొమ్మా! తండ్రి చెపితే మాత్రం ఇంతమంది మధ్య కాబోయే సహధర్మచారిణిని అలా పీటల మీదనే వదిలి వచ్చేందుకు ఎంత సిగ్గు లేదు అతడికి. అంతమాత్రం తండ్రిని ఎదిరించలేని పిరికివాడా!

"పిరికివాడు" అనుకోగానే ఒకనాటి తన స్థితి గుర్తుకు వచ్చింది వాసుకు. తను కూడా ఒకనాడు అలా తల్లిని ఎదిరించ లేని పిరికివాడయే కదా జ్యోతిని పోగొట్టుకుంది. పిరికితనంతోనే కదా వందనను బాధలపాలు చేసింది. పిరికితనం అంటే ఇలా వ్యక్తిత్వం లేని విధంగా ఉంటుందా! కానీ ఒకటి మాత్రం నిజం. ఆనాడు కూడా తను మరీ ఇంత పిరికి వాడు కాదు. తనకి ఆనాడూ వ్యక్తిత్వం ఉండేది. కానీ పిరికితనం చాటున ఆ వ్యక్తిత్వం కప్పబడిపోయింది. ఈనాడు ఆ పిరికితనాన్ని చాలావరకు పోగొట్టు కున్నాడు తను.

ఒకనాటి తన పిరికితనాన్ని తలచు కుంటే, తనకు ఈనాటికీ సిగ్గేస్తుంది.

"రేయ్ శంకరం....ఆగరా"

రామాంజనేయులు పిలుపుతో ఈ లోకంలోకి వచ్చాడు వాసు.

రామాంజనేయులు మరోసారి రౌద్రంగా పెళ్ళి మండపం వైపు వెళ్తున్నాడు.

"ఏం జరిగింది నాన్నా?" అడిగాడు శంకరం.

"అమ్మాయికి పెడతానన్న బంగారం మూడు సవరలు తగ్గించారు. బంగారం సంగతి తేలిన తర్వాతే అక్కడ కూర్చుందువు రారా"

"రెండు నిముషాలు ఉండండి నాన్నా...తాళికట్టి వస్తాను" చెప్పాడు శంకరం.

"తాళి కట్టిన తర్వాత వాళ్ళు మన మాట లెక్క చేయరు. ముందు అక్కడి నుంచి లేచి రారా" అరిచాడు రామాంజ నేయులు.

"రెండు నిముషాలు మీరు మౌనంగా ఉండండి నాన్నా! బాజాలూ .... మీరు మోగించండి. అయ్యా పురోహితులూ... ఆ తాళిబొట్టు ఇలా ఇచ్చి మీరు మంత్రాలు చదివేయండి"

ఆశ్చర్యంగా మంగళసూత్రాలు చేతికి ఇచ్చాడు పురోహితుడు....తాళి ఆ అమ్మాయి మెడలో కట్టేశాడు శంకరం.

రామాంజనేయులు అరుస్తున్నాడు. ఆయన కదలకుండా ఇద్దరు చెరో భుజం పట్టుకుని ఉన్నారు. పెళ్ళి అయిపోగానే వదిలేశారు ఆతడిని.

"ఇక పోదాం పద నాన్నా" కామ్‌గా అన్నాడు శంకరం.

"ఒరే! నీకు బుద్ధి ఉందా? నీ తండ్రిని నేను చెబుతున్నా ఆ పిల్ల మెడలో తాళి కట్టేస్తావా?" అరిచాడు రామాంజనేయులు.

"బుద్ధి ఉంది కాబట్టే ఆపని చేశాను. లేకపోతే నువ్వు కూర్చోరా అంటే కూర్చోనేదానికి, లేచిరారా అంటే లేచి వచ్చేదానికి నేనేమైనా కీలు బొమ్మను అనుకున్నావా!"

"ఛీ! నా కడుపున చెడ పుట్టావురా!"

"అవును...చెడిపోయిన నీ కడుపున చెడ పుట్టాను" చెప్పాడు శంకరం.

ఇక రామాంజనేయులు అరుపులను పట్టించుకోకుండా, జరగవలసిన పెళ్ళి పనులు జరిగిపోసాగాయి.

శంకరంని అభినందించాడు వాసు. మధ్యాహ్నం భోజనాలయిన తర్వాత శంకరంకి చెప్పి బస్సు ఎక్కేశాడు వాసు.

* * *

'తమాషా పెళ్ళి' రిషాలో ఇంటికి తిరిగి వస్తూ మనసులోనే అనుకున్నాడు వాసు.

అప్పుడు సాయంత్రం నాలుగుగంటలు అవుతోంది.

రిషా దిగి, రిషావాడికి డబ్బులిచ్చాడు. వాకిలి దగ్గరగావేసి ఉంది. స్వప్న

లోపల ఉందేమోననుకుంటూ లోపలికి అడుగు పెట్టి పిలిచాడు 'స్వప్నా..స్వప్నా' అంటూ. ఎలాంటి సమాధానం లేదు. పనిమనిషిని కేకలేశాడు. సమాధానం లేదు. తలుపు తాళం వేయకుండా ఎక్కడికెళ్లారబ్బా మనసులోనే అనుకున్నాడు.

ఎవరూ లేకుండా ఇల్లు ఇలా? ఏదో అనుమానం వచ్చి వంటఇంటిలోనికి వెళ్లాడు. అక్కడ నిలబడి కాఫీ కలుపుతున్న వ్యక్తినిచూసి నోట మాట రాలేదు వాసుకు.



"మీరు..మీరు...ఇక్కడ...ఇలా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"కాబోయే భార్యను ఇంకా ఇలా మీరు అనడం బాగాలేదు"చేతికి కాఫీకప్పు ఇచ్చి, అతడి మెడచుట్టూ చేతులువేస్తూ అంది జ్యోతి.

"మే డ మ్..." ఆమె చేతులు తప్పించుకోబోయాడు.

"ఇంకా మేడమ్ లేదు గిడమ్ లేదు. ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాను"

"ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశారా! ఎందుకని?"

"మీకన్నా ఎక్కువ హోదాలోవుండే స్త్రీని పెళ్ళిచేసుకోవడం మీ వ్యక్తిత్వానికి దెబ్బని చెప్పారటగా...ఆ మాట నాకూ నచ్చింది. అందుకే ఆ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాను" మెడమీద చేతులు తీసి చెప్పింది.

"నాకోసం అంత పెద్ద హోదావున్న ఉద్యోగం వదులుకున్నారా?"

"పోనీ! ఆ ఉద్యోగం లేకపోతే పోయింది. మీలాంటి ప్రేమించినవాడిని దూరంచేసుకునే ఉద్యోగం నాకు అక్కర లేదు"

"మీ భవిష్యత్తుని పాడుచేశాను కదూ!"

"ఎంత పైకివెళ్ళినా, సుఖం అనేది మనసు తృప్తిపడేదానిలో ఉంటుంది. మీ గుండెల్లోనే నాకాతృప్తి లభిస్తుందనుకున్నాను. ఆ ఉద్యోగాన్ని వదులుకున్నాను. అయినా నేను ఏకవచనంలోకి దిగితే నువ్వింకా బహువచనంలోనే గౌరవిస్తున్నావే"

"జ్యోతీ..ఇది నిజమా!" ఆశ్చర్యంగా అడిగాడు వాసు.

"మరి"

"నాకేదో కలలాగా తోస్తోంది"

చటుక్కున గిచ్చింది జ్యోతి. 'అబ్బా' అన్నాడు వాసు.

"ఇప్పటికయినా అర్థం అయిందా! ఇది కలకాదు...నిజం అని"

"జ్యోతీ" ఆమెను దగ్గరకు తీసుకున్నాడు వాసు.

ఆ కౌగిలిలో ఇమిడిపోయింది జ్యోతి. ఎన్నాళ్ళనుండో ప్రేమను గుండెల్లోనే దాచుకున్న ఆ ప్రేమికులకు ఆ క్షణం ఓ మధురస్వప్నం. ఈ భౌతిక ప్రపంచాన్ని మరచి ఆనందాంబుధిలో, మరో లోకంలో విహరిస్తూన్న వాళ్ళకు స్వప్న పిలుపు వినిపించింది.

"డాడీ...తలుపు వేసుకోండి. నేను ఆడుకొనేందుకు వెళ్తున్నాను"

ఉలిక్కిపడి పక్కకుజరిగారు ఇద్దరూ.




స్వప్న వెళ్తున్న చప్పుడయింది. నవ్వు కున్నారిద్దరూ. అదేక్షణం బయట ఆనంద్ గొంతు వినిపించింది.

"డాడీ ఉన్నారా లోపల?"

"ఉన్నారు అంకుల్! మమ్మీ కూడా వుంది"

"మమ్మీనా..ఆవిడెవరు?"ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద్.

"వాళ్ళ ఆఫీసరమ్మ. ఇప్పుడు మమ్మీ అయిపోయింది నాకు"

"అలాగా" ఆశ్చర్యంగా లోపలికి నడిచాడు ఆనంద్. స్వప్న ఆడుకోను వెళ్ళిపోయింది.

ఆనంద్ గొంతు విని ఇవతలకు వచ్చారు జ్యోతి, వాసులు.

ఆ ఇంట్లో జ్యోతిని చూసి నోటిమాట రాలేదు ఆనంద్‌కు.

"మీరు...మీరు ఇక్కడ?"

"నేను ఇక్కడకు రాకూడదా?" నవ్వుతూ అడిగింది జ్యోతి.

"మరి స్వప్న...మమ్మీ"

"నిజమేనండీ! ఇప్పుడు స్వప్నకు నేను మమ్మీని అయిపోయాను"

"రియల్లీ"

"మరి మీరు ఊరువెళ్ళేలోపు నా నిర్ణయం మీకు తెలుస్తుందని చెప్పానుగా! ఇదే నేను ఆరోజు తీసుకున్న నిర్ణయం కాకుంటే అమలుపరచడంలో ఆలస్య మయింది" చెప్పింది జ్యోతి.

"మరి మీ అంతస్తు పెద్దదని వాసు ఆరోజు అన్నాడు. మరి ఈరోజు..." ఆగాడు ఆనంద్.

"అందుకే నేను నా హోదాను వదులుకుని అతనికి తోడుగా వచ్చేశాను. అంటే నా ఉద్యోగానికి రిజైన్ చేసేశాను" చెప్పిందామె.

"వ్వాట్" అదిరిపడ్డాడు ఆనంద్.

"తప్పదుకదా! వాసుని నావాడిగా చేసుకోవాలనుకున్నాను. అందుకే అతడి స్థాయికి నేను దిగి వచ్చేశాను" నవ్వుతూ చెప్పింది జ్యోతి.

"ఓ మంచి ఉద్యోగం వదులు కున్నారా?" ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద్.

"ఓ వ్యక్తిత్వం కలవాడు భర్తగా కావాలని కోరుకున్నప్పుడు అలాంటి త్యాగంచేయక తప్పదు కదా!"

"నాకింకా ఆశ్చర్యంగానే ఉంది''

అప్పటివరకూ మౌనంగా ఉన్న వాసు అన్నాడు–

"ఆనంద్! ఒకప్పుడు నీ పెళ్ళి నేను దగ్గరుండి జరిపించాను. అలాగే ఈరోజు నా పెళ్ళికి నువ్వు దగ్గరుండి అన్నీ చూడాలి"

"తప్పదుగా! రేపు ఊరెళ్లాలని ఈరోజు నీకు చెప్పేందుకు వచ్చాను. అనుకోకుండా ఇక్కడ ఓ అసంపూర్ణ అద్భుత సంఘటన జరిగింది. ఇక అసం పూర్ణాన్ని సంపూర్ణం చేసి వెళ్ళాల్సిన బాధ్యత నాదే కదా" నవ్వుతూ అన్నాడు ఆనంద్.

జ్యోతి లోపలికి వెళ్ళి కాఫీ తీసుకు వచ్చింది.

"జ్యోతిగారూ! ఎలాగయితేనేం, పిరికి వాడయిన నా స్నేహితుడు ఈనాటికి ఓ ధైర్యవంతమైన పని చేయగలిగాడు. అంతలా మార్చిన మిమ్మల్ని అభినంది స్తున్నాను" చెప్పాడు ఆనంద్.

"అప్పుడే ఏమయింది! ఆయనలో ఇంకా మిగిలివున్న పిరికితనాన్ని పూర్తిగా తుడిచివేస్తాను. ఆయనని ధైర్యవంతుడిగా తీర్చిదిద్దుకుంటాను" చెప్పింది జ్యోతి.

నిజమే...అడది తలచుకుంటే చేయలేని పని ఏముంటుంది?

ఆనంద్ మదిలో ఆ క్షణం అనుకోకుండానే శైలజ మెదలాడింది. ఒక్క క్షణం బాధపడ్డాడు ఆమె గురించి. కానీ మరుక్షణం ఆ బాధను తుడిచివేసుకుని మనస్ఫూర్తిగా వాసు, జ్యోతిలతోపాటు ఆనందం పంచుకున్నాడు.

ఆనంద్ ఆ రాత్రి చాలా పొద్దుపోయినంతవరకూ వాళ్ళతోనే గడిపాడు. చాలా పొద్దుపోయిన తరువాత ఆనంద్ ఇంటికి వెళ్ళాడు. ఆనంద్ వెళ్ళిన తర్వాత వాసు జ్యోతిని దగ్గరకు తీసుకోబోయాడు. వాసుని వారించి జ్యోతి అన్నది-

"రేపు ఉదయమే మా ఇంటికి వెళ్తాను. మళ్ళీ మన పెళ్ళయిన తర్వాతే ఈఇంట్లోకి అడుగు పెడతాను. అప్పుడే ఇవన్నీ..."

ఆ రాత్రి జ్యోతి స్వప్న దగ్గర పడుకుంది. వాసు మరో గదిలో పడుకున్నాడు.

* * *

ఆరోజు వాసు, జ్యోతిల పెళ్ళి ఓ గుడిలో జరిగిపోయింది. వాసు బంధువులు ఎవరూ ఆ పెళ్ళికి రాలేదు. జ్యోతి తల్లి మాత్రం ఆ పెళ్ళికి హాజరయింది.

పెళ్ళయిన రోజు సాయంత్రం వాసు తన మిత్రులకు ఓ పార్టీ ఏర్పాటుచేశాడు. ఆ పార్టీకి అతిథులు ఒక్కొక్కరే వచ్చి కంగ్రాట్స్ చెప్పి బహుమతులు అందజేస్తున్నారు.

ఓచేత కవరు పట్టుకుని సతీసమేతుడై లోనికి అడుగుపెట్టాడు శంకరం. చేతిలోని ప్రజెంటేషన్ జ్యోతి చేతిలో ఉంచి "కంగ్రాట్స్" చెప్పాడు. ఆ తర్వాత వాసును పక్కకు పిలిచి మెల్లగా అన్నాడు-

"సారీ గురూ! మీరిద్దరూ పాత ప్రేమికులని నాకు తెలియదు. అది తెలియకనే నీ ముందు ఏదేదో వాగాను. అవన్నీ మనసులో ఉంచుకోకు...ఐయామ్ రియల్లీ సారీ గురూ!" చేయిపట్టుకుని అన్నాడు శంకరం.

"ఇట్సాల్‌రైట్! టేకిట్ ఈజీ" భుజం తట్టాడు వాసు.

పార్టీ జరుగుతూ ఉంది.

ఆనంద్ ఆ జంట దగ్గరగా వచ్చి అన్నాడు.

"మీరిద్దరూ ఇన్నేళ్ళ తర్వాత ఇలా కలుసుకోవడం నాకెంతో ఆనందంగా ఉంది. ఏనాడో విడిపోయిన మీరు ఈనాడు ఇలా కలుసుకోగలరని నేను కలలో కూడా అనుకోలేదు"

"అనుకోనివి జరగడమేగా జీవితం" పక్కనేవున్న శంకరం అన్నాడు.

నవ్వారు ఆ ఇద్దరూ. పక్కనే ఉన్న స్వప్న ఆనందంతో అంది-

"అంకుల్! చిన్నమాట"

ఆనంద్ వంగి స్వప్నకు చెవి అందించాడు.

"అంకుల్! మా మమ్మీ ఆరోజు బట్టలకొట్లో మా డాడీతో అలా మాట్లాడినప్పుడు నేను కూడా అనుకోలేదు...ఆమె నాకు మమ్మీ అవుతుందని"

"ఏమిటి?" స్వప్న అలా ఏదో చెప్పడం చూసి అడిగారు జ్యోతి వాసులు.

స్వప్న చెప్పింది చెప్పాడు ఆనంద్.

ఆ జంట మరోసారి నవ్వుకుంది.

★

# చతుర కతలు



## అసలు రహస్యం

హెడ్‌క్లర్క్ రూంలోనుంచి కాలింగ్ బెల్ విన్పించింది. ప్యూన్ పుట్టన్న క్లర్కులందరికీ కాఫీ పంచుతున్నాడు.

హెడ్‌క్లర్క్ హనుమంతరావు కోపం సంగతి తెలిసినవారే అందరూ!

"వెళ్ళు పుట్టన్నా! మేం తీసుకుంటాంలే కాఫీ. మళ్ళీ లేనిపోని గొడవ" అన్నాడు ఓ క్లర్కు.

"ఎందుకు సార్! అంత భయపడతారు? వాడేమన్నా మింగుతాడా మిమ్మల్ని? మీరేం కల్లుతాగి తందనాలాడటంలేదే! రోజంతా కష్టపడుతున్నారు. కాస్త రిలాక్స్ అవడానికి కాఫీ తాగుతున్నారు. ఇందులో తప్పేమిటి?" అన్నాడు ప్యూన్ విసురుగా.

లేడీ టైపిస్టు రమణి, "కాస్త తగ్గించి మాట్లాడు నాయినా! ఆయన విన్నాడంటే నీ వుద్యోగానికి మంగళం పాడేస్తాడు"

అంది భయం భయంగా.

"వాడేం చేస్తాడు! చూడండి..వాడి పని ఎట్లా పడతానో" అంటూ విసురుగా తలుపులు తీసి హెడ్‌క్లర్క్ రూమ్‌లోకి వెళ్ళాడు పుట్టన్న.

ఆ రూమ్‌లోంచి పుట్టన్న కేకలు విన్పించసాగాయి. గట్టిగా "ఏంటి సార్ బెల్ ఎందుకంత పెద్దగా మోగిస్తారు? నాకేమైనా చెవుడనుకున్నారా? నేను తొందరగా రాలేదంటే అక్కడ నాకు పనివున్నట్లు అర్థం చేసుకోలేరా! ఇంత సర్వీసు వుంది. ఆమాత్రం తెలుసుకోక పోతే ఎట్లా సార్!".....వగైరా.

క్లర్క్‌లు అంతా వొకరి మొహం వొకరు చూసుకున్నారు.

గుసగుసలు మొదలయినయి. "ఈ వెధవకి ఎంత ధైర్యం వచ్చింది! తాగొచ్చినట్లున్నాడు" అనుకొంటూండగానే మళ్ళీ పుట్టన్న గొంతు విన్పించేసరికి నిశ్శబ్ద మయ్యారు.

"మీరేమనుకుంటున్నారు సార్? ఈ బల్ల మీద దుమ్ము దులుపేందుకు — మీరు బెల్లు కొట్టటం, నేనక్కడ పని వదిలి రావటం. ఇదంతా ఎందుకు ఈలోగా మీరే క్లీన్ చేయొచ్చుగదా!"

పెద్దగా అరుస్తూ రూమ్‌లోంచి వచ్చి బయటకు వెళ్ళిపోయాడు. అందరూ వాడి వంక ఆశ్చర్యంగా చూస్తూ నోరు తెరుచుని వుండిపోయారు.

క్లర్క్ గణేష్ కళ్ళు గుండ్రంగా తిప్పుతూ, "ఇలాటి సంఘటన మనం ఎప్పుడూ చూడలేదు. పుట్టన్న ధాటికి హెడ్‌క్లర్క్‌గారికి చెమటలు పట్టి వుంటాయి. లేకపోతే మనమెంత మంచిగా వున్నా, చీటికిమాటికి చివాట్లు పట్టడం అలవాటైపోయింది ఈ 'అయ్యగారి'కి" అన్నాడు.

టైపిస్టు రమణి, "గుండూరావుగారూ! నాకేదో అనుమానంగా వుంది. అసలు హనుమంతరావు గదిలో వున్నాడో లేడో చూద్దామా ముందు" అంది. అందరూ 'సరే'నన్నారు. గణేష్ వెళ్ళి స్ప్రింగ్‌డోర్ కింద నుంచి చూశాడు.

"నాకు వాడి కాళ్ళు కన్పడినయి. అంటే..వాడు వున్నట్టేలెక్క" అన్నాడు అందరికీ వివరిస్తూ.

"నిజంగా వింతగా వుంది. పుట్టన్న అంతేసి మాటలన్నాడు కదా! అయినా నోరు మెదపలేదు హెడ్‌క్లర్క్. ఎందుకో!" అంది ఆశ్చర్యంగా నళిని.

అరగంట తరువాత తిరిగి వచ్చాడు పుట్టన్న. ఆత్రుతను అణచుకోలేక వాడి చుట్టూ చేరారు అందరూ.

"హెడ్‌క్లర్క్ అంత నిశ్శబ్దంగా ఎలా వున్నాడు...నీ వన్ని తిడుతున్నా?" అంటూ ప్రశ్నలు కుమ్మరించేశారు.

"సార్! ఇలాంటి అవకాశం కోసం ఎన్నాళ్ళనుంచో ఎదురుచూస్తున్నాను. ఈ వేళే ఆయన తనపళ్ళన్నీ డెంటిస్ట్ వద్ద పీకించుకుని వచ్చాడు. మా బావమరిది అక్కడ అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాడు లెండి. కనీసం మరో వారంరోజులదాకా ఈయన నోరెత్తలేడట. ఈ వారం రోజుల్లోనూ నా నోటి దురద మొత్తం వదిలించుకుంటా. పైగా నాకు నిన్ననే ట్రాన్స్‌ఫర్ ఆర్డరు కూడా వచ్చినయి. వీడికి మళ్ళీ నోరు వచ్చేసరికి నేనుండను" అంటూ అసలు రహస్యాన్ని విప్పి చెప్పాడు నింపాదిగా.

—కస్తూరి రాజశేఖర్




# ప్రమోషన్

అహోబలరావు సీట్లో కూర్చుని తాపీగా దమ్ము కొడుతున్నాడు. కళ్ళు సగం మూసుకుని ఏదో కలలు కంటున్నట్లు పోజు పెట్టాడు.

మరోవైపు తలకాయని ఏదో ఫైలు మధ్యలోకి ఇరికించేసి సీరియస్‌గా పని చేసుకుంటున్నాడు కృష్ణావతారం.

“వాళ్ళిద్దరే కదూ తనకి మనశ్శాంతి లేని గొర్రె తోక బతుకు బతుకుతున్నాడు. అందువల్లనే వీళ్ళందరికీ తనంటే చిన్నచూపు' బాధగా గొణుక్కున్నాడు శివలింగం.

అదో ప్రయివేటు కంపెనీ. ప్రతి సంవత్సరం ఆఖర్న తమ బ్రాంచి ఆఫీసులో ఎవరెవరు ప్రమోషన్‌కి అర్హులో కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్ తయారు చేసి పంపుతుంటారు.

ప్రస్తుతం 'కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్' తయారైపోయింది.



పొద్దున్న ఆఫీసుకి రాగానే బాస్ పర్సనల్ సెక్రటరీ పరిమళని, “హెడ్డాఫీసుకి ఎవరెవరి పేర్లు వెళ్తున్నాయి?” అని ఆరాటంగా అడిగాడు శివలింగం.

‘‘బహుశా అహోబలరావో, కృష్ణావతారమో’’ టక్కున చెప్పి, తన పనిలో లేకుండా చేసింది'' పళ్ళు పటపటా కొరికాడు శివలింగం.

శివలింగం పటపటమంటూ చేసిన పళ్ళ చప్పుడికి, టకటకమంటూ టైపు కొడుతున్న సుందరి తలెత్తి శివలింగం వైపు చూసి ఓ చిర్నవ్వు పడేసింది. శివలింగం కోపం మరో అంగుళం పైకెగబాకింది.

‘ప్రతి అడ్డమైనవాళ్ళకి తను చులకనే–ఈ గుమాస్తాగా ఎదుగు బొదుగూ

తాను మునిగిపోయింది పరిమళ.

శివలింగం గుండె భగ్గుమంది.

"ఈ ఏడైనా ప్రమోషన్ వస్తుందని తనెంతో ఆశ పెట్టుకున్నాడు. పానకంలో పుడకల్లా అడ్డుపడ్డారు ఆ అహోబల రావ్‌గాడు, కృష్ణావతారంగాడు. తనకి రాకపోయినా బాధలేదు. ఆ కృష్ణావతారానికిగాని, అహోబలరావ్‌కి గాని మాత్రం ప్రమోషన్ రాకూడదు" తీర్మానించేసుకున్నాడు శివలింగం.

సాయంత్రం ఇంటికెళ్తుండగా దార్లో తగిలాడు ప్యూన్ సీతయ్య. మెల్లగా సైకిల్ తొక్కుకుంటూ వెళ్తున్నాడు. అతని చేతిలో బ్రౌన్ కవర్ వుంది.

ఆ కవర్ లక్కతో అతికించబడింది.

ఆ కవర్ని చూడగానే శివలింగం కళ్ళు మెరిశాయి.

"ఎందాకా సీతయ్యా?" లేని అప్యాయతని అరువు తెచ్చుకొని అడిగాడు శివలింగం.

"ఇక్కడికే! పోస్ట్ వేళ దాటిపోయింది కదా! మేనేజర్‌గారు దీన్ని 'ఆర్ ఎమ్మెస్'లో పోస్ట్ చెయ్యమంటే..." చెప్పాడు సీతయ్య.

"నేను మా ఇంటికి స్టేషన్ దాటే వెళ్ళాలిగా! దార్లో వెళ్తూ వెళ్తూ పోస్ట్ చేసేస్తాను..ఇటివ్వేయ్" అన్నాడు శివలింగం.

"మీకెందుకండీ శ్రమ?" మొహమాట పడ్డాడు సీతయ్య.

"ఫర్వాలేదు" అంటూ చనువుగా ఆ కవర్ని తీసుకున్నాడు శివలింగం.

కవరు చేతిలోకి రాగానే, ఏనుగెక్కినంత సంబరపడ్డాడు. ఇంటికి వెళ్ళగానే భార్యకి ఆ కవరిచ్చి చెప్పాడు - "ఈ కవర్ని జాగ్రత్తగా పొయ్యిలో వేసి, 'టీ' కాయి. టీ ఎంతో రుచిగా, బావుంటుంది సుమా" అని.

ఆ కవర్‌తో కాచిన టీ తాగుతుంటే శివలింగానికి అమృతం తాగినంత ఆనందంగా వుంది. ఆ రాత్రి హాయిగా నిద్రపట్టింది.

శివలింగం ఆశించినట్లే అంతా జరిగింది.

రెండు నెలలు గడిచిపోయాయి. ఆ బ్రాంచి ఆఫీసులో ఎవ్వరికీ ప్రమోషన్ రాలేదు (అసలు కవర్ పోస్ట్ చెయ్యబడితే కదా!)

సరిగ్గా రెండు నెలల పదకొండో రోజున...

కృష్ణావతారం అన్నాడు శివలింగంతో- "ఈసారి మీకు ప్రమోషన్ వస్తుందను కున్నాను. కాని రాలేదు. చాలా చింతించదగ్గ విషయం!"

చాలా బాధపడిపోతున్నట్లు మొహం పెట్టాడు శివలింగం. లోలోపల మాత్రం అతనికి చాలా సంతోషంగా వుంది.

"శివలింగం మంచి పనిమంతుడు! ఇయర్ ఎండింగ్ కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్‌లో శివలింగం పేరు రాసి పంపుతానన్నారు మేనేజర్‌గారు. అలాగే పంపించారట! కాని ప్రమోషన్ నీకివ్వలేదు" విచారంగా తలాడించాడు కృష్ణావతారం.

శివలింగం కళ్ళముందు భూమ్యాకాశాలు గిర్రున తిరిగాయి.

—విపంచి

**Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderabad - 500 482.**

